




ముఖచిత్రం చంద్ర వినాయకీయం

చిత్రకారుడు వడ్డాది పాపయ్య

సమతా మూవీస్



# జూదగాడు

దర్శకత్వం
వి. మధుసూదనరావు
నిర్మాత
కె. చటర్జి
ఈస్ట్‌మన్ కలర్
సంగీతం. చక్రవర్తి




SREEPJ85

తప్పక చూడండి!



# మావూళ్లో మహాశివుడు

కలర్

నిర్ణేత **అల్లు అరవింద్** B.Sc.

దర్శకత్వం: **రాజాచంద్ర**

నిర్మాతలు **దాసరి సత్యనారాయణమూర్తి, వేగివీర్రాజు**

**శ్రీఫిలింస్** సోల్ డిస్ట్రిబ్యూటర్స్ అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్

VEEKAY

## చక్రపాణి అవార్డులు - 1979

రచయితల రచయిత్రుల కోరికపై అవార్డుల కొరకు వంపే కథల, నవలల పోటీ ఆగస్టు 31 వరకు పొడిగించబడినది

సంపాదకుడు,
యువ

## నవంబరు నెల

# భావ పరిచయ పోటీ

**బహుమానం రూ 25/-**

**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి**




గమనిక  వ్యాఖ్యలు పోస్టుకార్డు మీదనే వ్రాయాలి
సెప్టెంబరు 21 వ తేదీలోపు మాకు చేరాలి



మన నూతన ప్రధాని చరణ్ సింగ్

ఆంధ్రప్రభ
సచిత్రమాసపత్రిక
సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 40 సెప్టెంబరు 1979 సంచిక 3

శ్రీ మురార్జీ దేశాయి నాయకత్వాన 1977 మార్చి 24వ ఏర్పడిన కేంద్ర మంత్రిమండలి 1979 జులై 29వ తేదీతో పదవీభ్రష్టత పొందింది. 1979 జులై 28న, శ్రీ చరణ్‌సింగ్ అధ్వర్యాన కొత్త మంత్రిమండలి పదవిని స్వీకరించింది. భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందిన తరువాత, 32 సంవత్సరాలలో, ఒక మంత్రిమండలి మధ్యంతరంగా రాజీనామా చెయ్యడం, మరొక మంత్రిమండలి ఏర్పడడం, ఇదే మొదటిసారి. ఇలాటి పరిస్థితి ఏర్పడడం శోచనీయం.

1977లో మురార్జీ నాయకత్వాన మంత్రిమండలిని ఏర్పాటుచేసిన జనత పార్టీలోనే అంతరంగిక కల్లోలం ఏర్పడినందున సంభవించిన సంఘటన ఇది. జనతపార్టీ రెండుగా చీలిపోవడముతో దానిలో ఒక వర్గానికి నాయకుడైన శ్రీ చరణ్‌సింగ్, సంస్థా కాంగ్రెసు, ఇందిరా కాంగ్రెసు, సోషలిస్టులు మొదలైన వివిధ వర్గాల మద్దతుతో మంత్రిమండలి ఏర్పాటు జరగడంలోనే, సంస్థా కాంగ్రెసువారికి ఇచ్చే మంత్రిపదవుల విషయంలో ఒప్పందం సరిగా కుదరక, కొంత జాప్యం జరిగింది. ఏమయితేనేం, ఒక ఒప్పందం కుదిరింది. ఒక మంత్రి మండలి ఏర్పాటయింది ఈ మంత్రిమండలి స్థిరంగా ఎంతకాలం నిలబడుతుంది

ఏమైనా పేచీలు వస్తే, యీ మంత్రిమండల
వస్తుందనీ, అప్పుడు మళ్ళీ పార్లమెంటుకు ఎన్నికలు జరపడం తప్ప, వేరే మార్గం లేదని కొందరు ఊహిస్తున్నారు. అలాటి పరిస్థితి ఏర్పడకుండా, 1977 లో ఎన్నిక అయిన పార్లమెంటు పూర్తిగా అయిదు సంవత్సరాలపాటు నిలబడేటట్టుగా చూడవలసిన బాధ్యత నాయకులది.

ఎన్నికలు చాల వ్యయప్రయాసలతో కూడినవి అభ్యర్థులకే కాక, ప్రభుత్వానికి కూడా చాలా డబ్బు వ్యయమౌతుంది. ప్రభుత్వం ఖర్చుపెట్టే ప్రతిపైసా ప్రజలది. ప్రజల డబ్బును వెచ్చించడంలో ప్రభుత్వం అత్యంత జాగరూకతను ప్రదర్శించాలి. పన్నులు కట్టనవసరంలేనివారికి ఏ బాధా లేదు గాని, పన్నులు కట్టవలసినవారుమాత్రం యిప్పటికే పన్నుల భారంతో క్రుంగి పోతున్నారు. ప్రభుత్వ ఖర్చు ఎక్కువ అయినకొద్దీ పన్నుల భారం ఎక్కువ అవుతుంది. ప్రజా ప్రతినిధులూ, ప్రజా ప్రతినిధులలోంచి వచ్చిన మంత్రులూ, పన్నులను తగ్గించడానికి శాయశక్తులా ప్రయత్నించాలి గాని, పన్నులు పెరిగే కార్యక్రమాలను అనవసరంగా తలయెత్తనివ్వకూడదు.

పది వేల కోట్ల రూపాయల పైబడి వున్న కేంద్ర ప్రభుత్వ బడ్జెటులో, ఎన్నికలకు ఖర్చు అయే కొన్ని కోట్ల రూపాయలు ఏమంత పెద్ద మొత్తం కాదనే భావం కొందరికి వుండవచ్చును. ఖర్చు ఖర్చే. ఖర్చుకు కావలసిన డబ్బు ప్రజలనుంచి రావలసిందే.

ఖర్చు మాట అలా వుండగా, సాంఘిక పరిస్థితులలో ఎన్నికలు తెచ్చిపెట్టే బాధల సంగతి. ఎన్నికలు జరిగిన ప్రతి సందర్భంలోనూ, అసంఖ్యాక గ్రామాలలో మిత్రులు శత్రులయారు. అన్నదమ్ముల మధ్య, మామ అల్లుళ్ళ మధ్య, తండ్రి కొడుకుల మధ్య విరోధాలు వచ్చి ఎన్నో కుటుంబాలు చిక్కులలో పడ్డాయి. ప్రజారాజ్య సంస్థాపనలో, యీ పోటీలు తప్పవని అనుకున్నా, యిలాటి పేచీలు వచ్చే అవకాశాలను ఎంతవరకు తగ్గిస్తే అంత మంచిది. ఒకసారి ఎన్నిక అయిన పార్లమెంటు గడువు అయిదేళ్ళు అని రాజ్యాంగంలో నిర్ణయింపబడినది కనుక ఆ గడువులోపల ఎన్నికలు జరుగకుండా చూడవలసిన బాధ్యత నాయకులది. ఎన్నికలు జరిగిన తరువాత, ఏ పార్టీకి మెజారిటీ లేనట్లయితే, రెండు మూడు పార్టీలు కలిసి అఖిలపక్ష ప్రభుత్వాన్ని ఏర్పాటుచెయ్యడంలో తప్పు ఏమీలేదు.

1979 జులైలో ఏర్పడిన మంత్రిమండలి కూడా అలాటిదే కొన్ని పార్టీలు ప్రస్తుతం మంత్రిమండలిలో లేవు ఆ పార్టీలను కూడా కలుపుకొని, మంత్రి మండలిని విస్తరింపచేసి, మిగిలిన మూడు సంవత్సరాలు కూడా, ప్రస్తుతపు పార్లమెంటు కొనసాగేటట్టు శ్రీ చరణ్‌సింగ్ ప్రభృతులు ప్రయత్నిస్తారని మా ఆశయం

## సెప్టెంబరు నెల యువ భావపరిచయ పోటీ

*రూ 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య*



*'పూరి గుడిసెలోని మాం దర్శిని*
*ప్రగతికి ప్రత్యక్ష నిదర్శనం"*

కె పూర్ణచంద్రరావు, హైదరాబాద్



జూలై 1న వనమహోత్సవం సందర్భంగా రాష్ట్రగవర్నర్ రాజ్‌భవన్‌లో మొక్కను నాటరు



జూలై 1న శ్రీ రాయలసీమ పేపర్ మిల్స్, కర్నూలులో ప్రారంభోత్సవం చేసిన ముఖ్యమంత్రి చెన్నారెడ్డి



1న వనమహోత్సవం సందర్భంగా రాష్ట్రగవర్నర్ రాజ్‌భవన్‌లో మొక్కను నాటరు



లై 1న శ్రీ రాయలసీమ పేపర్ మిల్స్, కర్నూలులో ప్రారంభోత్సవం చేసిన
ముఖ్యమంత్రి చెన్నారెడ్డి



జూలై 3న రాష్ట్రపతికి ఐంద్రజాలికుడు పి. సీ. సర్కార్ జూనియర్
తుపాన్ బాధితుల సహాయార్థం పర్సుని అందజేశారు



జూలై 9న ఉస్మానియా యూనివర్సిటీ రజితోత్సవసభలో ప్రసంగిస్తున్న



జూలై 15న స్టేట్ కేరక్టర్ యూత్‌ఫోర్స్ 8వ వార్షికోత్సవంలో పాల్గొన్న ప్రముఖులు: ఆంధ్రప్రదేశ్ బిల్డర్స్ ఫెడరేషన్ అధ్యక్షులు టి. సుబ్బరామిరెడ్డి, రాష్ట్ర గవర్నర్ శ్రీ కె. సి. అబ్రహాం, తిరుపతి దేవస్థానం అధ్యక్షులు శ్రీ యన్. రమేశన్, ఐ.జి.పి. శ్రీ యం. వి. నారాయణరావు, రాష్ట్ర సర్వీస్ కమీషన్ సభ్యులు శ్రీ టి.వి. నారాయణ



# జింక్ లోపమా?
# పుష్కలమైన పంట దిగుబడికి







# అన్నపూర్ణ
## జింక్ సల్ఫేట్ సంపూర్ణ సహకారం అందజేస్తుంది

పంట పెరుగుదలకు కావలసిన పోషక పదార్థాలలో జింక్ అతి ముఖ్యమైనది. భూసారంలో తగినంత జింక్ లేనట్లయితే పంట పెరుగుదల దెబ్బతింటుంది.

మీ పైర్లు జింక్ లోపంతో అధిక దిగుబడిని ఇవ్వటం లేదా? మీరు విచార పడనవసరంలేదు-అన్నపూర్ణ జింక్ సల్ఫేటును సిఫార్సు చేయబడిన మోతాదులో ఉపయోగించి మీ భూసారాన్ని వృద్ధిచేయండి. మీ పైర్లు ఆరోగ్యవంతంగా పెరగటాన్ని మీరు త్వరలోనే గమనిస్తారు. అధిక దిగుబడిని ఖచ్చితంగా సాధిస్తారు.

అన్నపూర్ణ జింక్ సల్ఫేటు

- 22 నుండి 24 శాతం వరకు మెటాలిక్ జింక్ కలిగి యున్నది.
- హెక్టేరుకు 50 కి.గ్రా. చొప్పున మూడు కాలాల్లో ఒక సారి దుక్కిలో, సాధారణ మోతాదుగా ఉపయోగించవచ్చును.
- జింక్‌లోపం ఉన్న చవుడు భూములలోనయితే హెక్టారుకు 100 కి.గ్రా. వరకు సాధారణ మోతాదుగా వాడవచ్చును.
- జింక్‌లోపం పైరుమీద కనబడితే జింక్ సల్ఫేటును మూడుసార్లు పిచికారి చేయవచ్చును.
- జింక్‌సల్ఫేటు మరియు సూపర్ ఫాస్ఫేటు వేరువేరుగా 48 గంటల తేడాతో ఉపయోగించాలి.
- మీ సౌకర్యంకోసం 50 కిలోల పాలిథీన్ సంచులలో లభిస్తుంది.

రైతుల పాలిట
కామధేనువు - **అన్నపూర్ణ**

ఉత్పత్తిదార్లు :
**పారమౌంట్ అగ్రో కెమికల్స్ ప్రైవేట్ లిమిటెడ్**
90 డి, రోడ్డు నం. 14, ఐ.డి.ఏ., జీడిమెట్ల
హైదరాబాదు - 500 854.
(ఏ.పి. స్టేట్ అగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్ లిమిటెడ్ వారితో ఉమ్మడి యాజమాన్యంగల సంస్థ)

నవల

# కాలమహిమ

'కనకదుర్గ'



"శైలూ, ప్లీజ్, కొంచెం సహాయం చెయ్యాలేవే?"

"అన్నయ్యా, నువ్వింకేం చెప్పినా చేస్తాను. పద్మతో ఏంచెప్పమన్నా చెప్తాను. పోనీ నాన్నతో చెప్పమంటే చెప్తాను. కానీ అమ్మో, అమ్మతో చెప్పటమంటే నాకూ భయమే."

"నువ్వు కొంచెం వార్త అందించవే. మిగతా విషయాలు నేను చూసుకుంటాను"

"చెప్పగానే అమ్మకి కోపం వస్తుంది. ఆ కోపం అంతా నామీద చూపించాక ఇక నువ్వు చూసేదేమిటి? అయినా ప్రేమించటానికి అంత ధైర్యమున్నవాడివి, అమ్మకి చెప్పేందుకుకేనా భయం? అయినా అన్నయ్యా, అమ్మ ఒప్పుకుంటుం దనుకోటం కల్ల. యిక అమ్మ కాదంటే నాన్నేమీ మాట్లాడరు. అక్క పెళ్ళి ముందు అమ్మ ఎన్ని సంబంధాలు వద్దనేది గుర్తుందా? శాఖాభేదమే ఒప్పుకోనిది వేరేకులం అమ్మాయిని నువ్వు, పెద్దకొడుకువి, వంశోద్ధారకుడివి, చేసుకుంటానంటే 'సరే' అంటుందా? ఏవిధంగానూ ఇది అయ్యేపని కాదు.

హతాశుడైపోయాడు శ్రీనివాస్. తన మనస్సు తనని వేస్తున్న ప్రశ్నలే చెల్లెలు శైలజ వేసేటప్పటికి ఏమీ జవాబు చెప్పలేకపోయాడు. నిజమే, ఏరకంగా ఆలోచించినా పద్మతో తన పెళ్ళికి అమ్మ ఒప్పుకుంటుందన్న ధైర్యం కలగలేదు శ్రీనివాస్‌కి.

"అయినా ఏదోరకంగా అమ్మకి తెలిసిపోతే, తరవాత ఆవిడ అడిగే ప్రశ్నలకి జవాబులు చెప్పవచ్చు. సినిమాల్లోలాగ బాంబుపేల్చినట్టు 'అమా, నేను పద్మని పెళ్ళిచేసుకుంటాను' అని చెప్పడం నిజజీవితంలో కొంచెం కష్టంగానే వుంది.



శైలూ పద్మ స్నేహితురాలే కదా సహాయంచేస్తుందేమో అంటే నాకంటే భయపడుతోంది" అనుకున్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్, శైలజ అంత భయపడే ఆ సదరు అమ్మగారి పేరు లలితాంబ గారు. పిల్లలందరూ ఆవిడంటే భయభక్తులు చూపించడంలో ఏమీ ఆశ్చర్యం లేదు. చిన్నప్పటినుంచీ అలాగే పెంచింది ఆవిడ. అంటే కేవలం భయపెట్టి కాదు. వారికి కావలసినవి చేస్తూనే, అందరికీ అన్నీ సమయానికి అందిస్తూనే ఎప్పుడూ యింట్లో ఏదో పని చేస్తూవుంటుందావిడ. పదమూడేళ్ళకే పెళ్ళయి అత్తవారింటికి వచ్చినా అయిదేళ్ళు పిల్లలు కలుగకపోవడంతో వుమ్మడికుటుంబం



లోని బరువు బాధ్యతలన్నీ నెత్తిన వేసుకుంది. ఆస్తిపరులైన అత్తగారింట్లో యిద్దరు మరుదులు, ముగ్గురు ఆడపడుచులు - అందరూ తన భర్తకంటే చిన్న వాళ్ళవడంవలన-ఆవిడే చూడవలసివచ్చింది. భర్త సి.యే. అయి హైదరాబాదులో ప్రాక్టీసుకి వచ్చేసరికి ఆడపడుచుల పెళ్ళిళ్ళయిపోయాయి. మరుదులుకూడ కాలేజీ చదువులకి వచ్చేశారు. అప్పుడు లలితాంబగారు, శంకరశాస్త్రిగారు తమ పిల్లలిద్దరితో హైదరాబాదు వచ్చేస్తుంటే, అత్తగారు, మామగారు కోడలెళ్ళిపోతోందే అని ఎక్కువ బాధపడ్డారు. అక్కడ అందరికీ తలలో నాలుకగా మెలిగిన లలితాంబగారు తన కాపురంలో కూడా అలాగే వ్యవహరించారు. రోజూ భర్తకి కావలసిన బట్టలు తీసిపెట్టటం దగ్గర్నించీ, పిల్లల కాలేజీ ఫీజులు, పుస్తకాలదాకా ఆవిడే అన్నీ చూసుకునేది. దానితో శంకరరంగారు తన కుటుంబంలో జరుగుతున్నవి గమనిస్తున్నా, ఏ సమస్యలూ పట్టించుకోకుండానే హాయిగా గడిపేశారు. ఆయన లోకం ప్రాక్టీసు, మిగిలిన టైములో కులాసాగా పిల్లలతో కబుర్లుచెప్పడం. ఎప్పుడూ వాళ్ళని పరీక్షలెప్పుడని గాని, చదువుతున్నారా అని గాని అడగరు. అయినా పిల్లలు నలుగురూ చదువుల్లో ఎప్పుడూ చురుగ్గానే వుండేవారు. తల్లిగా ప్రేమనే కాక వారికి తండ్రిలాగా భయాన్ని వుంచిన గౌరవం ఎప్పుడూ భార్యకే యిచ్చేవారు శంకరరంగారు. అందుకే ఆవిడ అన్నమాటకి ఆ యింట్లో తిరుగులేకుండా అయింది. యాభై ఏళ్ళు దాటినా, యింట్లో వంటమనిషివున్నా, పొద్దున్నే లేచి అందరికీ కాఫీలు కలపడం లలితాంబగారే చేస్తారు. పిల్లలకి ఏడింటిలోపలే లేవాలనే విషయం మర్చిపోకుండా వుంచేదావిడ అలవాటు. అట్లాగే ఏ విషయాన్నీ తన నోటితో చెప్పకుండానే ఎదుటివాళ్ళచేత చేయించే నేర్పు ఆవిడకి వుందనే విషయం భర్త, పిల్లలు బాగా గ్రహించారు. అందుకే ఏ విషయంలోనూ ఆవిడకి ఎదురు సమాధానం చెప్పడం అలవాటుచేసుకోలేదు వాళ్ళు.

"శైలూ, ఏంచేస్తున్నారే, భోజనాలకి రండి." వరండాలోకి వచ్చి పిలిచిన తల్లికి "వస్తున్నాం, అన్నయ్య రూమ్‌లో పుస్తకాలు తీసుకుని వచ్చేస్తున్నా" అని తలుపుదగ్గరకు వచ్చి సమాధానం చెప్పింది శైలజ.

"రా అన్నయ్యా, అందరూ వచ్చేసినట్టున్నారు డైనింగ్ హాల్లోకి"

"నేను భోజనం చెయ్యను," అన్నాడు శ్రీనివాస్ వుక్రోషంగా. "నీ యిష్టం. అమ్మ అడిగితే నాకేం తెలియదని చెప్తాను. నువ్వే సమాధానం చెప్పుకో," అని క్రిందికి వెళ్ళిపోయింది శైలజ. చేసేదేం లేక తలుపులు గట్టిగా దగ్గరికి వేసి క్రిందికి వచ్చాడు శ్రీనివాస్.

మర్నాడు పద్మవాళ్ళింటికి వెళ్ళాడు శ్రీనివాస్. పద్మ అన్నయ్య శేషగిరి, శ్రీనివాస్ యిద్దరూ హెచ్.ఎమ్.టి.లో యింజనీర్లు. పద్మజావాళ్ళ తల్లిదండ్రులు పల్లెటూళ్ళో పొలాలు చూసుకుంటూ ఏడాదిలో దాదాపు పదినెల్లు అక్కడే వుంటారు. ఇంకొక ఆరునెలల్లో పద్మజ హౌస్‌సర్జన్సీ కాగానే ఆమెకి, శేషగిరికి పెళ్ళిళ్ళు చెయ్యాలని వాళ్ళ వుద్దేశ్యం. పెద్దవాళ్లెవరూ వుండరు కనుక శ్రీనివాసే పద్మజ యింటికి వచ్చేవాడు, ఆమెని కలుసుకోడానికి. ఆ రోజు తన బాధంతా దాపరికం లేకుండా వెళ్ళబోసుకున్నాడు పద్మజ దగ్గర.

"పద్మా! ఏంచేయాలో తోచడంలేదు. మా అమ్మ సంగతి నీకు బాగా తెలుసు కదా. విషయం చెప్పడానికే సంకోచంగా వుంది. తనెలాగా ఒప్పుకోదు. అప్పుడప్పుడు అనిపిస్తుంటుంది, పెళ్ళిచేసేసుకుని చెప్దామని."

"శీనూ ఆ పనికిమాత్రం నేను ఒప్పుకోను. వాళ్ళు తిట్టినా, ఏమన్నా సరే, చెప్పి ధైర్యంగా పెళ్ళిచేసుకోవాలి. ఇప్పటిదాకా ఈ విషయం శైలజకి, మా అన్నయ్యకి, మా నీరజకి తప్ప ఎవరికీ తెలియకుండానే జాగ్రత్తపడ్డాం. కానీ తల్లిదండ్రులకి చెప్పకుండా చేసుకోడం నాకిష్టంలేదు. మీ అమ్మగారు అస్సలు ఒప్పుకోరని నాకు తెలుసు. శైలూ చెప్తూవుంటుంది. మీ బ్రాహ్మలలోనే వేరే శాఖలు ఆవిడ యిష్టపడరుట కదా. ఏకంగా నాయుళ్ళ అమ్మాయిని చేసుకుంటే ఆవిడ నిన్ను క్షమిస్తారనుకోను. యిలా మాట్లాడుతున్నానని ఏమీ అనుకోకు శీనూ. జరగబోయేది వూహిస్తున్నానంతే," అంది శ్రీనివాస్ చేతిమీద తన చేతినుంచి పద్మజ.

"నిన్నసలు కలుసుకోకుండా వుండవలసింది పద్మా. యింత మంచి అమ్మాయిని చూసి ఒదిలేసేవాడు మూర్ఖుడనిపించింది. కనీసం మీ అన్నయ్యే మా కొలీగ్ కాకపోయినా బాగుండేది. మనం యిలా ప్రేమలో ఎందుకు పడ్డాం అని యిప్పుడు బాధగా వుంది."

"నేనూ అప్పుడప్పుడు విచారిస్తూంటాను శీనూ, అనవసరంగా నీ కులాన్ని పాడుచేస్తున్నానే అని."

"అలా అనకు పద్మా. మొదట్నించీ నాకు కులాలమధ్య అంతరాలలో నమ్మకం లేదు. నేను లక్ష్యపెట్టేది మనిషిని మనిషిగా కానీ, కులాన్ని కాదు. అయినా యిప్పుడు ప్రాబ్లెం మనకీ భేదాలున్నాయీ అని కాదు, పెద్దవాళ్ళని ఎలా ఒప్పించాలి అని. మీ తల్లిదండ్రులు మాత్రం తేలికగా ఒప్పుకుంటారా అని."

"తెలికగానా? అస్సలు ఒప్పుకోరు. ఒకసారేమయిందో తెలుసా. అప్పుడు షేము ఫోర్త్ యియర్‌లో వున్నాము. శైలజ, కామేశ్వరి, ఇందిర ముగ్గురూ మా యింటికి వచ్చారు. అప్పుడు మా అమ్మగారి మేనమామ ఏదో పనుండి ఈ వూరు వచ్చారు. ఆయన భార్య వీళ్ళందరి నాన్నలపేర్లు, యింటిపేర్లు అన్నీ కనుక్కుంది. వాళ్ళెళ్ళిపోయాక నన్నడిగింది. 'ఏమే, వీళ్ళందరూ బాపనపిల్లలేనా?' అని 'ఔను మామ్మా' అన్నాను. 'ఏంటీ అలా బాపనవాళ్ళతో అంత స్నేహాలు? మంచిది కాదు. మీ క్లాసులో మన కులంవాళ్ళెవరూ లేరా?' అంది. నాకు నవ్వొచ్చింది. కానీ పెద్దావిడ ఏమైనా అనుకుంటుందని 'వాళ్ళంతా మంచివాళ్ళు మామ్మా' అని చెప్పి వూరుకున్నాను. మన పెద్దవాళ్ళ అభిప్రాయాలు యిలా వుంటే వాళ్ళ నెప్పటికైనా మార్చగలమనుకుంటున్నావా శీనూ?"

"మరి మన విషయం మీ వాళ్ళతో ఎలా చెప్తావు?"

"చెప్తానంతే. తరువాత ఎంత గొడవ జరిగినా లెక్కచెయ్యకూడదని నిర్ణయించుకున్నాను. మనం పెళ్ళివిషయం ఎప్పుడూ అన్నది నిర్ణయించుకున్నాక, వాళ్ళకి చెప్పి శలవుతీసుకుంటాను. శీనూ, వాళ్ళెప్పుడైనా ఆడపిల్లని యింకోరింటికి పంపాల్సిందే. అయితే ఆ యిల్లు నేనే ఎన్నుకున్నాను. అందువల్ల మావాళ్ళకి జరిగే నష్టం ఏంలేదు ఏమంటావు?"

శ్రీనివాస్ ఆశ్చర్యంగా పద్మవంక చూశాడు. ఆడపిల్లకి ఎంత ధైర్యం! తనింకా అమ్మ ఏమంటుంది అని ఆలోచిస్తున్నాడు. వాళ్ళ వాళ్ళు చేసే సవాళ్ళని ఎదుర్కొనేందుకు పద్మ అప్పుడే సిద్ధంగా వుంది! తనకి కూడా యింతకాలం ఏమీ అనిపించలేదు. ఎందుకంటే ఎప్పుడు తమ పెళ్ళి గురించి ఆలోచన వచ్చినా, పద్మతో తన జీవితం వూహించుకున్నాడే తప్ప, అమ్మ కోపం గురించి ఆలోచించడం వాయిదా వేశాడు. శైలజ స్నేహితురాలనైనా అమ్మ పద్మని యిష్టపడే వుంటుంది అన్న ఆలోచన చేయడమే బాగుంటుంది. అదే అన్నాడు.

"కానీ పద్మా, శైలూ ఫ్రెండ్‌గా యిన్నేళ్ళనుంచి మా అమ్మ నిన్ను చూస్తూనే వుంది కదా!"

"ఎంత పిచ్చివాడివి శీనూ. మనింట్లో పనిచేసే పనిపిల్లని జాలిగా చూడగలం గానీ, మన అన్నకో, తమ్ముడికో యిచ్చి పెళ్ళి చెయ్యగలమా?"

"అన్యాయంగా మాట్లాడుతున్నావు పద్మా. నీకేం తక్కువయింది? మీ కులంలో అయితే మీ వాళ్ళిచ్చే కట్నానికి, నీ చదువుకి, అందానికి ఏ లక్షాధికారో నిన్ను చేసుకునేవాడు. మరి నన్నెందుకు చేసుకుందా మనుకుంటున్నావు?"

"మన పెద్దవాళ్ళ ఆలోచనలు చెప్పా శీనూ. అంత సెంటిమెంటల్ అయిపోతావేమిటి. పోనీ ఒక విషయం చెప్తా విను. ఇన్నేళ్ళబట్టి మీ యింటికి వస్తున్నా కూడా, నేనెప్పుడూ మీ వంటింట్లోకి కానీ, పూజగదిలోకి కానీ రాలేదు. రాలేదంటే శైలూగానీ, మీ అమ్మగారుకానీ రమ్మని పిలవలేదు. కామేశ్వరి, ఇందిర అప్పుడప్పుడు కాఫీలు కలపడంలో మీ అమ్మగారికి సహాయంచేస్తారు, తెలుసా. ఆవిడ కూడా ఇందిరతో బాగా చనువుగా వుంటారు. వాళ్ళు మీ శాఖేట కదా. మళ్ళీ కామేశ్వరీ వాళ్ళు నియోగులట. నా కివన్నీ వాళ్ళు చెప్తేనే తెలిశాయిలే. మరి స్నేహ సంబంధాలలోనే యింత తేడా చూపిస్తే, యిక నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానంటే.... ఇది చెప్పి నిన్ను బాధపెట్టివుంటే క్షమించు. ఇవ్వాళ నువ్వు చాలా ఫ్రాంక్‌గా మాట్లామవు కాబట్టి అన్నీ నీకు చెప్పడం నా ధర్మం అనిపించింది. ఏం శీనూ, కోపం వచ్చిందా, మీ అమ్మగార్ని గురించి అట్లా మాట్లాడాననిః" అంది పద్మ శ్రీనివాస్ రెండు చేతుల్ని తన చేతుల్లో తీసుకుంటూ.

"లేదు పద్మా, మన సమస్య ఎంత జటిలమో తెలిసివస్తోంది. ఇన్నాళ్ళూ నేను ఈ విషయాన్ని గురించి యింత లోతుగా ఆలోచించలేదు. బహుశ యిష్టం లేక ఆలోచించలేదేమోః ఇక నిర్ణయించుకోవలసింది మనమే. నిన్ననే ఒక పిచ్చిపని చేశాను. శైలూని మా అమ్మకి చెప్పమని బ్రతిమిలాడాను. అది చాలా భయపడింది. ఇక సమస్యలేదు. సమయం చూసి నేనే చెప్పేస్తాను."

"శీనూ, ప్లీజ్ నా హౌస్‌సర్జన్సీ అయ్యేదాకా ఆగు. ఆ తరువాత ఎప్పుడు చెప్పేది ఆలోచించుకుందాం."

"అలాగే. అప్పటికి నాకూ ఒక దారి వస్తుందేమో చూస్తాను."

"నీకా, నువ్వేం చేస్తావుః"

"చెప్తాగా, తరవాత చెప్తా." అని పద్మజ చేతిని సున్నితంగా నొక్కి వదిలేసి లేచి వెళ్ళిపోయాడు శ్రీనివాస్.

కానీ వాళ్ళనుకున్న సమయం అనుకోకుండానే వచ్చేసింది. అన్నయ్య అంతగా బ్రతిమిలాడాడు కదా అని శైలజ ధైర్యంచేసి తండ్రి దగ్గరకి వెళ్ళింది. సాధారణంగా శంకరంగారు భోజనాలయాక పదకొండుగంటల దాకా తన స్టడీ రూమ్‌లో చదువుకుంటారు. తల్లి చూడకుండా, మర్నాడు రాత్రి భోజనాలయాక స్టడీరూమ్‌లో దూరింది శైలజ. శంకరంగారు ఆశ్చర్యంగా చూశారు కూతురి వంక.

"నాన్నా, నేను వచ్చి కూర్చోవచ్చాః" అంది శైలజ.

"రామ్మా, రా, ఏమిటి విశేషం? ఇందాక భోజనాల దగ్గర ఏం మాట్లాడలేదు. ఏమిటి సంగతి?" కొంత ఆశ్చర్యంగానూ, ఎంతో వాత్సల్యంగానూ అడిగారాయన.

"నాన్నా, నేనుగాని, అన్నయ్యగాని ఎప్పుడైనా మిమ్మల్ని 'నొప్పించామా?"

"అదేం ప్రశ్నమ్మా. నేను మాత్రం మీలాంటి పిల్లలుండటం మా అదృష్టం అనుకుంటాను."

"నాన్నా, ఇప్పుడేదైనా మీకిష్టంలేని పనిచేస్తే ఏమనుకుంటారు? మేం చెడ్డ వాళ్ళం అనుకుంటారా?"

"అమ్మా శైలూ, వివరంగా చెప్పు. ఎందుకు బాధపడ్తున్నావు?"

"ఇప్పుడో సమస్య వచ్చింది నాన్నా. నాకేమో అది తప్పనిపించడంలేదు. అమ్మ మాత్రం అస్సలు ఒప్పుకోదు. మరి నేననుకున్నట్టు చెయ్యాలా? అమ్మ కిష్టమైనట్టు చెయ్యాలా?"

"ఒక జడ్జిలా సమాధానం చెప్పాలంటే నేనిలా చెప్తాను. అదేదో నువ్వు ఒదులుకోగలిగినదైతే, తప్పకుండా ఆ పనిచేసి మీ అమ్మని సంతోషపెట్టొచ్చు. కాని అది చాలా ముఖ్యమైనదేతే, అదేమిటో నువ్వు చెప్పేదాకా నేనేం జవాబు చెప్పలేను." అదేమిటో తెలుసుకోవాలనే కుతూహలం పెరిగినా, ఛాయిస్ కూతురికే వదిలేశారు చెప్తే చెప్పమన్నట్టు శంకరంగారు.

అయిదు నిమిషాలు ఏం మాట్లాడలేదు శైలజ. తరవాత నెమ్మదిగా అడిగింది "నాన్నా, నాఫ్రెండ్ పద్మని గురించి మీ అభిప్రాయం ఏమిటి?" ఎవరో అబ్బాయి గురించి చెపుతుందేమో కూతురు అన్న వూహ తప్పినా, తేలిగ్గా నిట్టూర్చారు శంకరంగారు.

"చాలా మంచిపిల్ల, నెమ్మదైనది. నేను చూసినంతలో మీ నలుగురిలోనూ తక్కువ మాట్లాతుతుంది. కనుక బహుశా ఎక్కువ తెలివైంది."

తండ్రి నవ్వుతూ సూటిగా సమాధానం చెప్పేసరికి శైలజకి ధైర్యం వచ్చింది.

"నాన్నా, అన్నయ్య పద్మని పెళ్ళిచేసుకుంటే ఏం?" అంది తండ్రిముఖంలోకి చూస్తూ.

శంకరంగారికి విషయం కొంచెం అర్థం అయింది.

"వాళ్ళ కులమేమిటమ్మా?"

"ఆ అమ్మాయి మంచిదైతే కులమేమిటి నాన్నా, అయినా వాళ్ళు నాయుళ్లు"

"మరి మీ అమ్మ ఒప్పుకుంటుందనే అనుకుంటున్నావా?"

"అమ్మ ఒప్పుకోదు నాన్నా, నువ్వే ఒప్పించాలి."




"అంతే వాళ్ళిద్దరూ నిర్ణయించుకున్నారా?" తండ్రి నోటినుంచి ఈ ప్రశ్న రాగానే భయపడింది శైలజ.

"నాన్నా, ప్లీజ్. ఈ విషయంలో వాళ్ళిద్దరూ అనుకున్నా, ఆశపడ్డా అమ్మ ఒప్పుకోనిదే అన్నయ్య ఏమీ చేయలేడు. వాళ్ళ తరఫున నేను రిక్వెస్టుచేస్తున్నా మిమ్మల్ని ఏం నాన్నా?"

సాలోచనగా వుండిపోయారు శంకరంగారు. పిల్లలకి తల్లి కోపమే తెలుసు కానీ, ఆయనకి భార్య పట్టుదల కూడా తెలుసు. అందుకే వీలైనన్ని విషయాలు ఆవిడ యిష్టానికే వదిలేస్తారు ఆయన. ఎంత ఆలోచించినా భార్యను ఒప్పించే విధానం ఆయనకు తట్టలేదు. అసలు కులాంతర వివాహాలు ఆయనా సమ్మతించరు. కానీ లోకానుభవాన్ని బట్టి దాన్ని కాలానికి కట్టబెట్టి సర్దుకోగలరు. కానీ లలితాంబగారు.... పిల్లలెవరూ తనమాట ఎప్పుడూ జవదాటరన్న భావం ఆవిడలో చాల గట్టిగా వుంది. పెద్దమ్మాయిని బి. యే. తో ఆపించి పెళ్ళి చేసేసింది. పెద్దబ్బాయిని యింజనీరు చెయ్యాలని పట్టుబట్టింది. శంకరంగారికి పెద్దకొడుకు సి. యే. అయితే బాగుంటుందని వుండేది. కానీ లలితాంబగారు కొడుకుకి మొదట్నించీ యింజనీరవ్వాలన్న పాఠాలే ఒంటపట్టించింది. అందుకే భర్తని తృప్తిపరచాలని చిన్నకొడుకు రఘురాంని బి. కాం. చదివిస్తోంది. శైలజ మాత్రం తల్లి బి. యెస్సీ. చదవమని చెప్పినా వినకుండా చాల గొడవ పెట్టి మెడిసిన్‌లో చేరింది. లలితాంబగారికి లోలోపల కూతురు డాక్టరవడం యిష్టముండబట్టి చివరికి సరే అంది. అయినా దానికీ ఒక షరతు పెట్టిందావిడ.

ఎమ్. బి. బి. యస్. అవుతూనే తల్లి మాటవిని పెళ్ళిచేసుకునేట్టు, ఇంకా చదవాలంటే పెళ్ళయాకే చదివేట్టు. ఇవన్నీ చూసిన శంకరంగారు భార్య తెలివితేటల్ని మాత్రం మెచ్చుకోకుండా వుండలేకపోయారు. దాన్నిబట్టి అందరూ తమిష్టమొచ్చినట్టు వున్నామనుకుంటూనే లలితాంబగారి యిష్ట ప్రకారం నడుస్తారని ఆయనకి బాగా అర్థమైంది. ప్రస్తుత సమస్య ఆయన్ని చాలా కలవరపెట్టింది. భార్యని ఒప్పించడం అసాధ్యమని ఆయనకి తెలుసు. ఎందుకంటే లలితాంబగారిలాంటి వ్యక్తిత్వం వున్నవాళ్ళకి ఏవీ అడ్డంకులు రానే కూడదు. ఎవరూ ఎదురుతిరగనంతకాలం వాళ్ళంత మంచివాళ్ళుండరు. కానీ ఎవరైనా ఎదురు తిరిగితే వాళ్ళ అహం బాగా దెబ్బతినే ప్రమాదముంది. అలా జరిగితే వాళ్ళు అవతలివాళ్ళని క్షమించడం కష్టం. ఈ రకమైన ఆలోచనలతో శంకరంగారు నాలుగైదు రోజులు సతమతమయ్యారు. ఒక ఆదివారం సాయంత్రం బిర్లామందిర్ వెడదామంటూ భార్యని బయలుదేరదీశారు. అక్కడ కూర్చుని భార్యతో పిల్లల గురించి మామూలుగా మాట్లాడుతున్నట్టు మాట్లాడారు.

"లలితా మన శీనుకి ఎప్పుడు పెళ్ళిచేద్దాం?"

"ఏం, నన్ను రిటైర్ చేద్దామనుకుంటున్నారా? కోడలి గురించి ఆలోచిస్తున్నారు?" చాలా రోజుల తర్వాత భర్తతో తీరిగ్గా వున్నానన్న వుల్లాసం ఆవిడ మాటల్లో ధ్వనించింది.

"మన పెళ్ళైనప్పుడు నాకు పద్దెనిమిదేళ్ళోయ్. ఇప్పుడు నీ కొడుకుకి యిరవై ఎనిమిదేళ్ళు."

"ఆ కాలం వేరులెండి. ఎన్ని మార్పులొచ్చాయి. నన్ను స్కూలికి పంపిచారా మా వాళ్ళు? ఇంట్లో చదువుకున్న చదువులే. మరి మన అమ్మాయిల్లోనే ఒకర్తి బి. యే., ఒకర్తి డాక్టరు. నా పెళ్ళి పదమూడేళ్ళ కయితే, మన రుక్మిణికి పెళ్ళికి యిరవై ఒక్కేళ్ళు. ఇక శైలజకి యిరవై రెండు వెడతాయి దాని హౌస్ సర్జన్సీ పూర్తయేసరికి. మరి కాలం మారలేదంటారా?"

"కాలం మారిందంటే గుర్తొచ్చింది లలితా. మా ఫ్రెండ్ కొడుకు ఒకతను ఒక హరిజనమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడట. పదిరోజులైందట పెళ్ళై. నిన్ననే యిక్కడి ఆడిటరు ఒకాయన చెప్పాడు."

"అదేం పొయ్యేకాలమండీ, మీ స్నేహితులు ఏ కులం?"

"బ్రాహ్మలే. నాకు చిన్నప్పటి క్లాస్‌మేట్. వాడి కొడుకు డాక్టరు. ఆ

అమ్మాయి అతని క్లాస్‌మేట్‌ట. చాలా తెలివికల పిల్లట. ఇద్దరూ డిస్టింక్షన్‌లో పాసయి, యిప్పుడు ఎమ్. ఎస్. చేస్తున్నారట. చూడటానికి కూడా ఆ అమ్మాయి చాలా బాగుందట."

"ఆ, మీరు మరీ చూసివస్తే చెప్తున్నారు" కోపం ఎవరిమీద చూపాలో తెలియక శంకరం గారిమీద చూపించారు.

తన కట్టుకథ నిజమని భార్యచేత నమ్మించాలని నొక్కి మాట్లాడారు శంకరంగారు.

"లేదు లలితా, ఆ అడిటరుగారు చెప్పారు. పైగా ఆయన ఏం అన్నారో తెలుసా. 'చూడండీ! మనం యింకా కులాలు, గోత్రాలు అని పట్టుకు కూర్చుంటున్నాం కానీ వాళ్ళద్దరినీ చూస్తుంటే ఎవరికి తగ్గట్టు వాళ్ళు చేసుకోడం మంచిదనిపించింది', అన్నారు."

"ఏడిసినట్టే వుంది. సాంప్రదాయసిద్ధంగా లేక కులమేమిటి అని చేసు కుంటే యివాళ, రేపు బాగానే వుంటుందేమో. కాని తరవాత....? పెద్దవాళ్ళు పిచ్చివాళ్లై పెట్టారా ఈ సాంప్రదాయాలన్నీ. ఏవో బలహీనతలకి లోబడేవాళ్ళు పాటించనంత మాత్రాన అనాదినుంచీ వస్తున్న మన సాంప్రదాయాలని, ఆచా రాలని కాదని ఎవరు బ్రతకగలరండీ? వాటిని లక్ష్యపెట్టనివాళ్ళు ఎప్పటికైనా బాధపడవలసిందే."

స్థిరంగా చెప్పిన ఆ తీరు శంకరంగారి వూహని బలపరిచి, అయనలోని భయాన్ని పెంచింది. నవ్వులాటకి అన్నట్టే ఆయన తన సందేహాన్ని బయట పెట్టారు.

"రేపు నీ పిల్లలెవరయినా అట్లా చేస్తే ఏం చేస్తావు?"

"నా పిల్లలెప్పటికీ అలా చెయ్యరు. ఆ నమ్మకం నాకుంది."

ఎంతో నమ్మకంగా ధ్వనించిన ఆ కంఠస్వరములోని అహంకారపు చాయలు గ్రహించిన శంకరంగారు యిక తను చేయగలిగిందేమీలేదని భావించారు. అయితే లలితాంబకి నిజం చెప్పి శ్రీనివాస్ చెప్పవలసిన అవసరం తప్పించడం, లేదా తను అసలు కల్పించుకోకుండా వూరొక్కడం. శ్రీనివాస్ గట్టి నిర్ణయం తీసుకున్నట్టయితే తను చెయ్యగలిగిందేమీలేదు. కొడుకే తల్లిని ఎదుర్కోవాలి. లేదా కాలమే అన్నిటిని తీరుస్తుంది అనుకున్నారాయన. కాసేపు వేరే కబుర్లు చెప్పి భార్యను యింటికి తీసుకొచ్చేశారు.

ఇది జరిగిన రెండురోజుల తర్వాత రామశాస్త్రి వచ్చాడు లలితాంబగారిని

చూసిపోవడానికి. ఆవిడ చేసే పూజలన్నీ ఆయనే చేయిస్తాడు. ఎక్కువగా పెళ్ళిళ్ళకే పౌరోహిత్యం చేసే రామశాస్త్రి పెళ్ళిళ్ళు కుదర్చడంలోకూడా దిట్టే. అప్పటిదాకా శైలజకే పెళ్ళిసంబంధాలు అడిగే లలితాంబగారు ఆ రోజు శ్రీనివాస్‌కోసం అడిగింది. తనదగ్గర పెళ్ళికొడుకుల జాబితాకంటె పెళ్ళికూతుళ్ళ జాబితా పెద్దగా వుండడం వలన రామశాస్త్రి వుత్సాహంగా మొదలుపెట్టాడు.

"అమ్మా మీ రెప్పుడా మాటంటారా అని చూస్తున్నాను. బ్రహ్మాండమయిన సంబంధాలున్నాయి మన అబ్బాయిగారి కోసం. ఈ వూళ్ళోనే నాలుగయిదు మంచివి వున్నాయి. ఒకమ్మాయి లెక్చరరు. పిల్ల చాలా బావుంటుంది. వాళ్ళు పదివేలదాకా యిస్తారు. ఇంకో పిల్ల బాంక్ ఆఫీసరు. ఆ పిల్ల సుమారుగా వుంటుంది చూడ్డానికి. అంటే కనుముక్కుతీరు బాగుంటుంది కానీ లెక్చరరు. పిల్లంత పచ్చగా వుండదు. వాళ్ళు కూడా పదివేలిస్తారు. ఇంకో అమ్మాయి డాక్టరీ చేస్తోంది. ఆ అమ్మాయి మన అమ్మాయిగారితో వుంటుందే ఇందిర అని, ఆ అమ్మాయి. కట్నం యివ్వకూడదని ఆ అమ్మాయి పట్టుదలలు కానీ వాళ్ళ నాన్నగారు 'యివ్వకుండా కాదుకదా శాస్త్రిగారూ' అన్నారు. చెప్పండి, ఇవి బాగా చదువుకున్న అమ్మాయిల గురించిన వివరాలు. ఇంకా డిగ్రీ మాత్రం వున్నవాళ్ళు చాలామంది వున్నారు. వాళ్ళలో పదిహేను, ఇరవైదాకా యిచ్చే వాళ్ళున్నారు. వివరాలు చెప్పమంటారా?"

మహోత్సాహంగా చేప్పేస్తున్న రామశాస్త్రిని ఆపారు లలితాంబగారు.

"వుండండి. మా అబ్బాయిని అడిగి చెప్తాను, ఏం చదివిన పిల్ల కావాలో. అడుగో మాటలోనే వచ్చాడు. 'బాబూ శీనూ యిలారా' అన్నారు.

లోపలికి రాబోతూ, రామశాస్త్రిని చూసి వెనక్కుతిరిగి వెళ్ళిపోయే ప్రయత్నంలో వున్న శ్రీనివాస్ యింక విధిలేక వచ్చి తల్లి పక్కన సోఫాలో కూర్చున్నాడు.

"నీ కెటువంటిపిల్ల కావాలో చెప్పరా. మన శాస్త్రిగారు మంచి అమ్మాయిని చూస్తారుట నీకోసం." తప్పించుకునేందుకు యిక దారిలేక నవ్వులాటగా కొట్టి పారెయ్యాలని,

"నన్నర్థం చేసుకునే పిల్ల కావాలండీ, నా అభిప్రాయాలే వుండాలి, నా కిష్టమైన రంగులే యిష్టపడాలి. నా కిష్టమైన చీరలే కట్టుకోవాలి. నా కిష్టమైన పళ్ళే తినాలి. నేను అన్నం తినమంటే తినాలి. మానేయమంటే మానేయాలి. ఎక్కువ చదువుకోవాలి గాని ఎక్కువ మాట్లాడకూడదు. కనీసం యాభై వేలన్నా

కట్నం యివ్వాలి అయిదు రోజులు అన్ని లాంఛనాలతో పెళ్ళి చెయ్యాలి " అంటున్న శ్రీనివాస్‌ని మధ్యలో ఆపి,

"శీనూ, ఏమిటిది? నేను నిజంగానే అడుగుతున్నాను," అన్నారు లలితాంబ గారు చిరుకోపంతో.

"లేకపోతే యిప్పుడు నా గురించి అడుగుతావేమిటమ్మా. మా శైలజ కేమన్నా వుంటే చెప్పండి శాస్త్రిగారూ, వింటాను. చెల్లాయి పెళ్ళయేదాకా మనకి పనిలేదు."

"చెల్లెలికి ఎప్పుడో చూశాను బాబూ. అమెరికాలో వున్నాడు. ఇంకో నాలుగునెలల్లో వస్తాడట. చూసి ఔననుకుంటే ఎలాగూ ఆ అబ్బాయి మూడు నెల్లపాటు వుంటాడు దేశంలో. అమ్మాయి డాక్టరీ అయిపోయాక పెళ్ళి చేసుకుంటాడు." అన్నీ జరిగిపోయేట్టే మాట్లాడుతున్న రామశాస్త్రిని చూస్తే శ్రీనివాస్‌కి భయమేసింది. ఇంకాస్సేపు అక్కడే వుంటే యింకో అమ్మాయినిచ్చి తనకీ పెళ్ళిచేస్తాడని భయపడి,

"అమ్మా! నేనో ఫ్రెండ్ ఇంటికి వెళ్తున్నా. ఎనిమిదింటికి వస్తాను," అని అర్జంటు పని వున్నవాడిలా బయటికి వెళ్ళిపోయాడు.

రామశాస్త్రి వెళ్ళిపోయాక భర్తతో అంది ఆవిడ. "ఏమండీ, మనకి ఏం చదువుకున్న కోడలు వస్తే బాగుంటుంది? వుద్యోగంచేసే అమ్మాయి వద్దండీ. కాస్త యింట్లోవాళ్ళకి కావలసినవి చూసే అమ్మాయైతే బాగుంటుంది. ఏమంటారు?"

"లలితా, నీకు, నాకూ కాదు నచ్చడం. శీనుకి నచ్చాలి. వాడికి నచ్చిన పిల్లని మనం యిష్టపడాలి కానీ, మనకి నచ్చిందికదా అని ఎవర్నో కట్టబెట్టడం మంచిదికాదు. కలకాలం కలిసివుండవలసింది వాళ్ళు. అయినా మొగపిల్లల గురించి దిగులెందుకు? శైలూకి పెళ్ళిచేస్తే మన బాధ్యత తీరిపోతుంది. ఇక శీను, రఘు వాళ్ళిష్టమొచ్చినట్టు వాళ్ళనుండనీ."

ఎప్పుడూ కుటుంబవిషయాలలో తనకి ఏంచెప్పని భర్త ఆ రోజు అట్లా మాట్లాడేసరికి లలితాంబ అనుమానంగా చూసింది భర్తవంక.

"ఇవాళ అలా మాట్లాడుతున్నారేమిటి మీరు?"

"ఏంలేదు లలితా, చదువుకుని, వుద్యోగం చేస్తూవున్నవాడు ఎందరో ఆడ పిల్లల్ని చూసివుంటాడు. వాడి యిష్టాయిష్టాలేమిటో తెలుసుకోకుండా మనం ఏవేవో అనుకుంటే కష్టం. అందుకని...."

లలితాంబగారి బుర్ర చురుగ్గా పనిచేసింది. అనుమానంగా భర్తవంక చూ

"ఏం, వాడికెవరైనా యిష్టమైనవాళ్ళున్నారని చెప్పాడా మీకు?" అన్నారు, రామశాస్త్రితో శ్రీనివాస్ మాట్లాడిన తీరుని గుర్తుతెచ్చుకుంటూ.

"నాకెవరూ చెప్పలేదు. కానీ ఒకవేళ అలాంటిదేమైనా వుంటే తలిదండ్రులుగా వాడి యిష్టాన్ని ఔననడమే మన బాధ్యత అని నేననుకుంటున్నాను."

భర్తతో యింకేమీ తర్కించలేదు ఆవిడ. ఇదేదో లోతైన వ్యవహారం అని గ్రహించేసింది. చెప్పదలచుకోకపోతే శంకరంగారు చెప్పరనికూడా ఆవిడకి తెలుసు. ఇక మిగిలింది శైలజ. శైలజకి మర్నాడు మధ్యాహ్నందాకా హాస్పిటల్ డ్యూటీ లేదు. ఆరోజు శ్రీనివాస్, శంకరంగారు బయటికి వెళ్ళిపోయాక కూతుర్ని నిలదీసింది లలితాంబగారు.

"శైలూ, ఇంతకీ ఆ అమ్మాయి ఎవరే. యిన్నాళ్ళూ నాకెందుకు చెప్పలేదు?'

"ఏ అమ్మాయమ్మా?" శైలజ గుండెల్లో రాయిపడింది తల్లి, తనని ఒంటరిగా చూసి అడిగినందుకు.

"అదే, శీనూ యిష్టపడిన అమ్మాయి."

విషయమంతా తల్లికి తెలిసిపోయిందేమోనని పొరపాటుపడ్డ శైలజ బయటపడిపోయింది.

"అదే అమ్మా.... పద్మజ."

అవాక్కయిపోయారు లలితాంబగారు. పద్మజ తండ్రిపేరు వెంకటరత్నం నాయుడు అని బాగానే గుర్తుంది ఆవిడకి. కూతురి స్నేహితురాలు కనక పద్మజా శ్రీనివాస్‌ల వ్యవహారంలో శైలజే సూత్రధారిణి అని ఆవిడ భావించింది.

"ఏమే, మీకేమైనా మతులు పోయాయా? వాళ్లెవరు, మనమెవరు. ఛీ, ఛీ, ఎందుకు ప్రోత్సహించావే, యింతోటి స్నేహితురాలు ఒదిన కావాలనా?"

"అమ్మా, ప్లీజ్, నే చెప్పేది విను. ఈ విషయంలో నా ప్రమేయమేమీ లేదు. పద్మావాళ్ళన్నయ్య, అన్నయ్య కలీగ్. వాళ్ళిద్దరూ కూడా ఫ్రెండ్స్. మనింటి కొచ్చినప్పుడెప్పుడూ పద్మ అన్నయ్యతో మాట్లాడనుకూడా లేదు."

ఎలా జరిగింది అన్న ప్రశ్నకంటే, దీన్ని ఎలా విడదీయాలి అన్న సమస్య తీవ్రంకావడంతో లలితాంబగారు యింక కూతుర్ని ఏమీ అడగలేదు. ఏమైనా గంభీరంగానే వ్యవహారం జరగాలి. 'ఎదిగిన పిల్లలతో అభిప్రాయభేదం వస్తే కష్టం' అన్న వూహ మొట్టమొదటగా ఆవిడకి కలిగింది. తరువాత భర్తతో గానీ, శైలజతో గానీ దాన్నిగురించి మాట్లాడలేదు.

రెండురోజుల తర్వాత ఏవో మాటలసందర్భంలో తమ కుటుంబం ఎంతగా




ఆచారాన్ని, సాంప్రదాయాన్ని గౌరవిస్తుందో, దానివలన తమకి బంధువులలో ఎంత గౌరవముందో, ఏ చిన్నపనైనా సాంప్రదాయవిరుద్ధంగా చేసి గౌరవాన్ని పోగొట్టుకుంటే తిరిగి దాన్ని పొందడం ఎంత అసాధ్యమో దాదాపు ఒక అరగంటసేపు డైనింగ్‌టేబుల్ దగ్గర మాట్లాడింది ఆవిడ. జరిగింది శైలజద్వారా తెలుసుకున్న శ్రీనివాస్ తలవంచుకు కూర్చున్నాడు. ఒక్క రఘురాంకి తప్ప ఆవిడ మాటల్లోని వుద్దేశ్యం అందరికీ అర్థమైంది. ఎవరికి వాళ్ళే తేలుకుట్టిన దొంగల్లాగ వుండిపోయారు.

లలితాంబగారు అంతతో వూర్కోలేదు. ఇంకో రెండురోజులు పోయాక శ్రీనివాస్ పొద్దున్నే కాఫీ తాగుతుంటే దగ్గర కూర్చుని సంభాషణ ప్రారంభించారు.

"బాబూ, శైలజ చదువు పూర్తయేదాకా నిన్నెందుకు ఆపాలి. అప్పుడే ఆరేళ్ళయింది నువ్వు వుద్యోగంలో చేరి. మొన్న రామశాస్త్రిగారు చెప్పినవాళ్ళలో లెక్చరరుగా చేస్తున్న అమ్మాయి చాలా బావుంటుందిట. ఒకసారి వెళ్ళి చూసి వద్దామా?"

విషయం తెలిసిన తల్లి యిలా ఎందుకు మాట్లాడుతోందో వెంటనే అర్థంకాలేదు శ్రీనివాస్‌కి.

"యిప్పుడేం తొందరొచ్చిందమ్మా? మా కంపెనీనుంచి కొందరు యింజనీర్లని అమెరికా పంపిద్దామనుకుంటున్నారు. నేను కూడా సెలెక్ట్ అవుతానేమో చూడాలి. అదేదో తేలేదాకా నా పెళ్ళివిషయం తలపెట్టదలచుకోలేదు."

"అయితే ఏం శీనూ, పెళ్ళైపోతే వీలుంటే అమ్మాయిని నీతో తీసికెళ్దువు

గానీ, లేకపోతే యిక్కడ మా దగ్గరుంటుంది. అయినా యింకో అమ్మాయి యింట్లోకి రాకుండా మన శైలూని పంపటం కూడా కష్టంగానే వుంటుంది. ఏం బాబూ ?"

"లేదమ్మా. నేను యింకో ఆర్నెల్లు ఆగదలచుకున్నాను."

తను ఎంత అనునయంగా మాట్లాడినా కొడుకు వినటంలేదన్న బాధ, ఆర్నెల్లు ఆగడాని కేదో కారణముందన్న అనుమానం లలితాంబగారి సహనాన్ని చంపేశాయి.

"నువ్వెందుకు ఆగాలి? ఏమిటి విషయం ! నీ యిష్టం వచ్చినట్టు చెయ్యడానికి యింటికి నువ్వు పెద్దకొడుకువి గుర్తుపెట్టుకో. కుటుంబ గౌరవం, మర్యాద కాపాడవలసింది పోయి మంటగలుపుదామనుకుంటున్నావా ?"

తల్లి ధోరణిచూసి శ్రీనివాస్‌కికూడా ఆవేశం వచ్చింది. అప్పటిదాకా లోలోపల అనుకుంటున్న మాటలు బయటికి వచ్చేశాయి.

"నా యిష్టం, సుఖం చూడని సంప్రదాయం నా కక్కర్లేదు. కేవలం నా పెళ్ళిమీదే ఆధారపడే మర్యాద, గౌరవం ఎంత బలహీనమైనవో తెలుస్తోంది. అమ్మా, నే నిప్పుడే చెప్పేస్తున్నాను, నేను యిష్టపడిన అమ్మాయిని తప్ప వేరెవ్వరినీ పెళ్ళిచేసుకోను. మీకు కష్టం కలిగిస్తే నన్ను క్షమించండి" అనేసి లేచి వెళ్ళిపోయాడు.

జీవితంలో మొదటిసారి ఓటమి రుచి చూశారు లలితాంబగారు. పెద్ద కూతురిగా తల్లింట్లో పొందిన గౌరవం పెద్దకోడలిగా అత్తగారింట్లో పెంచుకుంది. అయితే ఆవిడ ఒక్కవిషయం గుర్తించలేదు. తన అభిప్రాయాలంటూ ఏర్పరచుకోకుండా తాను వారి అభిప్రాయాలకి లోబడింది. వాటిని తు.చ. తప్పకుండా పాటించింది. కాబట్టే తలిదండ్రులైనా అత్తమామలైనా తనని మెచ్చుకున్నారని, వారు యిష్టపడింది తననే అనుకుంది గానీ, తనలోని మానసి బానిసత్వాన్ని అని గ్రహించలేదు అందుకే యిప్పుడు కూడా కొడుకు తనని ఎదిరిస్తున్నాడనుకుందే కానీ, తన అభిప్రాయంతో వ్యతిరేకిస్తున్నాడని అర్థంచేసుకోలేకపోయిందావిడ. పిల్లలు తమ స్వంత అభిప్రాయాలుకానీ ఆలోచనలుకానీ లేకుండా, తమ మాట ఎంత పాటిస్తే తామంటే వారికి అంత ప్రేమ, గౌరవం అనుకునే తల్లిదండ్రులకి ప్రతినిధి అయిన లలితాంబగారు జరిగినది తనకి అవమానకరంగానూ, పెద్ద ఓటమిగానూ భావించింది.

* * *

శ్రీనివాస్ వాయిదావేస్తూ వచ్చిన వాతావరణం అనుకున్నదానికంటె ముందే వచ్చేసింది. ఎంతో అవసరమయితే తప్ప లలితాంబగారు పిల్లలతో మాట్లాడటం లేదు. ఎవరైనా ఏదైనా చెప్తే విని వూరుకుంటున్నారేకానీ ఔననికాని, కాదని గానీ అనటంలేదు. శంకరంగారు ఎప్పుడూ అలవాటులేని పనులు చేస్తున్నారు. పిల్లలికి, భార్యకి మధ్య మళ్ళీ రాజీచేద్దామని. భార్య వున్నపుడు పిల్లలతో మరింత మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నారు. శైలజకి ఈ వాతావరణం ప్రాణ సంకటంగా వుంది స్నేహితులైన కామేశ్వరీ, ఇందిరతో చెప్తామంటే పద్మజకి తెలిసి బాధపడుతుందేమో అని సంకోచంగా వుంది ఆమెకి. నిజానికి తన స్నేహితురాళ్ళందరిలో పద్మజ అంటేనే ఎక్కువ యిష్టం శైలజకి. ఇందిరకి కొంచెం నోటి దురుసుతనం ఎక్కువ. ఎవరినైనా ఎంతమాటైనా అనేస్తుంది. మనసు మంచిదైనా మాట కరుగ్గా వుండే ఇందిరంటే సహజంగా నెమ్మదస్తురాలైన శైలజకి భయం. ఇక కామేశ్వరి మెడిసిన్ నిజంగా డాక్టరవాలనే కోరికకంటే నలుగురిలో గొప్పగా వుండాలనే వుద్దేశ్యంతో చదువుతోంది డబ్బు, ఆస్తి వున్న ఒక డాక్టర్ని పెళ్ళిచేసుకోవాలని తప్ప యింకేం ఆలోచించదు. నలుగు రిలో గొప్పగా బ్రతకడం మించి జీవితంలో యింకేం ఆశయాలు లేవు. పద్మజ వీరిద్దరికీ భిన్నంగా అనిపిస్తుంది శైలజకి. ఇందిరలా మాట కరుగ్గా వుండదు కానీ చెప్పదలచుకున్న విషయాన్ని, ఏదైనా సరే చక్కటి పద్ధతిలో చెప్పే నేర్పువుంది. ముఖ్యంగా చదువులో మిగతా ముగ్గురికంటే మంచి మార్కులు తెచ్చుకుంటుంది. ఏ పనైనా ముందు వెనుకలు ఆలోచించే మనస్తత్వం, తూచి మాట్లాడే స్వభావం శైలజకి బాగా నచ్చాయి.

"ఇటువంటి జీవితం ఒక వరం. మనం కొద్దిగా ఉన్నతస్థితిలో వున్నామంటే, మిగతావాళ్ళకి తగినంత సహాయం చెయ్యాలని భగవంతుడి సంకల్పం. ఏ ఒక్కరూ ప్రపంచంలో మిగతావాళ్ళందరి అవసరాలు తీర్చలేరు. కాబట్టి ప్రతివారు తమకు చేతనైనంత సహాయం ఇతరులకి చెయ్యాలి." అనే పద్మజ అంటే శైలజకి గౌరవం. తనలాగ పద్మజ పిరికిది కాదు అనే ఆరాధనా భావంకూడా లేకపోలేదు. నలుగురిలోనూ వాగ్యుద్ధం ఎప్పుడూ ఇందిరకి పద్మజకి వచ్చేది. మొదట్లో ఎంతో పదునైన భావాలు వెలిబుచ్చే ఇందిర చివరికి పద్మజ మాటలతో ఓడిపోయేది ఆమె అడిగే క్లిష్టమైన ప్రశ్నలకి జవాబులు చెప్పలేకపోయేది. నలుగురి స్నేహితులలో ఎంత భేదమున్నా, చదువులో వారికున్న ప్రతిభ వారిని దగ్గర చేసింది.

కానీ యిప్పుడు శైలజకి తన సమస్య స్నేహితురాళ్ళతో చెప్పుకునే అవకాశంకూడ లేకుండాపోయింది. హాస్పిటల్‌కి వెళ్ళడం, డ్యూటీ కాగానే యింటికి వచ్చి ఏవైనా పుస్తకాలు చదవడం - యింతే అయింది ఆమె దిన చర్య. శైలజ ద్వారా సంగతి తెలుసుకున్న రఘురాం మాత్రం ఒకరోజు సాయంత్రం అన్నయ్యతో వాదించాడు. ఆ రోజు శ్రీనివాస్ యింటికి వచ్చి, యింకెక్కడికి వెళ్ళకుండా తన గదిలోనే కూర్చున్నాడు ఏదో పుస్తకం చదువు కుంటూ. నెమ్మదిగా రఘురాం గదిలోకి వచ్చాడు.

"అన్నయ్యా! నువ్వేం అనుకోకపోతే నేనో గంట నీతో మాట్లాడవా మనుకుంటున్నాను."

తమ్ముడంత సీరియస్‌గా చెప్పేసరికి అతను మాట్లాడబోయేదేమిటో తెలిసింది శ్రీనివాస్‌కి. అయినా 'ఇరవైయేళ్ళ తమ్ముడికి కుటుంబ విషయాలు తనతో చర్చించే హక్కు వుంది' అనుకున్నాడు.

"రా రా, కూర్చో. చెప్పు, ఏం మాట్లాడదామనుకుంటున్నావు?"

"నీ స్వంత విషయంలో చిన్నవాణ్ణి నేను కల్పించుకుంటున్నందుకు క్షమించు అన్నయ్యా. కానీ పదిరోజులబట్టి యింట్లో వాతావరణం చూస్తే నాకు మతి పోయేట్టనిపిస్తోంది. ఈ సమస్య నువ్వు తీర్చలేవా అన్నయ్యా?"

"రఘూ! పద్మజ నీకుకూడా చాలా ఏళ్ళనుంచీ తెలుసుకదా! ఆమెమీద నీ అభిప్రాయయం ఏమిటి?

"అన్నయ్యా! శైలక్క, పద్మజ స్కూలికి కలిసివెళ్ళేటప్పటినుంచీ నీకంటె నాకు బాగా తెలుసు. ఆడపిల్లలతో మాట్లాడడానికి సిగ్గుపడి నువ్వు అప్పుడు శైలక్క ఫ్రెండ్స్‌తోటి మాట్లాడేవాడివి కాదేమో కానీ, వాళ్ళందరూ నాకూ స్నేహితులే. చిన్నవాడినవడంవల్ల చాలా అభిమానంగా వుండేవాళ్ళు. నాకూ పద్మజంటే చాలా యిష్టం. కానీ అన్నయ్యా, తనెంత మంచిదయినా, అమ్మా నాన్నల కిష్టంలేకుండా నువ్వు పెళ్ళిచేసుకుంటే తనకీ యింట్లో స్థానం వుంటుం దంటావా?"

"రఘూ, ఓ రకంగా యిటువంటివి వ్యక్తిగత అభిప్రాయాలకి, యిష్టాలకి పాతుకుపోయిన సాంప్రదాయాలకి యుద్ధమేననుకో. కానీ నేను జీవిత భాగస్వామినిగా కావాలని ఎంతో కోరుకొనే అమ్మాయిని కేవలం కులంపట్టింపుల వల్ల వదులుకోవడం నాకు సమంజసం అనిపించడంలేదు. నేను కూడా అమ్మా నాన్నల్లా కులమేదో గొప్పది అనుకుంటే ఈ సమస్య వుండకపోయేది. కానీ

నాకు అలా అనిపించడంలేదు. నా కర్థంకాని కులాభిమానాన్ని, నాకర్థమయిన, నన్నర్థంచేసుకున్న ఒక మనిషికోసం విడిచిపెడితే ఏం?"

"నువ్వు చెప్పేవన్నీ మాటల్లో బాగున్నాయన్నయ్యా. కానీ దానివల్ల పెద్దవాళ్ళు ఎంత బాధపడ్తున్నారు."

"చూడు రఘూ! నేను అసలు పెళ్ళిచేసుకోనంటే బాధపడాలి కానీ, నాకిష్టం అయిన అమ్మాయిని చేసుకుంటానంటే ఎందుకు బాధపడాలి? కాలంతో మారలేని వాళ్ళు ఎప్పుడూ బాధపడతారు. అంతమాత్రంచేత దాని స్వభావం అది మార్చుకుంటుందా? నీ కిటువంటి సమస్య వచ్చిననాడు నీకర్థం అవుతుందిరా. ఇప్పుడు నేనెంత చెప్పినా కఠినుడిలా అనిపిస్తాను నీకు."

పద్మజ సంస్కారం, తెలివితేటలు తెలిసినవాడవటంచేత ఎంతసేపు తల్లిదండ్రులు బాధపడతారని అనగలిగాడే కానీ శ్రీనివాస్ సెలక్షన్ బాగులేదని అనలేకపోయాడు రఘురాం. తరవాత అరగంట మాట్లాడుకున్నా అన్నదమ్ముల మధ్య సంభాషణ దాదాపు పైవిధంగానే సాగింది. శ్రీనివాస్ తన నిర్ణయం మార్చుకోడని మాత్రం స్పష్టమైంది రఘురాంకి.

* * *

శంకరంగారింట్లో వాతావరణం అలా వుండగా లలితాంబగారి తమ్ముడు సుందరమూర్తి వచ్చాడు ఢిల్లీ నుంచి. రెండెకరాల పొలమేదో అమ్మాలని తల్లి వ్రాస్తే దానిపని కోసం యింటికి వెళ్తూ హైదరాబాదులోని అక్కగారింట్లో ఆగాడు, రెండు రోజులుండి పోదామని. బోటనీలో డాక్టరేటు చేసిన అతను, ఢిల్లీ యూనివర్సిటీలో ప్రొఫెసర్. తనరాకతో లలితాంబగారింట్లో స్తంభించి పోయిన వాతావరణాన్ని కొంచెం తేలికచేశాడు.

"అక్కయ్యా, ఎలా వున్నావు? కమాన్ శైలజా ఏమిటి, డాక్టరూ అన వచ్చునా, అర్నెల్లాగాలా? ఏరా రఘూ, ఎట్లా చదువుతున్నావు? ఫైనలియర్ కూడానూ, బావగారి అడుగుజాడల్లో నడవాలి. సి. యే. పరీక్షలంటే మాటలుకాదు. అంటూ ఎదురువచ్చిన వారందరినీ ఒక్క గుక్కలో పలకరించేశాడు. అతని కంఠం వి ని బయటకు వచ్చిన బావగారికి ఎదురెళ్ళి అమాంతం చేతులు పట్టేసు కున్నాడు.

"నమస్కారం బావగారూ, ఏమిటి ఎట్లా వున్నారు," అంటూ, "అక్కయ్యా ఏడి శీను కనిపించడేం, అప్పుడే వెళ్ళిపోయాడా ఫాక్టరీకి?"

"లేదు, పైనున్నాడు" సమాధానం శైలజ చెప్పింది గబగబా.

"ఏడీ పిలవండి మళ్ళీ హడావిడి పడతాడేమో" అన్నాడు

"వస్తాడు స్నానం చేస్తున్నట్టున్నాడు" అన్నాడు రఘురాం

"రారా సుందరం నువ్వు కూడా స్నానం చేసేస్తే టిఫిన్ రెడీగా వుంది" అన్నారు లలితాంబగారు వచ్చి కాస్సేపే అయినా అక్కలో ముభావాన్ని కనిపెట్టిన సుందరం యింకేం అనలేదు టిఫిన్ చేసేసి వూళ్ళోవున్న తన ఫ్రెండ్స్‌ని చూసొస్తానని బయటికి వెళ్ళిపోయాడు మళ్ళీ అతనొచ్చేసరికి శైలజ, శ్రీనివాస్, రఘురాం, శంకరంగారూ అందరూ బయటికి వెళ్ళిపోయారు లలితాంబగారు తమ్ముడికోసం కనిపెట్టుకుని కూర్చున్నారు భోజనం చెయ్యకుండా అతను వచ్చాక యిద్దరికీ కంచాలు పెట్టి వడ్డించారు

"అయ్యో, నువ్వెందుకు భోజనం చెయ్యలేదక్కయ్యా నలుగురైదుగురి యిళ్ళు తెళ్ళేటప్పటికి ఆలస్యమైపోయింది" అన్నాడు సుందరమూర్తి నొచ్చుకుంటూ

"ఫరవాలేదురా అయినా ఒక్కర్తినే తినాలి కదా, నువ్వెలాగూ వస్తావని కూర్చున్నాను"

"ఆ, అక్కయ్యా, శీనుకేమైనా ప్రమోషన్ వచ్చిందా? ఏమిటి, ఈ ఎనిమిది నెలల విశేషాలు, గబగబా చెప్పేయి"

అప్పటికి వాళ్ళ తండ్రి అవధానులుగారు పోయి ఎనిమిది నెలలయింది అప్పుడు కలుసుకున్నారందరూ మళ్ళీ యిప్పుడే వచ్చాడు సుందరమూర్తి ఢిల్లీ వించి

"ఏమున్నాయిరా విశేషాలు అమ్మనక్కడ్నించి రమ్మంటే రాదు మా ఇంటికి వచ్చి వుండడానికేం? మడి అదీ సాగుతుంది కదా సరసు యింకా ఉమ్మడి కుటుంబంలో వుంది లక్ష్మి భర్త అంత కలివిడిగా వుండడు ఇక బాల సంగతి సరే సరి, ఎప్పుడూ అనారోగ్యమే అదే దాని పిల్లలతో చేయించుకుంటుంటే యింకా అమ్మ కూడా అక్కడుండాలంటే మొహమాటంగా వుంటుంది కానీ నా యింటికి రావచ్చుకదా కావల్సినపుడు వెళ్ళి పొలాలూ చూసుకోవచ్చు, లేకపోతే హాయిగా యిక్కడే వుండచ్చు నువ్వెలాగా దూరంగా వున్నావనుకో చెప్పినా వినరురా ఈ పెద్దవాళ్ళు మూర్ఖత్వాలు- మాకిలాగే సాగింది యిలాగే సాగాలి అంటే ఎట్లా? ఏదో సర్దుకుపోవాలిగాని ఇక నీ సంగతి చెప్పు లావణ్య బాగా చదువుతోందా? తరవాతేం చేస్తుందిట? మరదలు బాగుందా? రామం ఎట్లా వున్నాడు?" యిన్ని రోజులనించీ మాట్లాడకుండా వుగ్గపట్టుకున్న లలితాంబ గారు తమ్ముడి రాకతో కొంచెం మామూలు మనిషయారు




"లావణ్య ఎమ్.ఏ. ఈ ఏప్రిల్‌తో అయిపోతుంది. అది వుద్యోగం చెయ్యదట. రిసర్చి చేస్తా అంటోంది. రామం ఈ ఏడాది మళ్ళీ ఐ.ఐ.టి.కి ట్రై చేస్తా అంటున్నాడు. ఇక నీ మరదలు బాగానే వుంది. మిగతా మనవాళ్ళంతా బాగానే వున్నారు ఢిల్లీలో. అన్నట్టింకొకటే విశేషం. మన శేషు కూతురు ఒక సిక్కుని పెళ్ళిచేసుకుంది. అ అబ్బాయికి బిజినెస్ బాగా వుందట. మనిషినిచూసి మాత్రం మనవాళ్ళు భయపడ్డారు, ఏమన్నా అంటే తంతాడేమో అని. అలా వున్నాడట."

తాను మర్చిపోదామనుకుంటున్న విషయంలాంటిది మళ్ళీ తమ్ముడు చెప్పేసరికి లలితాంబగారి ముఖం చిన్నబోయింది. ఈ మార్పు చూసిన సుందరం ఆశ్చర్య పోయాడు. కానీ పైకేమీ అనలేదు. తర్వాత చాలాసేపు అక్కా తమ్ముళ్ళు తమ తండ్రి గురించి, పొలాల గురించి మాట్లాడుకున్నారు.

సాయంత్రం అందరూ యింటికి వచ్చాక కాస్సేపు మాట్లాడి, శ్రీనివాస్‌ని బయటికి తీసుకెళ్ళడానికి తయారయ్యాడు సుందరమూర్తి. అందరూ కూర్చుని మాట్లాడినపుడు ఒక విషయం గమనించాడు అతను. లలితాంబగారు పిల్లలతో డైరక్టుగా మాట్లాడటంలేదు. పైగా వారు మాట్లాడిన మాటల్లో ప్రతిదానిమీద ఏదో ఒక విసురు విసుర్తూనే వుంది. సినిమాల ప్రసక్తి వచ్చినపుడు రఘురాం.

"మామయ్యా, జయప్రద సినిమా ఏదైనా ఢిల్లీ వచ్చిందా? నువ్వు చూశావా?

యిప్పుడున్నవాళ్ళల్లో తనే బెస్ట్" అన్నాడు జయప్రదని తల్చుకున్న ఎక్సైట్‌మెంట్ ఆపుకోకుండా

"లేదురా" అని యింకా ఏదో అనబోతున్న సుందరమూర్తి ఆశ్చర్యపోయేట్టు

"ఆ, ఆ, జయప్రద, జయసుధ వీళ్ళని చూసి మురిపడమే వెధవసినిమాలు చూసి చెడిపోతున్నారు పిల్లలు" అన్నారు లలితాంబగారు రఘురాం మళ్ళీ మాట్లాడలేదు స్నేహితులు, ఏదో మాటలమీద శ్రీనివాస్ అన్నాడు

"ఈ మధ్య మా స్నేహితుడి కొడుకొకడు యిక్కడ బేబీస్ కాంపిటీషన్‌లో ఫస్ట్‌ప్రైజ్ కొట్టేశాడు చూడ్డానికి భలేబావుంటాడు అతని తల్లి కూడా చాలా శ్రద్ధగా పెంచుతుందనుకుంటాను ఎప్పుడెళ్ళినా ఎంతో నీట్‌గా ముద్దొస్తూ వుంటాడు వాడు"

దీనికి లలితాంబగారు ఘాటుగా సమాధానం చెప్పారు "ఆ, అందర్నీ అలా పెంచితేనే యింతవాళ్ళయారు చిన్నప్పుడు పిల్లలకి జలుబుచేస్తే చాలు అన్నం పెట్టమానేసి పక్కన కూచుంటాం మా పిల్లలోఅని పెంచుతాం ఎందుకు పెద్ద వాళ్ళయాక నెత్తిన రాయిపెడతారని జ్వరమొచ్చినా, ఏమొచ్చినా హడిలిపోతూ పువ్వుల్ని చూసినట్టు చూసుకునేది వాళ్ళు పెద్దవాళ్ళయి మాట వింటారనే పిచ్చి భ్రమతో ఆ కాలం పోయింది నాయనా ఇక పిల్లల్ని పెంచేది వాళ్ళ బాధ్యత తీరడం కోసమే అంతకన్నా ఏంలేదు"

ఏదో మనసులో పెట్టుకుని లలితాంబగారీ మాటలన్నారని సుందరమూర్తి గ్రహించాడు అదీకాక ఎప్పుడూ పిల్లల పెంపకం గురించి గొప్పగా మాట్లాడే అక్కయ్య అట్లా మాట్లాడేసరికి సుందరమూర్తికి ఆవిడ ఏదో విషయంలో బాధపడుతోందని కూడ అర్థమైంది ఆవిడ్ని సంతోషపెట్టాలని-

"నీ పిల్లలకేం అక్కయ్యా వాళ్ళకే విషయంలోనైనా ఎవరైనా వంకపెట్ట గలరా?" మిగతా ముగ్గురక్కయ్యల పిల్లలలో ఎవరూ డిగ్రీ చదువులు దాట లేదని అతనికి లలితాంబగారి పిల్లలంటే ఎక్కువ అభిమానం అందుకే చాలా మనస్ఫూర్తిగా అన్నాడా మాట కానీ ఆ సమయాన్నిబట్టి ఆవిడకి ఎత్తిపొడుపులా అనిపించింది తన నిస్సహాయత తమ్ముడిమీదికి తిరిగింది

"ఆ, దేనికైనా మేనమామ పోలిక, మేనత్త చాలిక అన్నారు ఎక్కడికి పోతాయి," అనేసి లేచి వెళ్ళిపోయారావిడ యింక అక్కడ కూర్చోలేక అంతదాకా పిల్లలమీది విసురు తనమీదికి తిరిగేసరికి దిమ్మరపోయాడు సుందరమూర్తి వెంటనే శ్రీనివాస్‌ని తనతో రమ్మని బయటకు తీసికెళ్ళాడు

యిద్దరూ సినిమాకని యింట్లో చెప్పి బయలుదేరి తిన్నగా టాంక్‌బండ్ మీదికి వెళ్ళి కూర్చున్నారు. సుందరమూర్తి ఏదో అడగడానికి తీసుకొచ్చాడని శ్రీనివాస్‌కి తెలుసు. మామయ్య అడగడానికి తటపటాయిస్తున్నాడని కూడా గ్రహించాడు.

మొదటినుంచీ శ్రీనివాస్‌కి మామయ్యంటే చాలా యిష్టం, అభిమానం. అతని స్ఫురద్రూపం, ఆరడుగుల పొడుగ్గా, అందంగావున్న సుందరమూర్తంటే కుర్రాడుగా వున్నప్పుడు శ్రీనివాస్‌కి చాలా ఆరాధన వుండేది. పైగా సుందర మూర్తి భావుకుడు. అప్పటి కప్పుడు మంచి పాటలుకట్టి పాడేవాడు. అందర్నీ నవ్విస్తూ మాట్లాడేవాడు. అతను ఎక్కడ వుంటే అక్కడ సందడి. పిల్ల లందర్నీ చేర్చి ఆడిస్తూ వుండేవాడు. యిప్పటికీ నలభై అయిదేళ్ళున్నా, పిల్లలతో సరదాగా మాట్లాడటం, అల్లరి చెయ్యడం పిల్లలందరికీ అతన్ని యిష్టపడేట్టు చేస్తుంది. అయితే అతనిలో ఓ ప్రత్యేకత వుంది. ఎంత సరదాగా కబుర్లు చెప్పగలడో, అంత సీరియస్‌గానూ మాట్లాడగలడు. ఎక్కువ పుస్తకాలు చదవడం అతనికి బాగా మాట్లాడటానికి సహాయం చేస్తే, సహజంగా వున్న చమత్కారం అతని మాటలకోసం మనుష్యులు చుట్టూరా చేరేట్టు చేస్తుంది. అతని చిన్నప్పుడు కూడా అంతే. అక్కలు, బావలు యింటికి వచ్చినపుడు వాళ్ళ పిల్లలెవరైనా అల్లరిచేస్తే పెద్దవాళ్ళు కోప్పడేవాళ్ళు. అప్పుడతను, "బావగారూ, మీరు చేస్తారా అల్లరి. చెయ్యగలరా, ఏదీ ఈ స్కేలు విరగ్గొట్టండి. లేకపోతే ఆ కిటికీ ఎక్కి కిందకి దూకండి, చూద్దాం. మీరు యిప్పుడు చెయ్యలేనివి వాళ్లు చేస్తుంటే ఆనందించ రేమిటండీ" అని పిల్లల్ని వెనకేసు కొచ్చేవాడు. అందుకే మేనల్లుళ్ళందరూ సుందరం మామయ్య వున్న ప్పుడే అమ్మమ్మగారింటి కెడదాం అనేవారు తల్లులతో. అమ్మమ్మగారింట్లో మామయ్యే పెద్ద ఆకర్షణ వాళ్ళకి. ఎందుకంటే ఎటువంటి అల్లరి చేసినా తను తిట్టకపోగా తల్లుల తిట్లనించి తప్పించేవాడు. సాధారణంగా వేసవికాలంలో అందరూ చేరేవాళ్ళు. ఇక భోజనాలయి పెద్దవాళ్ళంతా మాట్లాడుకోవడానికి ఒక గదిలో చేరాక పిల్లలకి అల్లరిచెయ్యడానికి వీలుండేది. అప్పుడు సుందరం వాళ్ళతో చేరేవాడు మధ్య మధ్య పెద్దవాళ్ళ మాటలలో కలుస్తూ.

"మామయ్యా, నూనెసీసా పగిలింది" ఒక మేనల్లుడు వచ్చేవాడు.

"అదే ఎలా పగిలిందిరా. నువ్వు పగలగొట్టకుండా?" మామయ్య బెదిరించే వాడు.

"కాదు మామయ్యా, నూనె ఎంత వుందో చూద్దామని తీశాను. పైన జిడ్డుగా వుండి జారిపోయింది."

"సరేలే, నేనే పగలకొట్టానని చెప్తా అమ్మమ్మతో"– మేనల్లుడి కోరిక అదేనని తెలిసిన మామయ్య అభయం యిచ్చేవాడు. ఇంకోడికి ధర్మసందేహం వచ్చేది.

"మామయ్యా, నువ్వు పగలగొట్టినా, మేం పగలగొట్టినా నూనంతా పోతుంది కదా! ఎందుకు నిన్నైతే తిట్టరు, మమ్మల్ని తిడతారు?"

"అది లోకన్యాయం నాయనా. చూడు నువ్వు కూజా తన్నేశావనుకో. 'ఏం కళ్ళు కనపడటం లేదా?' అంటారు. అదే అమ్మమ్మ తన్నేసిందనుకో. 'ఎవర్రా కూజా దార్లో పెట్టారు' అంటుంది. పెద్దవాళ్ళేం చేసినా చెల్లుతుంది. ప్రపంచంలో రెండు రకాల నీతులు నాయనా – ఒకటి పెద్దవాళ్ళకి, యింకోటి చిన్నవాళ్ళకి". గీత బోధించేవాడు పిల్లలకి.

"అయితే నేనెప్పుడు పెద్దవుతా మామయ్యా?" ఇంట్లో సీసాలన్నీ పగల కొట్టడం కోసమైనా పెద్దవాలన్న ఆత్రుత వుండేది మేనల్లుడి కళ్ళల్లో.

"అవుతావు నాయనా, అవుతావు. మీ అమ్మ తిట్టవలసినవన్నీ అయిపోయాక అవుతావు" మామయ్య అభయమిచ్చేవాడు.

"అయితే నే పెద్దయ్యాక ముందు ఆ సీసా పగలగొడతా" అనేవాడు. ఎప్పుడూ తమని ముట్టుకోనివ్వకుండా పైవరసలో పెట్టే తాతయ్య వుసిరికాయ లేహ్యంసీసా చూపించి.

"ఒరే ఆ సీసా అందుకునేటంత పెద్దవాడివయ్యాక నువ్వు సీసాలు పగల గొడితే మీ అమ్మతో తిట్లుకాదురా, నీ పెళ్ళాం చేతిలో దెబ్బలు తినాలి."

"పో, మామయ్యా," అప్పుడే పెళ్ళి అన్నంత సిగ్గుపడేవాడు మేనల్లుడు.

ఇంతట్లో యింకోడొచ్చేవాడు మోకాటి చిప్పలు కొట్టుకుపోయి.

"మామయ్యా, జామచెట్టెక్కుతూ పడ్డాను. అమ్మ లేచేలోపల గబగబా మందు రాయవా," అంటూ.

"వెర్రివెధవా, జామ చెట్టెక్కడం రాకపోతే, నువ్వేం బతుకుతావురా ఈ లోకంలో." అని తిట్టి, "చూడు, ఈ సారి జాగ్రత్తగా ఎక్కాలి. పై కాలికి కొమ్మ అందేవరకు క్రిందికాలు తీయకు!" అని సలహా చెప్పేవాడు మామయ్య. అలాంటి పనులుచేస్తే అమ్మలాగ తిట్టకపోగా జామచెట్టు ఎలా ఎక్కాలో నేర్పించే మామయ్యని అభిమానంగా చూస్తూ, మందు వేయగా

మందిపోతున్నా కిక్కురుమనకుండా పూర్కునేవాడు మేనల్లుడు. ఆ విధంగా పిల్లలందరికీ సమస్యలు తీర్చే అప్తుడు అప్పుడు సుందరం.

అటువంటి సంధర్భాలలోనే చిన్నప్పుడు తెగ అల్లరిచేసే శ్రీనివాస్ మామయ్యాని అమితంగా యిష్ట దేవాడు. అయితే పెద్దవుతున్నకొద్దీ ఆ అభిమానం పెరిగిందేకానీ తగ్గలేదు. చిన్నప్పుడు సుందరమూర్తి వ్యక్తిత్వంలోవి చిలిపితనాన్నే చూసిన శ్రీనివాస్ పెద్దవుతున్న కొద్దీ అతనిలోవి గాంభీర్యాన్ని కూడా చూశాడు. అందుకే కేవలం రక్తసంబంధంవల్ల వుండవలసిన ప్రేమాదరాలేకాక, స్నేహితుల మధ్యనుండే నమ్మకం, ఆరాధనా కూడా మామయ్యపట్ల వుంది శ్రీనివాస్‌కి.

కాస్సేపు వూరికే కూర్చున్నారిద్దరూ. సుందరమూర్తే మొదలుపెట్టాడు "ఏరా బాబీ, ఏమిటి సంగతి? ఎందుకు అక్కయ్య అలా వుంది? పైగా మేనమామ పోలిక అంది. అంటే తెలుసా నీకు?"

''అదే నేనూ అడగాలనుకున్నాను మామయ్యా. యిప్పుడు అమ్మ ఒక్క విషయంలోనే నేనంటే కోపంగా వుంది. ఆ విషయంలో పోలిక అంటే, ముందు చాలా సంగతులు నువ్వే నాకు చెప్పాలి. మరి రెడిగా వున్నావా?''

"ఆ సంగతులు సరే. ముందు నీ విషయం చెప్పు. ఎవరైనా అక్కయ్య కిష్టంలేని అమ్మాయిని పెళ్ళిచేసుకుంటానని భీష్మించావా?"

"సరిగ్గా అంతే మామయ్యా. అమ్మమాత్రం అస్సలు ఒప్పుకునేట్టులేదు. నువ్వేమైనా హెల్ప్‌చెయ్యగలవా మామయ్యా?"

"ఈ విషయం నేనుగూడా మాట్లాడి అక్కచేత నేను తిట్లు తిని విన్ను తన్నించకుండా వుంటే పెద్ద సహాయం చేసినట్టు. శీనూ, ఈ విషయంలో మాట్లాడే హక్కు నాకు అసలు లేదురా?''

"ఎందుకు మామయ్యా?'' ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనివాస్. "ఎందుకో చెప్తా కానీ ముందు నాకు ఆ అమ్మాయి ఎవరో, ఏమిటో వివరాలు చెప్పాలి. అసలు అక్కయ్య ఎందుకు కాదందో చూద్దాం.'' కొద్దిగా సీరియస్‌గా అన్నాడు సుందరమూర్తి.

"పేరు పద్మజ హౌస్‌సర్జన్సీ చేస్తోంది. వాళ్ళ నాన్నగారికి సొంతవూళ్ళో పొలాలూ అవీ వున్నాయి. తన అన్నయ్య శెషగిరి నాకు కలీగ్. అతను, పద్మజ, వాళ్ళచెల్లెలు నీరజ ఈ వూళ్ళో వుంటారు. మనిషి మాత్రం చాలా

మించద. కావాలంటే రేపు నన్ను తీసికెళ్ళి పరిచయం చేస్తాను చూడు. మన శైలూ ఫ్రెండ్‌గా అమ్మకి కూడా దాదాపు ఎనిమిదేళ్ళుగా తెలుసు." సుందర మూర్తి మాట్లాడే తీరును అనుకరిస్తూ గుక్కతిప్పుకోకుండా చెప్పాడు శ్రీనివాస్.

"శీనూ, నాకింతకీ నువ్వేం వివరాలు చెప్పినట్లు? నాక్కావలసిన విషయాలు ఏవీ నువ్వు చెప్పలేదు. నా మొదటి ప్రశ్న. వాళ్ళేం కులం?"

కొద్దిగా తటపటాయించి చెప్పాడు శ్రీనివాస్, "నాయుళ్ళు మామయ్యా." వినగానే సుందరమూర్తి చాలా సీరియస్ అయిపోయాడు.

"శీనూ ఒక్క విషయం చెప్పు. నీ నిర్ణయం తిరుగులేనిదా? గట్టిగా ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలనే అనుకుంటున్నావా? తరువాత విషయం, అక్కయ్య సంగతి తెలిసి యిలా ఎందుకుచేశావు? నీకు నేను మామయ్యనన్న మాట మర్చిపోయి వివరంగా చెప్పు."

"నేనూ అదే అనుకుంటున్నాను మామయ్యా.... పద్మజావాళ్ళ తల్లిదండ్రులు పల్లెటూళ్ళో వుంటారు. చదువులకోసం పిల్లల్ని హైదరాబాదులో వుంచారు. పద్మజ స్కూలినించీ మన శైలజ స్నేహితురాలు. మనింట్లో అందరికీ అప్పట్నించీ చాలా బాగానే తెలుసు. మిగతా ఫ్రెండ్స్‌తో కలిసి చదువుకోడానికి మనింటికి వచ్చినపుడు నేనెక్కువ పట్టించుకోలేదు. వాళ్ళన్నయ్య మొదట నా కలీగ్‌గానే పరిచయం. ఏడాదికిందట ఒకరోజు అతనికి చిన్న యాక్సిడెంట్ అయి, కాళ్ళు చేతులు బాగా గీసుకుపోయాయి. డాక్టరుదగ్గరకు తీసికెళ్ళి కట్లు కట్టించి యింటిదగ్గర దింపాన్నేను నా స్కూటర్‌మీద. అప్పుడే అతను పద్మజ అన్నయ్య అని నాకు తెలిసింది. అప్పట్నించీ అతను చాలా అభిమానంగా వుండేవాడు. తరుచు వాళ్ళింటికి రమ్మని పిలిచేవాడు. మొదట్లో నేను పద్మజ గురించి వేరే ఏమి ఆలోచించలేదు. కానీ తన మాటతీరు, నడవడి రాను రాను నాకు ఆమెపట్ల ఆకర్షణ కలిగించాయి. చక్కటి భావాలు, ఏ విషయాన్నైనా యిట్టే అర్థంచేసుకునే తెలివితేటలు నాకెంతో నచ్చాయి. సరే, మాటల్లో ఎన్నో విషయాలు వస్తాయికదా! కులాలగురించి మాట్లాడినపుడు, తనకు మానవత్వం అనే కులంలో నమ్మకముందని చెప్పిన పద్మజంటే నాకు చాలా గౌరవం కలిగింది. అప్పటిదాకా కులాలగురించి అంత ఎక్కువగా ఆలోచించని నేను అప్పట్నించే వాటి స్వభావాన్ని చదవడం మొదలుపెట్టాను. చాలామంది మాటల్లో బోలెడు గొప్ప ఆశయాలు చెప్తారు. కానీ పద్మజలో ప్రత్యేకత నేను గమనించిం




దేమంటే, ప్రతి క్షణం వాటిని తన నడవడిలో కూడా పాటిస్తూనే వుండడం. పద్మజ వ్యక్తిత్వంలో వున్న ఆకర్షణో, మరి నా బలహీనతో తెలియదు కానీ ఒక అర్నెల్లు గడిచేటప్పటికి తన భావాలతో పూర్తిగా ఏకీభవించాను నేను. అప్పుడే అనిపించింది అటువంటి అమ్మాయిని భాగస్వామినిగా పొందితే జీవితం సంపూర్ణమవుతుంది అని. అయితే అట్లా పెరిగిన మా పరిచయం నామీదే కాదు తనమీద కూడా ప్రభావితమైంది. నేను పెళ్ళిగురించి మాట్లాడగానే వ్యక్తిగతంగా తనకిష్టమే గానీ, పెద్దవాళ్ళగురించి ఆలోచించమంది. నేను దానికి సిద్ధమేనని చెప్పాను. అయితే ఒక విషయం మామయ్యా.... ముందు ఈ సమస్య యింత క్లిష్టం అని నేను అనుకోనిమాట నిజమే. కానీ యిప్పుడు దేనినెదుర్కోడాని కయినా సిద్ధంగానే వున్నాను.... అయినా యిన్నేళ్ళబట్టి అమ్మ చెప్పినవి ఏవీ కాదనకుండా చేస్తున్నాను కదా ! ఈ విషయంలో యింత పట్టుదల ఎందుకు అవి నాకూ మొండితనంగానే వుంది మామయ్యా."

"శీనూ, చిన్న విషయాల్లో నువ్వు కాదన్నా ఎవరూ ఏమీ అనరు. కానీ పెళ్ళి అనేది పెద్ద విషయం కాదంటావా ? కుటుంబ గౌరవ ప్రతిష్టలు దానిమీద ఆధారపడిలేవా ?"

"మామయ్యా, గౌరవం అనేది మన ఆస్తిమీద అంతస్థుమీద ఆధారపడి వుంటుం దని నా నమ్మకం. అంతేకాదు ఒక పెద్ద వుద్యోగంలో వుండి మన స్థానం మనకుంటే, మనం ఎవర్ని పెళ్ళిచేసుకునేది ఎవరూ పట్టించుకోరు. చాలామంది విషయంలో

చూశాను నేను. మా కుటుంబంలోనే చూడు, మా బాబాయిలు చిన్న వుద్యోగాలు చేస్తున్నారు. వాళ్ళ పిల్లలకి కూడా చదువులు అంతంతమాత్రమే. మేమందరం మా తాతగారింటికెడితే మమ్మల్ని ప్రత్యేకంగా గౌరవిస్తారు అంధరూ. ఎందుకు? నాన్నగారు డబ్బు, పలుకుబడీ బాగా సంపాదించారు కాబట్టి. లేకపోతే మేమెంత మంచివాళ్ళమయినా మాకు ప్రత్యేకత వుంటుందా?"

"సరే సంఘం సంగతి వదిలేయి. అమ్మా నాన్నల విషయం?"

"నేను అసలు పెళ్ళిచేసుకోనంటే బాధపడాలి కానీ, నాకిష్టమైన అమ్మాయిని చేసుకుంటానంటే కోపం చూపించడంలో అర్థంలేదు. అంటే నా సుఖంకంటే వాళ్ళకి సంఘంలో వాళ్ళనుకునే స్థానమే ముఖ్యం అన్నమాట. నాకు కులాల పట్టింపు లేదు. పద్మజలాంటి అమ్మాయిని కలుసుకోకపోతే, నాకే అమ్మాయి అన్నా ప్రత్యేకమయిన యిష్టంలేకపోతే అమ్మచెప్పిన అమ్మాయిని చేసుకుని వుండేవాడిని కాదా? అలాంటప్పుడు నేను యిష్టపడిన అమ్మాయిని వాళ్లెందుకు కాదనాలి?"

"శీనూ, నీ ధోరణి చూస్తే నీ నిర్ణయానికి తిరుగుండదనిపిస్తోంది. సరే, కానీ పెళ్ళిచేసుకుంటే అమ్మ మిమ్మల్ని ఆ యింట్లో వుండనిస్తుందా? మరి వేరే యిల్లు తీసుకుంటావా?"

"ఈ వూళ్ళో వేరేవుండటం కష్టం మామయ్యా. నేను బెంగుళూరు ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నిస్తున్నాను. బహుశ రెండు మూడు నెలల్లో అయిపోవచ్చు."

"కంగ్రాట్స్ మై బాయ్! నేను చెయ్యలేని పని నువ్వు చేస్తున్నావు. నీ నిర్ణయం ఎంత గట్టిదో తెలుసుకుందామని నిన్ను యిన్ని ప్రశ్నలు వేశాను. కానీ నాకంటే ఒకతరం తరవాతవాడివి కాబట్టి నువ్వు అలా అనగలిగావు. యిప్పుడు నిన్నడిగిన ప్రశ్నలే ఒకప్పుడు, దాదాపు పాతికేళ్ళక్రింద నేనెదుర్కొన్నాను. అప్పటి నా పరిస్థితి వాటికి సమాధానంచెప్పే ధైర్యం యివ్వలేదు. అందుకే ఓటమిని అంగీకరించవలసివచ్చింది."

"మామయ్యా, పాత సంగతి అడిగి నిన్ను బాధపెడ్తున్నాననుకోకపోతే నీ ప్రేమకథ వినాలని కుతూహలంగా వుంది."

"నాలాంటివాళ్ళకి ప్రేమ కథగానే మిగులుతుంది శీనూ. అందుకే ప్రేమని వూహలోంచి జీవితంలోకి తీసుకోవాలనే నీ నిర్ణయం నన్నెంతో సంతోషపెట్టింది. సరే నా కథ వింటానన్నావుగా, విను.... నువ్వు చేసుకోవాలనుకునే అమ్మాయికి,

నీకూ కులమే తేడా. నేను ప్రేమించిన అమ్మాయి క్రిస్టియన్‌పిల్ల. నేను యింటర్మీడియెట్, బియస్సీ కాకినాడలో చదివానని నీకు తెలుసుకదా. బియస్సీ ఫస్టియర్‌లో వున్నపుడు ప్రేమలత అన్న అమ్మాయి వచ్చి మా క్లాసులో చేరింది, మొదట ఆ అమ్మాయిని చూసినప్పుడే ఏదో ఆకర్షణ కలిగింది నాకు. కానీ మాట్లాడే ధైర్యం లేకపోయింది. అయితే కొద్దిరోజుల్లోనే నాగురించి ఆ అమ్మాయి చాలా వివరాలు తెలుసుకుంది. అంటే అప్పుడు కాలేజీలో నాకు కొంచెం ప్రత్యేకత వుండేది. ఎప్పుడూ కబుర్లుచెప్పడం, పాటలు పాడ్డమేకాక, అప్పుడప్పుడు నేను మంచి బొమ్మలు వేసేవాణ్ణి. మా కాలేజీలో ఏదో ఎగ్జిబిషన్ అయింది. అప్పుడు నా చిత్రాలు కూడా ప్రదర్శించారు. అవి ప్రేమలతకి చాలా నచ్చాయట. ఓకరోజు ప్రాక్టికల్స్ అయిపోయి లాబ్ బయటికి వస్తూంటే వచ్చి మాట్లాడింది.

"మీరు మాయింటికి రావాలి, వస్తారా ?" అంది.

నేను వుక్కిరిబిక్కిరయిపోయాను. మొదట ఏం చెప్పాలో తోచలేదు. తేరుకుని,

"తప్పకుండా వస్తాను. మీ యిల్లెక్కడ ?" అన్నాను.

"రామారావుపేటలో కొత్తగా వచ్చిన యిన్‌స్పెక్టరుగారిల్లెక్కడ అంటే ఎవరైనా చెప్తారు."

చచ్చాం, వాళ్ళ నాన్నగారు పోలీసు యిన్‌స్పెక్టరా అనుకున్నాను. కానీ వాళ్ళింటికి వెళ్ళినపుడు తెలిసింది ఆయన మంచితనం. అప్పటిదాకా పోలీసులంటే వున్న నా అభిప్రాయం మారింది, ఆయన ఓర్పు, మంచితనం చూశాక. ప్రేమలత నన్ను చాలా పొగిడింది ఆయనదగ్గర. నా చిత్రాలు, పాటలు, నా మార్కులు అన్నీ మెచ్చుకుంది. మొదటిసారి పరాయి ఆడపిల్లతో మాట్లాడడానికి మొహమాటపడ్డ నామీద ప్రేమలత నాన్నగారికి కూడా మంచి అభిప్రాయమే కలిగింది.

"అప్పుడప్పుడు వస్తూండవోయి," అన్నారు.

ఆ సంవత్సరమంతా అప్పుడప్పుడు వెళ్ళాను వాళ్ళింటికి. చివరికి పరీక్షల ముందు నోట్సుకోసం తరుచుగా వెళ్ళాను. నాకు పుస్తకాలు చదవడమంటే విసుగుండేదికాదు కానీ, కూర్చుని రాయడమంటే విసుగొచ్చేది. వున్న కాస్త ఓపికా రికార్డ్సు వేసేటప్పటికి అయిపోయేది. లత మాత్రం పాపం, ఓపిగ్గా కూర్చుని అంత నోట్సూ ప్రిపేర్ చేసేది. నాకు అది కాపీ చేసుకోడానికి కూడ

బద్ధకమేసి అదే చదివేసే వాడిని. అదీ కాక తనుకూడా చాలా చక్కటి భాషలో బాగా రాసేది. అందుకని కూడా యింక నేను కష్టపడ లేదు. దానితో మా పరిచయం బాగా పెరిగింది. నా రాకపోకలకి వాళ్ళ నాన్న, అమ్మ అడ్డుచెప్పలేదు కనుక నేను చాలా ఫ్రీగా వుండేవాడిని. వాళ్ళకి ముగ్గురూ ఆడపిల్లలవడం, లత అక్కలిద్దరికీ పెళ్ళిళ్ళైపోవడంతో వాళ్ళ యింట్లో లతకి కంపెనీ లేదని కూడా బహుశా వాళ్ళూరుకుని వుండచ్చు. ఫైనలియర్‌లోకి వచ్చాక అంతదాకా మా స్నేహాన్ని తరిచిచూసుకున్న నాకు లతని పెళ్ళిచేసు కోవాలనే కోరిక కలిగింది. అయితే నేను మా మధ్య వున్న భేదాల గురించి ఆలోచించకపోలేదు. కానీ ఒక్కగానొక్క కొడుకైన నా కోరిక మావాళ్ళు కాదనరనే గుడ్డినమ్మకం ఎందుకో నాకు కలిగింది. మన ముందువాళ్ళు కాలేజీల కెళ్ళి చదువుకోలేదు కదా, మే మా పనిచేసి ఎంతో గొప్ప హీరోలయిపోయాం అనుకునే రోజుల్లే అవి. అలా అనుకున్నాక లతని చూస్తున్నకొద్దీ నా ప్రేమ యింకా పెరగసాగింది. ఆ కాలంలో మన యిళ్ళల్లో ఆడపిల్లల్ని బయటికిపంపి చదవనిచ్చేవారు కాదు. అందుకని చకచకా యింగ్లీషులో మాట్లాడేసే లత నాకు ఆరాధ్యదేవత అవడంలో ఆశ్చర్యంలేదు. అంతేకాదు, తన ఓర్పు, నా పట్ల తన అభిమానం నా ప్రేమని దృఢంచేశాయి. అప్పట్నించీ దాదాపు రోజూ సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళేవాణ్ణి. ఓ రోజు నా మనసులో మాట లతకి చెప్పాను. నా పట్ల తనకి ప్రేమవున్నమాట నిజమే కానీ మా పెద్దవాళ్ళు ఒప్పుకోరని అంది. నిజమే. నిప్పులు కడుక్కునే బ్రాహ్మణయింట్లో అబ్బాయి క్రిస్టియన్‌ని చేసుకోడానికి ఎవరొప్పుకుంటారు? కానీ నా తల్లిదండ్రులు నా మాట కాదనరని గట్టిగా నచ్చచెప్పాను. ఇంక తర్వాతేముంది. పదినెలల కాలం యిట్టే గడిచిపోయింది. ఇంకా చదవాలనే వుద్దేశ్యంతో యిద్దరూ కలిసి పట్టుదలగా చదవడంతో యిద్దరికీ ఫస్ట్‌క్లాస్‌లు వచ్చాయి. ఆ శలవల్లో యింట్లో గొడవ ప్రారంభమయింది. నేను పరీక్షలు రాసి యింటికి వెళ్ళగానే అమ్మ మొదలు పెట్టింది నాకు పెళ్ళి చేసేయాలని. నేనెంతగా చెప్పినా నాన్న, అక్కయ్యలు, అమ్మ వినిపించుకోలేదు. ఇంక విధిలేక చెప్పేశాను, నా క్లాస్‌మేట్‌ని పెళ్ళిచేసు కుంటానని. యింకేముంది. ఏడుపులు, గొడవ, గందరగోళం. అమ్మ నూతిలో దూకుతానంది. ఆస్తిలో చిల్లిగవ్వ యివ్వనని నాన్న బెదిరించారు. అప్పుడు అక్కయ్యలు అక్కడే వున్నారు. నలుగురూ, ముఖ్యంగా లలితక్కయ్య నా నిర్ణయం మార్చడానికి శతవిధాలా ప్రయత్నించారు. నాకవన్నీ చూసి అసహ్య

యినంది. ఇంట్లోంచి వెళ్ళిపోదామనుకున్నాను. దురదృష్టవశాత్తు టైఫాయిడ్ పట్టుకుంది నన్ను. ఇవన్నీ తెలియక లత చాలా కంగారుపడింది రిజల్ట్స్ నేనింకా మంచంమీద వున్నప్పుడే వచ్చాయి. ఆ రెండు నెల్లు మా అమ్మ, లలిత అక్కయ్య నన్ను కంట్లో పాపలా చూసుకున్నారు. కొంచెం జ్వరం తగ్గగానే యిక మళ్ళీ అదే ధోరణి. అది చూసి నేనొకటే అనుకున్నాను. మొండిగా లతని పెళ్ళి చేసుకున్నా, ఆస్తి లేకపోతే ఆమెని సుఖపెట్టలేను. ఇప్పటి పరిస్థితిలో వూహించకు శీనూ, యింత పైకొస్తానని తెలిసుంటే ఎన్నేళ్ళయినా ఆగి లతని పెళ్ళిచేసుకునేవాడిని. అప్పటి ఆలోచనలో నా డిగ్రీ విలువ నాకే తెలియలేదు. అంతేకాక మా యింట్లో లతకి ఎప్పటికీ స్థానం లభించదు. అన్నీ వున్న లతని నాతో పెళ్ళి ఏకాకిని చేస్తుంది సంఘంలో అన్న ఆలోచనే కాస్త ఓపిక రాగానే కాలేజీకి వెళ్ళాలని కాకినాడవెళ్ళి లతను కలుసుకున్నాను. నా మనసులో మాటే చెప్పాను. యిద్దరికీ సుఖంలేని పెళ్ళికంటే విడివిడిగా వుండడం మంచిదన్న నా నిర్ణయానికి సహజ గంభీరురాలైన లత ఏమీ అడ్డుచెప్పలేదు. ఇప్పుడాలోచిస్తే అనిపిస్తుంది ఎంత బలహీనమైన క్షణాల్లో అటువంటి నిర్ణయం తీసుకున్నానూ అని. లత కళ్ళనీళ్ళతో నాకు వీడ్కోలిచ్చింది. ఆనాటి లత కళ్లు ఆ కళ్ళలో నీళ్ళు నేనీనాటికీ మరిచిపోలేను శీనూ."

ఒక్క నిమిషం ఆగాడు సుందరమూర్తి. అతని కళ్ళలో తడి చూసిన శ్రీనివాస్ చలించిపోయాడు. ఎప్పుడూ అందర్నీ నవ్విస్తూ వుండే మామయ్య మనసులో యింత బాధ దాచుకున్నాడా అనిపించిందతనికి. మళ్ళీ సుందరమూర్తే చెప్పడం సాగించాడు.

"శ్రీనూ, నన్ను ప్రేమించిన ఆడపిల్లని బాధపెట్టిన పాపం వూర్కేపోలేదు. నా జీవితంలో సుఖం ఆనాటితోటే పోయింది. ఇది నీకు అర్థంకావాలంటే మీ అత్తయ్య గురించి చెప్పాలి.... నేను లతతో చెప్పేసి వచ్చిన మూడునెలలకి నా పెళ్ళి శారదతో అయింది. నలుగురన్నదమ్ముల మధ్య గారాబంగా పెరిగింది శారద. ఆస్తివున్న వాళ్ళని, కట్నం, లాంఛనాలు బాగా యిస్తారని ఈ సంబంధం ఖాయం చేశారు అమ్మ, నాన్న, లలితక్కయ్య. నేను చేసిన మొదటి తప్పు లతని ఒదులుకోవడమైతే, ఎవరో ఒకరిని పెళ్ళిచేసుకోవడం నా రెండో తప్పు. జీవితమంటేనే విరక్తిగావున్న ఆ సమయంలో నాకు ఏదీ ముఖ్యంగా అనిపించ లేదు. కానీ శారదతో జీవితం ప్రారంభించిన ఒకటి రెండేళ్ళలోనే నా తప్పు

తెలిసివచ్చింది. శీనూ, నీలాంటి మేనల్లుడుండగా నా కుతురు లావణ్యని నీకిస్తానని ఎప్పుడూ నేననలేదు. కారణం తెలుసా?"

మామయ్య అంత సూటిగా అడిగేసరికి యిరుకునపడ్డాడు శ్రీనివాస్. అది గమనించాడు సుందరమూర్తి.

"నీకు ఈ ప్రశ్న ఎంబరాసింగ్‌గా వుంటుందని నాకు తెలుసు శీనూ. దానికి కారణం మీ అత్తయ్యే. ఎందుకో మొదట్నించీ తను అత్తగారన్నా, ఆడబడుచులన్నా సదభిప్రాయం ఏర్పరచుకోలేదు. బహుశ అత్తవారింట్లో వారిని ద్వేషించాలని మన ఆచారాలే నేర్పుతాయేమో. చాలా మంది ఆడవాళ్లు తమ అత్తగారి వైపువాళ్ళని చూసే పద్ధతిచూస్తే అది సాంప్రదాయమైపోయిందేమో అనిపిస్తుంది. నా పెళ్ళయిన అయిదారేళ్ళు అత్తయ్య ఎక్కువభాగం మా అమ్మావాళ్ళ దగ్గరేవుంది. నా ఎమ్ ఎస్ సి, రిసర్చి అన్నీ అయి, వుద్యోగానికి వెళ్ళినపుడే తను నాతో వచ్చింది. వేరే వూళ్ళో కాపురం పెట్టినప్పటినుంచీ అమ్మా వాళ్ళ దగ్గరకెళ్ళడం తన కిష్టం వుండేదికాదు. ఏమైనా శుభకార్యాలకి మాత్రమే వచ్చేది కానీ, వూరికే ఎప్పుడూ రాలేదు అత్తయ్య అమ్మమ్మగారింటికి. అసలు తనకి డబ్బుగల వాళ్ళమ్మాయిననే అహంకారం చాలా ఎక్కువ. దానితో ఎదుటివాళ్ళని చాలా తక్కువచేసి మాట్లాడుతుంది. అది నాకు అస్సలు యిష్టం వుండదు. అంతేకాదు, ఏనాడూ నా మనసు అర్థంచేసుకోడానికూడా ప్రయత్నించలేదు. శీనూ, ఈ విషయం లలితక్కయ్యవాళ్ళు బాగానే గ్రహించారు. కానీ ఎవ్వరూ ఏమీ తెలియనట్టే వుంటారు. అది వాళ్ళ తప్పే గనక. మొన్న మా నాన్న పోయినపుడు వెళ్ళాం కదా. అప్పుడు మా దూరపు బంధువు ఒకావిడ "మీరిద్దరూ వియ్యం అందుతారు కాబోలు" అంది కుతూహలంగా.

అక్కయ్య సర్దేసింది.

"అత్తయ్యా, పిల్లలు పెద్దవాళ్ళయ్యాక వాళ్ళ యిష్టాయిష్టాలుంటాయి కదా. పెద్దవాళ్ళం ఎట్లా నిర్ణయిస్తాం" అని. అఫ్‌కోర్స్, అప్పటికి నీ సంగతి అక్కయ్యకి తెలియదనుకో. తన మరదలి కిష్టం వుండదని తెలిసి అలా సర్దేసింది. నేను కూడా మిమ్మల్ని వూర్కే ఢిల్లీ రండిరా అంటానుగానీ ఎప్పుడూ బలవంత పెట్టను గమనించావా శీనూ? నా తరపు వాళ్లు రావడం తన కిష్టం వుండదు. అది నా యిల్లన్న భావమే నాకు లేకపోతే యిక నా వాళ్ళని పిలిచే కోరిక వుంటుందా శీనూ ఒకసారేమయిందో తెలుసా. నేను బెజవాడ ఎస్పారార్ సి వి ఆర్



కాలేజిలో పనిచేస్తున్నప్పుడు అమ్మా నాన్నా వాళ్ళు వచ్చారు, మాదగ్గర కొన్నాళ్ళుందామని. వాళ్ళ ఆచారం, మడీ తెలిసికూడా పనిమనిషిచేత మంచినీళ్ళు లోపల పెట్టించింది. వాళ్ళు వచ్చిన మర్నాడే తిరిగి వెళ్ళిపోయారు, "చూశాం కదా మిమ్మల్ని, ఈసారి వచ్చినప్పుడు వుంటాం" అని. ఇవన్నీ చూస్తూకూడా ఏం చెయ్యలేని పరిస్థితిలో వుండిపోయాను. నేను చెప్పినా శారద వినదని తెలుసు. మరో పక్కన వాళ్ళు చేతులారా చేసుకున్నదే కదా అన్న భావన. పోనీ యివన్నీ వదిలేసినా, నా మనసు, యిష్టాయిష్టాలు గ్రహించి గౌరవిస్తే

కొంతయినా ప్రేమించగలిగేవాడినేమో శారదని. ఒక్క విషయం శీనూ. లతలో నేను మాటల్లో ఒకసారి నలుపురంగంటే నాకు యిష్టంలేదని చెప్పాను. అప్పట్నించీ నల్లరంగుగానీ, ప్రింట్‌గానీ వున్నబట్టలు కట్టుకోలేదు తను. మరి వీరిద్దరి మధ్యా తేడా నాకు నిమిషనిమిషం గుర్తురాకుండా ఎట్లా వుంటుంది శీనూ. ప్రతి విషయంలోనూ అంతే, పుల్లవిరిచినట్టు మాట్లాడుతుంది. మా యూనివర్శిటీలో రిసర్చి స్కాలర్సు వుంటారు కదా. పైకి చెప్పకూడదు కానీ, సాధారణంగా ప్రొఫెసర్స్ చాలామంది వాళ్ళదగ్గర పనిచేస్తున్న రిసర్చి స్కాలర్స్ గురించి పట్టించుకోరు. నా కది యిష్టముండదు. నేను రిసర్చి చేసేప్పుడెంత కష్టపడ్డానో గుర్తుకెచ్చుకుంటుంటాను. అందుకే నా దగ్గరున్న స్కాలర్స్‌ని దగ్గరుండి పనిచేయిస్తాను. అందుకని అప్పుడప్పుడు సాయంకాలం లేటవుతుంది యింటి కెళ్ళేటప్పటికి. అంత అలసిపోయి యింటికెడితే ఆ సమయంలో ఎట్లా అనిపిస్తుందో తెలుసా. కళ్ళు మూసుకుని పడుకుంటే, ఎవరైనా చల్లటి చేతిని నుదుటిమీదవుంచి చక్కటి కబుర్లుచెప్తే బాగుంటుందని అనిపిస్తుంది. అటువంటి భార్యవుంటే ఏ మొగవాడూ దేనికీ విచారించ డనిపిస్తుంది నాకు. కానీ నా అర్ధాంగి ఏమంటుందో తెలుసా.

"ఏం యిట్లా పనిచేస్తే మిగతావాళ్ళకంటే ఎక్కువ డబ్బులిస్తున్నారా మీకు వాళ్ళు. ప్రపంచంలో యింకెవ్వరూ చెయ్యని వుద్యోగం మీరే చేస్తున్నట్టు. వూళ్ళో అందరి బాగోగులు మీకే కావాలి" అని అంటుంది. శీనూ, తన వృత్తిమీద, తను సీరియస్‌గా తీసుకునే పనిమీద గౌరవంలేని ఆడదాన్ని ఏ మగవాడైనా సహించగలడా చెప్పు? అర్థంచేసుకుని సలహాలివ్వడం అటుంచు. కనీసం గౌరవమైనా యివ్వకపోతే నా వృత్తికి. అదే లతైతే ఎట్లా వుండేది అన్న వూహ ఎప్పుడూ వస్తుంది. తనని పైకి చదివించి, డాక్టరేటుకూడా తెచ్చుకునేట్టు చేసేవాడిని. అప్పుడు యిద్దరూ మా లాబ్‌లో స్టూడెంట్స్‌కి గైడెన్స్ యిచ్చేవాళ్ళం. ఇదీ నా జీవితం శీనూ. శారీరకంగా శారదకి భర్తనైనా మానసికంగా నా దాంపత్యం లతతోటే. ఈ రెండిటికీ పొత్తు కుదరక నిమిష నిమిషం నరకం అనుభవిస్తుంటాను. జీవితంలో ఎన్నివున్నా, అర్థంచేసుకునే తోడు ఒక్కదానికి ఏదీ సాటిరాదు శీనూ."

శ్రీనివాస్ భరించలేకపోయాడు. అన్ని విషయాల్లో ఎంతో అదృష్టవంతుడని అందరూ అనుకునే మామయ్య ఎంత దురదృష్టవంతుడో ఎవ్వరికీ తెలియదు. అతి సున్నిత మనస్కుడైన మామయ్యకి ఎటువంటి భార్య! బాధతో విండిన

సుందరమూర్తి మొహం చూస్తుంటే శ్రీనివాస్‌కి జీవితంలో మొట్టమొదటిసారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కష్టాల్ని గుర్తించే సంఘం తొందరగా మనిషిలోని బాధని గుర్తించదు. ఎవడికైనా పెళ్ళాం పోతే "అయ్యో పాపం" అంటారు అదే తన భార్య తననర్థంచేసుకోదని ఎవరైనా అంటే పిచ్చివాడిని చూసినట్టు చూస్తారు. కొంచెం ధైర్యవంతుడై ఆ గయ్యాళి పెళ్ళాన్ని వదిలేస్తే యిక సంఘంలో వెలే వాడికి. మామయ్యకి ఏం తక్కువని అటువంటి భార్యని భరించాలి? ఆలోచనల్లోంచి తేరుకుని శ్రీనివాస్ అన్నాడు

"మామయ్యా, నువ్వు చెప్పింది విన్నాక భయమేస్తోంది. అసలు ఎన్ని పెళ్ళిళ్ళకి ఒక జంట ఆనందంగా వుంటుందో అనిపిస్తుంది. నువ్వేవరినైనా చూశావా, అటువంటి భార్యాభర్తల్ని?"

"శీనూ, నా సబ్జక్టులో రిసర్చితోపాటు ఇంకో విషయం నాకు ముఖ్యమైన టాపిక్ అయిపోయింది. ఏ భార్యా భర్తల్ని చూస్తున్నా నేనిదే గమనిస్తాను మనస్తత్వ శాస్త్రంలో కూడా ఎన్నో పుస్తకాలు చదివాను ఈ దృక్పధంతోనే యిప్పటిదాకా నేను స్టడీచేసిన వాళ్ళల్లో నాకు ఒక్కావిడే కనిపించింది. ఆవిడ మా యూనివర్సిటీలోనే ఒక ఫిజిక్స్ ప్రొఫెసరుగారి భార్య. ఒకసారి ఆయనకి జ్వరం వచ్చి నాలుగురోజులు వరసగా రాలేదు కాలేజీకి. అప్పుడే నాకు ఏదో ఒక యిన్ఫర్మేషన్ కావల్సివచ్చింది ఆయన దగ్గర్నించి. ఆంధ్రా అసోసియేషన్ సభ్యులుగా మేమంతా స్నేహంగా వుండేవాళ్ళం. సరే, వాళ్ళింటికి వెళ్ళాను ఆ ఆదివారం ప్రొద్దున్న. ఆయన డాక్టరు దగ్గరికి వెళ్ళాడట. ఆవిడా, పిల్లలూ వున్నారు యింట్లో. నేను వెళ్ళగానే ఆయన యింట్లో లేరని, వచ్చేస్తారు కూర్చోమని చెప్పి ఆవిడే కాఫీ, టిఫిను తీసుకువచ్చింది. ఎంతో అభిమానంగా యిచ్చినవి కాదనలేక తీసుకున్నాను. ఆవిడా, పిల్లలు అక్కడే కూర్చొని కబుర్లు చెప్పారు. వాళ్ళ పిల్లలేమేంచదువుతున్నారో అడిగి ఏవో మా యూనివర్సిటీ విషయాల గురించి మాట్లాడాను. మా సంభాషణలో ఆవిడ మాట్లాడిన తీరు నన్ను చాలా ఆశ్చర్యంలో ముంచింది. ఆవిడకి భర్త డిపార్టుమెంట్ విషయాలే కాక, మిగతా డిపార్టుమెంట్స్‌లో లెక్చరర్లు అందరిగురించి ఆయనకి తెల్సినవన్నీ తెల్సు. అంతేకాదు. ఎంతో వుత్సాహంగా ఆవిడ తన భర్త వుద్యోగాన్ని గురించి, ఆఖరికి అక్కడి పాలిటిక్స్‌కూడా మాట్లాడిందంటే వారిద్దరి మధ్య ఎటువంటి అనుబంధం వుందో అనిపించింది నాకు. వాళ్ళ పిల్లల్లో తెలివితేటలేకాక నమ్రత, వాళ్ళిల్లు, అన్నీ చూస్తూంటే ఆయన

ఎంత అదృష్టవంతుడా అనుకున్నాను, అటువంటి భార్య దొరికినందుకు అప్పట్నించీ ఆయన ఎప్పుడు పిలిచినా కాదనకుండా వాళ్ళింటికి వెళ్ళి ఆ భార్యా భర్తల మధ్యనున్న స్నేహాన్ని చూసి ఆనందిస్తుంటాను. సాయంత్రాలు కూడా వాళ్ళు బయటికి వెళ్ళరు. ఆవిడ వంటయిపోయాక యిద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటారు. అప్పుడప్పుడు పిల్లలు కూడా జాయిన్ అవుతారు. రోజంతా బయటపనిచేసివచ్చిన మొగాడికి అంతకంటె స్వర్గంవుంటుందా శీనూ. కానీ ఎన్నివందల కుటుంబాల్లో అటువంటి జంట ఒకటి వుంటుందో చెప్పలేము ఇప్పుడు నా పరిస్థితి చూడు. నాన్న పోయినా, అమ్మని నా దగ్గర పెట్టుకోడానికి లేదు. కూతుళ్ళిళ్ళకి ఆవిడ వెళ్ళదని తెలుసు. నేను రమ్మంటే ఢిల్లీ తప్పకుండా వస్తుంది. ఆవిడకి కాస్త మడి, ఆచారం ఎక్కువ కాస్త సానుభూతి వున్న కోడలైతే ఢిల్లీ కాదు, అమెరికాలో కూడా సాగించుకోవచ్చు మడి. కానీ యిలాంటప్పుడే నాకు లత బాగా గుర్తువస్తుంది. లతే శారద స్థానంలో వున్న ట్టయితే ఏం చేసేదో తెలుసా ? తను మడి కట్టుకుని వండిపెట్టేది. అది మా అమ్మకి పనికిరాదంటే తను వంటింట్లోకి వెళ్ళకుండా మనిషినిపెట్టి చేయించేది అమ్మకి కావలసినవి. నేను స్ట్రిక్ట్‌గా శాఖాహారినని తెలిసి తను కూడా మాంసా హారం మానేయగలిగిన మనిషి. ఇది చెయ్యదంటావా శీనూ ?.... ఇప్పుడని పిస్తుంటుంది శీనూ నేను తనని పెళ్ళిచేసుకోకుండా చాలా పొరపాటు చేశానని ఎందుకంటే నేను ఏ ప్రయోజనం కోసం నా సుఖాన్ని వదులుకున్నానో ఆ ప్రయోజనం నెరవేరటంలేదు. ఒక్కగాని ఒక్కకొడుకునై కూడా నా తల్లి దండ్రుల్ని చూసుకునే అవకాశం నాకు లేకుండానే పోయింది. ఇక ఏం అనుకుని నన్ను నేను సంతృప్తిపరచుకోవాలి శీనూ ?''

తన గతం గురించి మొట్టమొదటిసారి యింకోరికి చెప్పడం వలన, ఆ జ్ఞాపకాలు తిరిగి చేసుకోడంతోటి సుందరమూర్తి చాలా వుద్వేగంగా మాట్లాడాడు. నిమిషనిమిషం చేజారిపోయినదాన్ని తలచుకుని అతను పడే బాధ శ్రీనివాస్‌ని కూడా చాలా బాధించింది. అన్నీ వున్న మామయ్యకి ఎవరికీ తెలి యని, ఎవరూ తీర్చలేని లోటుంది జీవితంలో. మామయ్యచేత అంత ప్రేమించ బడే ప్రేమలత ఏమయిందో నన్న కుతూహలం కూడా కలిగింది శ్రీనివాస్‌కి

"మామయ్యా, ప్రేమలతగారు యిప్పుడెక్కడ వున్నారు ? తరవాత ఆమె కేమయిందో తెలుసా నీకు ?"

"నా పెళ్ళయాక దాదాపు పన్నెండేళ్ళకి చూశాను తనని పూరీ హైదరాబాదు

ఎక్స్‌ప్రెస్‌లో. నేను బొంబాయి వెళ్ళి తిరిగి మనూరు వెడుతున్నాను. అదృష్టవశాత్తు కింది బర్తులు రెండూ మావి. అప్పుడే తెలిశాయి తన విశేషాలు నా పెళ్ళిఅయిన రెండేళ్ళ తరవాత ఒక ఇన్‌స్పెక్టరుతో అయింది తనపెళ్ళి మేం కలుసుకునేటప్పటికి అతను డి. యస్. పి. అయాడుట. ముగ్గురు మొగ పిల్లలు, ముత్యాల్లా వున్నారు. పిల్లలు నిద్రపోయాక కూడా చాలాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నాం.

"ఎలావుంది లత జీవితం?" అన్నానేన్నను.

"నిజానికి, నాకేం లోటులేదు సుందర్. నా భర్త చాలా మంచివారు. నా మాటని ఎంతో గౌరవించి మన్నిస్తారు. ఆయన తల్లికి కూడా నేనంటే చాలా అభిమానమే. ఇక వీళ్ళు ముగ్గురు పిల్లలు చూశావుగా. నువ్వు గుర్తొచ్చినపుడు మాత్రం చాలా బాధపడతాను. కానీ ఏం చేస్తాం? అనుకున్నవన్నీ అయితే ఇక ఇది జీవిత మెందుకౌతుంది." అంది లత.

నేను చాలా సంతోషించాను. నావల్ల ఏరకంగానూ లతజీవితం పాడవనందుకు అయినా లతలాంటి భార్యని ఎవడు గౌరవించి ప్రేమించడు అనుకున్నాను మళ్ళీ తనే అడిగింది.

"నీ భార్య బాగుంటుందా? పిల్లలెందరు?" అని.

"నువ్వు అందంగురించి అడుగుతుంటే నా భార్య బాగావుంటుందనే చెప్పాలి జవాబు. కాని నువ్వు లేని లోటు నాకు ప్రతి క్షణం గుర్తొస్తూనేవుంటుంది లతా ఇవాళ నిన్ను చూశాక ఒక్కటిమాత్రం నాకు చాలా ఆనందంగా వుంది. అప్పటి నా బలహీనతవల్ల నష్టపోయింది నేనే. నీకేవిధంగానూ అది హానిచెయ్యలేదు ఇక నా జీవితమంటావా? ఏదో గడుస్తుంది. దాన్నిగురించి ఎంత తక్కువ ఆలోచిస్తే అంత మంచిది."

నేనలా మాట్లాడినందుకు లత చాలా బాధపడింది. ఎందుకు నా విచారం అని తరచి తరచి అడిగింది. వివరంగా నేనేం చెప్పలేదు. లతతో శారదగురించి మాట్లాడాలని అనిపించలేదు. లతమాత్రం వాళ్ళాయన గురించి ఏఅరమరికలు లేకుండా మాట్లాడింది. అంటే లత నాకంటే చాలా అదృష్టవంతురాలన్నమాట నాకు జీవితంలో మిగిలిన ఆనందం అదే శీనూ."

చాలాసేపు మాట్లాడడంవలన కొద్దిగా ఆగాడు సుందరమూర్తి. పదినిమిషాలు ఇద్దరూ ఏం మాట్లాడలేదు. తన బాధ ఒకరికి చెప్పడంతో కొంచెం స్థిమితపడ్డట్టు కనిపించాడు సుందరమూర్తి. తిరిగి శ్రీనివాస్‌ని అడిగాడు.

"అయితే శీనూ, ఎప్పుడు నీ పెళ్ళి ?"

"ఆర్నెల్లు పట్టవచ్చు మామయ్యా. అయినా యింకా పెళ్ళిళ్ళకి ఈ కులాల ప్రసక్తి ఎందుకో నాకర్థం కాదు."

"అంటే" అన్నాడు సుందరమూర్తి తెల్లబోయి తను చెప్పిందంతా విని మేనల్లుడు అట్లా అంటాడేమిటా అని.

"మామయ్యా ! ఇదివరకు రోజుల్లో కులాలమధ్య వుండే వృత్తిభేదాన్నిబట్టి వాళ్ళ ఆలోచనలు, అలవాట్లు తేడాగా వుండేవి. యిప్పుడు చూడు, మన బ్రాహ్మల్లోనే ఎందరు రోజూ సంధ్యావందనం చేస్తున్నారు ? మా తాతయ్య చాలా పూజలు చేస్తారు. అవన్నీ ఏమిటో మాకే కాదు. మా నాన్నకి కూడా తెలియదు. ఈ కులానికి ఈ లక్షణాలు అని చెప్పారే. వెతికితే ఎందర్లో కనిపిస్తాయి ? మొన్న దీపావళికి తాతయ్య మాసికం వచ్చింది కదా ! అమ్మా వాళ్ళంతా వెళ్ళారు వూరికి. నేనొక్కడ్నే యిక్కడ వుంటే పద్మజావాళ్ళన్నయ్య పండక్కి వాళ్ళూరు తీసికెళ్ళాడు. "పెళ్ళయింతర్వాత మావాళ్ళు రానిస్తారో లేదో, యిప్పుడే రండి మావూరు, పొలాలు చూడచ్చు," అంటూ అక్కడ పద్మజతో మాట్లాడకూడదని వార్నింగ్‌యిచ్చి నన్ను తన ఫ్రెండ్‌గానే వాళ్ళవాళ్ళకి పరిచయంచేశాడు. సరే. పండగరోజు చాలా రాత్రయేవరకు బాణానంచా కాలుస్తూనేవున్నాం. మర్నాడు కొంచెం లేట్‌గా నిద్రలేచాను. నేను లేవడం చూసి శేషగిరి నాదగ్గరకొచ్చి అన్నాడు—

"ఈవాళ కాఫీకి కాకయ్యహోటలుకి పోవలసిందే పదండి."

"అదేమిటి" అన్నాన్నేను అర్థంకాక. ఎందుకంటే ఆ ముందురోజు మేం లేచేసరికి కాఫీ పంపించారు మా గదిలోకి.

"ఇవాళ మా యింట్లో కేదారేశ్వరి వ్రతం. పూజయ్యేదాకా పచ్చి మంచినీళ్ళు యివ్వరు."

"మరి రోజూ అందరూ కాఫీలు తాగుతారు కదా ?"

"రోజూ తాగుతారు. యివాళ తాగరు. అంతేకాదు. యింకో పొయ్యి మన కోసం అంటించరు. పదండి బయటికెళ్దాం." అన్నాడు శేషగిరి.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నువ్వేం అనుకోకపోతే నేనొకటి చెప్తా మామయ్యా. అంత నిష్ఠ, ఇంత నిష్ఠ అని చెప్పే మన యిళ్ళల్లో చూడు. ఏదైనా పూజవున్న రోజు భోజనం లేటవుతుందని అమ్మకూడా ఒకటికి రెండుసార్లు కాఫీ తాగుతుంది. కాఫీ తాగి మళ్ళీ స్నానంచెయ్యడమే మనవాళ్ళకి మడికావి, అది




తాగకుండా వుండాలన్న నియమం, వుండగల ఓపిక లేవు. అంతేకాదు. వినాయక చవితి పూజనాడు లేటవుతుందని అమ్మ మాకు టిఫిన్ పెడుతుంది. మరి ఆ రోజు శేషగిరి కూడా కాఫీ తాగలేదు. 'మా యింట్లో అలవాటే లెండి' అన్నాడు. ఇక వాళ్ళ నాన్నగారు రోజూ పొద్దున్న స్నానం, పూజ అయితేగానీ ఏమీ తాగరు. శనివారమయితే కటిక వుపవాసం, ఏమీ తినరు. మరి దీన్ని నిష్ఠ అనకూడదా మామయ్యా. మరి మనకి వాళ్ళకి ఏమీ తేడా కనిపించలేదు నాకు. ఇప్పుడు చెప్పు మామయ్యా నీ వ్యక్తిగత అభిప్రాయం. నా నిర్ణయం తప్పా? ఒప్పా?"

"శీనూ, యిలాంటి విషయాలు ఒకరికి తప్పు, ఒకరికి ఒప్పు. కుటుంబ పద్ధతిని చూస్తే తప్పు. వ్యక్తిపరంగా చూస్తే ఒప్పు. నాలాంటివాడు సమర్థిస్తాడు. లలితక్కయ్యలాంటివాళ్ళు ఒప్పుకోరు. రేపు లావణ్య విషయం ఏంచెయ్యాలా అని నేను ఆలోచిస్తున్నాను."

"అదేమిటి మామయ్యా?" ఆశ్చర్యపోయాడు శ్రీనివాస్.

"ఇన్ని విషయాలు నీకు చెప్పాక దాపరికమెందుకు శీనూ. మన లావణ్య నవీన్‌కపూర్ అనే పంజాబీ అబ్బాయిని పెళ్ళిచేసుకోబోతోందిట. 'ట' అని ఎందుకన్నానంటే ఈ విషయం లావణ్య ఇంకా నాకు చెప్పలేదు. మొన్న నీ మధ్య ఏదో పనుండి లావణ్య నా డిపార్టుమెంటుకి వచ్చింది. వెళ్ళిపోతూ తను ఒక ఫిజిక్స్ డిమాన్‌స్ట్రేటరుతో మాట్లాడడం నేను పైనుంచి చూశాను. ఏదో పనుండి అతను నాదగ్గరకి వచ్చినపుడు లావణ్య ఎలా తెలుసునని కాజువల్‌గా అడిగాను. అతనెందుకో భయపడ్డాడు. భయమేమీలేదని నిజం చెప్పమంటే అతను చెప్పిన

విషయాలివి. ఆ నవీన్ కపూర్ ఇంజనీరు ఢిల్లీలోనే. వాళ్ళు ఖాత్రీలు అంటే క్షత్రియులన్నమాట మన భాషలో. అబ్బాయి చాలా తెలివైనవాడట, టాటా కంపెనీలో ఒక ఆఫర్ వుందనీ పెళ్ళయాక ఏకంగా లావణ్యని తీసుకునే ఢిల్లీనుంచి వెడతాడని చెప్పాడు. అతను నేను చెప్పిన డిమాన్‌స్ట్రేటర్‌కి కజిన్ అవుతాడట. లావణ్య ఎమ్. ఏ. అవడంకోసం వెయిట్ చేస్తున్నారన్న మాట. లావణ్యకి ఈ అబ్బాయి నాలుగేళ్ళనించీ తెలుసట."

"మరి అత్తయ్య ఒప్పుకుంటుందా మామయ్యా?"

"చచ్చినా ఒప్పుకోదు. కానీ తెలివితేటలున్నా లావణ్యకి తల్లి మొండితనమే వచ్చింది కాబట్టి అదీ లొంగదు. నేను తండ్రిగానే కాక ఒక వ్యక్తిగా కూడా లావణ్య నిర్ణయాన్ని సమర్థిస్తాను. కానీ శారద కష్టంలేకుండా దానికి చెయ్య వలసినవి చెయ్యలేను. కాబట్టి యిద్దరిమధ్యా నిలవడానికి నేను సిద్ధమవాలి."

"నువ్వు చెయ్యెత్తి దండంపెట్టవలసినవాడివి మామయ్యా, లావణ్యమీద కోపంతెచ్చుకోకుండా యిట్లా ఆలోచిస్తున్నావంటే...."

"శీనూ, ఒక విషయం మర్చిపోతున్నావు నువ్వు. నేనూ అటువంటి బాధ అనుభవించాను గనక సానుభూతి చూపించగలుగుతున్నాను. కానీ లలితక్కయ్యకి కానీ, శారదకి కానీ ఎట్లా అర్థం అవుతుంది? అర్థం కాదు. కావాలి అనుకోవడం కూడా పొరపాటే. నీకింకో వుదాహరణ చెప్తా విను. మా మేనమామ కూతురు శేషమ్మ తెలుసుకదా నీకు. దానికి చిన్నప్పటినించీ ఎంత ఆచారమో చెప్పలేను. హోమియోపతి మాత్రలు కిందపడ్డా సరే అవి తీసి గబగబా నీళ్ళు జల్లి శుద్ధిపేట్టేది. మేమంతా ఎప్పుడూ నవ్వుకునేవాళ్ళం, వాళ్ళింట్లో శుద్ధిమరకలు లేని గది వుండదని. దాన్ని, దాని యింటిని చూస్తేమాత్రం అంత ఆచారం యిల్లు నీట్‌గా పెట్టడానికి కాక కేవలం తన సంతృప్తికోసమే అనిపించేది. పెళ్ళయి వెళ్ళాక కూడా, గుంటూరులో వున్నన్నాళ్ళు వుమ్మడికుటుంబం గాబట్టి, వాళ్ళాయన వుద్యోగరీత్యా ఢిల్లీ వచ్చేసరికి ఆడపిల్లలు పెద్దయారు కాబట్టి సరిపోయింది. లేకపోతే రోజూ దాని వంట వాళ్ళాయన ఆఫీసు లంచవరుకి అవుతుంది. దాని స్నానాలకి, పూజలకి, నైవేద్యం పెట్టే వంటచేసుకోడానికి రోజుకి యాభై గంటలుంటే సరిపోతాయేమో. సరే అటువంటివాళ్ళు చాలామందున్నారు. ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే, ఈమధ్యే దాని కూతురు ఒక సిక్కుని పెళ్ళిచేసుకుంది."

"సిక్కుతన్నా?" శ్రీనివాస్ ఆశ్చర్యం అవధులు దాటింది.

"ఇంకా మనవైపు యిటువంటివి ఆశ్చర్యంగా వున్నాయి కానీ నార్త్‌లో

చాలా కామన్ అయిపోయాయి. పెద్దచదువులమీద యిప్పుడు చాలామందికి క్రేజ్ పోయింది. ఆడపిల్లలు కూడా డిగ్రీచదువు అయ్యో, అవకో జీవితంలో స్థిరపడదామని చూస్తున్నారు. వాళ్ళు అవతలివాడిలో చూసేదొకటే. వాడి ఆర్థిక స్థితి. డీసెంట్ లైఫ్ గడపడానికి చాలిన ఆదాయం వుండి, మనిషి మంచివాడైతే యింకేమీ పట్టించుకోవడంలేదు శీనూ. ఆ వాతావరణంలో పెరిగిన మిగతా పిల్లలు కూడా అలాగే ఆలోచించడంలో ఆశ్చర్యంలేదు. ఇవన్నీ చూస్తూకూడా నేను లావణ్యని ఎలా తప్పుపట్టను? అయినా యిప్పుడు మనం అనుకున్న ఈ మూడు కేసులే తీసుకుంటే_శేషుకూతురు తల్లి ఆచారాలమీదవిసిగి అలా చేసిందనుకోవచ్చు. అంతేకాక అది బి.యే. పాసయి మూడేళ్ళనించీ వుద్యోగం చేస్తున్నా వాళ్ళ నాన్న దాని పెళ్ళి గురించి సీరియస్‌గా ఆలోచించడంలేదు. అది కూడా ఒక కారణం కావచ్చు. కానీ లలితక్కయ్య ఎంతో యిదిగా పెంచింది కదా మిమ్మల్ని. నువ్వు పద్మజను మనస్ఫూర్తిగా యిష్టపడ్డావు కనుక ఈ నిర్ణయం తీసుకున్నావుగానీ ఏ విధంగానూ అక్కయ్యని నొప్పించడానికని నేననుకోను. ఇక లావణ్యని నేను చాలా జాగ్రత్తగా పెంచాను. అది కొంచెం పెద్దదయిన దగ్గర్నించీ ఒక స్నేహితుడిగా మెలగుతున్నానే కానీ, ఎప్పుడూ నా వుద్దేశాలని బలవంతంగా దానిమీద రుద్దాలనికానీ, ఏ విషయంలోనైనా నా మాటే విని తీరాలని ఆంక్ష విధించడానికిగానీ ప్రయత్నించలేదు. అలా అని బాగా ఆలోచించకుండా అది ఎప్పుడూ ఏ పనీ చెయ్యదు. అసలు యిప్పటిదాకా ఏ విషయంలోనూ నేను బాధపడేట్టుగానీ, కోప్పడేట్టుగానీ అది ప్రవర్తించలేదు. స్కూలునించీ కోఎడ్యుకేషన్‌లో చదివినా మొగపిల్లలతో ఎంత అవసరమో అంతేకానీ అనవసరపు పరిచయాలు పెంచుకోలేదు. నేనా విషయంలో నా కూతురి గురించి చాలా గర్విస్తాను శీనూ. అందుకే యిప్పుడు కూడా లావణ్య ఎన్నుకున్న అబ్బాయి అన్ని విధాలా దానికి తగినవాడే అయివుంటాడని నాకు గట్టి నమ్మకం. యిలా రకరకాల కేసులు చూస్తుంటే నా కొకటే అనిపిస్తోంది. ఇది కాలంలో వస్తున్న మార్పు. పెద్దవాళ్ళు దీన్ని గురించి బాధపడి, కృంగిపోవడంవల్ల ప్రయోజనంలేదు. పిల్లలు ఎదిరిస్తున్నారు. పరువు మంటకలుపుతున్నారని అనుకుంటే బాధని పెంచుకోవడమే అవుతుంది. అయితే అందరూ యిలా ఆలోచించడానికి కనీసం ఇంకో పందేళ్ళు పట్టచ్చు.... నీకో తమాషా చెప్పనా. మా అమ్మ తన యింటికి వచ్చి వుండమంటే రావడంలేదని లలితక్కయ్య విసుక్కుంది "పెద్దవాళ్ళు మారరురా. వాళ్ళు వాళ్ళ చాదస్తాలు" అని. అక్కయ్య

తన పెద్దవాళ్ళ గురించి ఆలోచిస్తోంది కానీ తన నమ్మకాలు తనకంటే చిన్న వాళ్ళకి చాదస్తాలు అవచ్చని గ్రహించడంలేదు. సరే, యిప్పుడు మనం చేసేదేమీ లేదు, పద యింటికెడదాం," అని టైము చూసుకున్నాడు సుందరమూర్తి.

"అరే తొమ్మిదిన్నరయింది. మన సినిమా అయిపోయింది. ఇంటికి పోదాం తొందరగా. లేకపోతే మనమేదో కుట్రచేస్తున్నా మనుకోవచ్చు అక్కయ్య." తన మామూలు ధోరణిలోకి వచ్చేసిన మామయ్యతోపాటు తనూ లేచాడు శ్రీనివాస్.

ఆ రాత్రంతా సుందరమూర్తి జీవితం గురించే ఆలోచించాడతను. చుట్టాలు, స్నేహితుల్లో చాలామందికి మామయ్యంటే అసూయ. 'అతనికేం, జీవితం వడ్డించిన విస్తరి' అంటారందరూ. అన్నీ వడ్డించిన దేముడు అన్నం మాత్రం పెట్టలేదు మామయ్య విస్తట్లో. యిన్నేళ్ళ జీవితంలో మామయ్య బాధ పంచుకున్న వాళ్లు లేరు. పాపం తోడన్నది లేకుండా జీవితం గడపడం దుర్భరం. అంత వున్నత వ్యక్తిత్వంకల మామయ్యకి తన అభిప్రాయాలు గౌరవించే జోడూ, తన భావాలు పంచుకునే తోడూ లేకపోవడం నిజంగా దురదృష్టం. అటువంటిది నాకు మాత్రం వద్దు అనుకున్నాడు శ్రీనివాస్.

* * *

కష్టాలు కలిసి వస్తాయి అన్నట్టు అనుకోకుండా యింకో సమస్య వచ్చి పడింది శంకరంగారికి, లలితాంబకి. సుందరమూర్తి వెళ్ళిపోయిన పదిరోజులకి హఠాత్తుగా రుక్మిణి వచ్చింది బరోడానించి. భర్తకి శలవు లేనప్పుడు పిల్లల్ని తీసుకుని ఒక్కత్తే రావడం మామూలే అయినా, వుత్తరంపత్తరం రాయకుండా హఠాత్తుగా దిగిన కూతుర్ని చూస్తే ఏదో అనుమానం వచ్చింది తలిదండ్రులకి. రెండు రోజులు వూరుకుని నెమ్మదిగా అడిగారు సంగతి. తల్లి అడగ్గానే బావురుమంది రుక్మిణి.

"అమ్మా, తొమ్మిదేళ్ళు భరించాను. ఇంక ఆ మనిషితో నేను వేగలేను. జీవితమంటే విసుగొచ్చేసింది నాకు," అంటూ.

లలితాంబగారు ఆశ్చర్యపోయారు. తమకి తెల్సినంతలో అల్లుడు చాలా యోగ్యుడు. బాగా దైవభక్తి వున్నవాడు, చెడు అలవాట్లేమీ లేనివాడూను. అదే అడిగారు కూతుర్ని.

"అసలు విషయమేమిటే. సరిగ్గా చెప్పు. నిన్ను బాగా చూసుకోవడం లేదా?"

"నన్ను చూడ్డానికి ఆయనకి టైమెక్కడమ్మా? రోజంతా పూజలకే చాలదు."

కూతురు చెప్పిన తీరు కోపంగానూ, వ్యంగ్యంగానూ వున్నా, ఆ సమాధానంతో తేలికపడింది తల్లిమనసు.

"చూడు పెద్ద పాపా, వాళ్ళింట్లో కొంచెం పూజాపునస్కారాలు ఎక్కువ. ఆ సాంప్రదాయం చూసే నిన్నతనికి యిచ్చాం."

"చాలా పొరపాటు చేశారమ్మా. నే నెలా జీవితం గడపాలనుకున్నానో తల్చుకుంటే జీవితం దుర్భరంగా అనిపిస్తుంది. మమ్మల్నెలా పెంచావమ్మా నువ్వు. ఆడింది ఆటగా పాడింది పాటగా పెరిగాను. సినిమా కెళ్ళాలనుకుంటే సినిమా, పిక్నిక్ కెళ్ళాలనుకుంటే పిక్నిక్. దేనికీ అడ్డుచెప్పకపోగా మమ్మల్ని తీసికెళ్ళేవారు నువ్వూ, నాన్న. ఎప్పుడైనా ఏ బాధ్యతైనా నామీద పెట్టావా? అన్ని విషయాలు నువ్వే చూసుకునేదానివి. ఎంత హాయిగా వుండేది అప్పుడు జీవితం; కాలేజీ, ఫ్రెండ్స్, సినిమాలు. నా జీవితం అట్లాగే నడుస్తుందనుకున్నాను. మా ఫ్రెండ్స్ అందరూ అట్లాగే లేరా పెళ్ళిళ్ళయాకకూడా. యిప్పుడు నా బ్రతుకు తల్చుకుంటే ఎందులోనైనా దూకేద్దామనిపిస్తుంది."

"ఏం మాటలే అవి ?" తల్లి కోప్పడింది.

"ఏం చెయ్యాలమ్మా. ఏం మన తాతయ్య పూజ చెయ్యరా ? అలా అని నాన్న ముక్కు మూసుకుని కూర్చున్నారా ? ఆ పద్ధతులు తనకి కుదరవని వదిలేసి చక్కగా సంపాదించటం లేదా. ఆయనా చేస్తున్నారు వుద్యోగం. పెద్ద ఆఫీసరే. రోజూ పూజకోసం నాలుగింటికి లేస్తారు నిద్ర లేకపోతే ఆఫీసు టైంలోగా అయిదుగంటల పూజ తెమలదుగా మరి. ఆ పూజ చేసేటప్పుడు ఎంత ప్రశాంతంగా కూర్చుంటారో యిక భోజనానికి అంత తొందర. చేసిన వన్నీ సరిగ్గా తినకుండానే వెడతారు. అలా అని నేను అంటే 'దైవభక్తి లేనివాళ్ళు నీచజాతికి చెందుతారు పుట్టుకవల్ల ఏ కులంవాళ్ళయినా' అని మొండి సమాధానం చెప్తారు. ఈ మధ్య ఈ పిచ్చి యింకా ఎక్కువయిందమ్మా. సాయంకాలం ఆఫీసునుంచి వచ్చి అప్పుడు ధ్యానం. ఏదయినా సినిమాకి వెళ్ళాలంటే పోరగా, పోరగా ఆదివారం మార్నింగ్ షోకి తీసికెళ్తారు ఎటూ తన పూజలకి భంగం రాకుండా. ఆ రోజు బోలెడు రష్‌గా వుండి సాధారణంగా మేం చూడదల్చుకున్న సినిమాకి టికెట్ దొరకదు. ఓ ఫ్రెండ్స్ లేదు. వాళ్ళిళ్ళ కెళ్ళడం లేదు. పండగలొచ్చినా పూజలే. విసుగెత్తిపోయిందమ్మా నాకు. నేవింక భరించలేను."

"తప్పు పాపా అలా అనకూడదు. అతని తప్పేముంది? అయినా దైవభక్తి

అబ్బడం చాలా విశేషం. ఈ రోజుల్లో చిన్నవాళ్ళకి ఎవరికుంది ఆ భక్తి. వాళ్ళింట్లో పద్ధతులే అతను పాటిస్తున్నాడు. ఎంతమంది పూర్వీకుల సాంప్రదాయాలు పాటిస్తున్నారు. మెచ్చుకోవలసింది పోయి..."

"దూరంనించి మెచ్చుకోవడానికి నా కేం అభ్యంతరం లేదమ్మా. కానీ నాకు ఆ పద్ధతులు నచ్చనపుడు, ఆ పూజలు ఆచారాలమీద నమ్మకం లేనపుడు ఎలా బ్రతకడం? అయినా నా కివన్నీ ముందే తెలిస్తే నిజంగా నే నాయనతో పెళ్ళికి ఒప్పుకునేదాన్ని కాదమ్మా. ఆలోచనలు, పద్ధతులు మా యిద్దరివీ ఇంత వేరయితే కలిసి జీవించడం ఎలాగమ్మా. ఇంక ఆ చాదస్తుడితో నేను బతకలేనమ్మా. నీ కభ్యంతరం లేకపోతే నేను, పిల్లలు యిక్కడే వుంటాం." కూతుర్ని ఏమీ అనలేకపోయినా, మొగుడ్ని వదలి ఆమె పుట్టింట్లో వుండడం అన్నది నచ్చలేదు లలితాంబగారికి. శంకరంగారు కూడా ఆవేశంలో అటువంటి నిర్ణయాలు తీసుకుంటే తరవాత బాధపడవలసివస్తుందన్న అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు. ఇవన్నీ చూస్తున్న శైలజకి జీవితం అంటే సమస్యలేనేమో అనిపించింది. అక్కయ్య బావగారి పద్ధతులు నచ్చకపోయినా తిరిగి ఆయన దగ్గరకి వెళ్ళడం అన్నా, లేక బావగారిని వదలి పిల్లలతో పుట్టింట్లో వుండడం - ఈ రెండింటిలోనూ ఏ పద్ధతీ నచ్చలేదు శైలజకి. దీనికి పరిష్కారం ఏమిటి అన్న ఆలోచనతో సతమతమైపోయింది ఆమె. తల్లితో గానీ, అక్కతో గానీ ఈ విషయం మాట్లాడడానికి ధైర్యం చాలలేదు. తన బాధ అన్నయ్యదగ్గర వెళ్ళబోసుకుంది ఒకరోజు.

కింద తల్లీ, తండ్రీ, రుక్మిణీ మాట్లాడుకుంటున్నపుడు నెమ్మదిగా శ్రీనివాస్ గదిలోకి వెళ్ళింది శైలజ.

"రా శైలూ, కూర్చో" అన్నాడు శ్రీనివాస్.

కూర్చున్నాక కాస్సేపు ఏం మాట్లాడలేదు శైలజ. నెమ్మదిగా అంది తరవాత.

"అన్నయ్యా, అక్కయ్య సంగతి ఎలాగ?"

"ఏమిటో శైలూ, ఏం తోచటంలేదు. నాన్న అన్నట్టు యిప్పుడు ఆవేశంలో తీసుకున్న నిర్ణయాలు నిజంగా బాధాకరంగానే తయారవుతాయి తరవాత. అయినా బావగారయినా ఏ రకంగానైనా చెడ్డవారయితే మనకీ ఎత్తిచూపే అవకాశం వుంటుంది. ఇప్పుడు మనం మాత్రం ఆయనని ఏమనగలం?"

"అయినా పెద్దవాళ్ళు అన్నీచూసి చేసిన పెళ్ళికూడా యిన్ని సమస్యలతో కూడుకుని వుంటుందా అన్నయ్యా. ఏమిటో అయోమయంగా వుంది చూస్తుంటే."




శైలూ, నువ్వు ఒక సంగతి మర్చిపోతున్నావు ఇదివరకు రోజుల్లో - అంటే ఆడపిల్లలకి పన్నెండేళ్ళలోపల పెళ్ళిచేస్తే - నిజంగా జ్ఞానం వస్తుందే సమయానికి ఆడపిల్ల అత్తగారింట్లోనే పెరిగేది. ఆ పద్ధతులకే అలవాటుపడేది. మరి యిప్పుడు యిరవై ఏళ్ళు దాటాకంటే అలవాట్లు, అభిప్రాయాలు, ముఖ్యంగా జీవితంపట్ల దృక్పథం అన్నీ స్థిరపడిపోతాయి. మొగవాడి విషయంలోనైనా అంతే. అంతేకాక ఎవరైనా యితరులకోసం కొన్ని విషయాలలో సర్దుకోగలరు కానీ ఏ మనిషీ జీవితం అంతా యింకోళ్ళకోసం త్యాగం చెయ్యలేడు. ఇప్పుడు మనింట్లోనే చూడు. మన పెద్దవాళ్ళ అభిప్రాయాలు వాళ్ళ కాలాన్నిబట్టి, అనుభవాన్నిబట్టి ఏర్పరచుకున్నవి. మరి మన కాలాన్నిబట్టి, మనకున్న కొద్ది లోకానుభవంతో మనకీ కొన్ని అభిప్రాయా లేర్పడతాయి. మరి ఈ రెండింటి మధ్య తేడావుంటే ఎవరి తప్పంటావు ? అయినా శైలూ, అభిప్రాయభేదాలు, విభిన్న దృక్పథాలు ఎవరిమధ్యనున్నా చెల్లుతాయి కానీ దాంపత్యంలో కాదు. భార్యాభర్తల దృక్పథాలు ఉత్తర, దక్షిణ ధ్రువాలలాగా వుంటే వారు కలిసి జీవించడం కష్టం, ఎవరో ఒకరు పూర్తిగా త్యాగంచేస్తే తప్ప."

"మరి ఈ సమస్య తీరేదెట్లా అన్నయ్యా ?" బేలగా ప్రశ్నించింది శైలజ.

"దీనికి ఒకటే పరిష్కారమార్గం శైలూ, అది ఎవరికి కష్టం కలిగించినా. పెళ్ళిచేసుకుని సుఖంగా బ్రతకాలనుకుంటే మనస్సు పరిణతిచెందే వయసు వచ్చేవరకు ఆగి, మన ఆశయాలకి, ఆలోచనలకి తగిన భాగస్వామిని ఎన్నుకోవడ

మొక్కేచే మార్గం. దానివల్ల సమస్యలు లేకపోలేదు. అవి వేరే రకానికి చెందినవి. కానీ వ్యక్తికి స్వసుఖం లోపిస్తే అతను సమాజ[శేయస్సుకి కూడా దోహదంచెయ్యలేడు. కాబట్టి ఎవరి శక్తినిబట్టి వాళ్ళు ఆలోచించుకోవలసిందే."

అన్నయ్య చెప్పిన మాటలు అర్థంచేసుకున్న శైలజ అక్కయ్య సంసారాన్ని, అన్నయ్యా పద్మజలని పక్కపక్కన పెట్టి పోల్చిచూసింది మనసులో. తల్లి దండ్రుల మాటకి కట్టుబడి పెళ్ళిచేసేసుకుని తర్వాత భర్తపద్ధతులకి అలవాటుపడ లేక బాధపడుతున్న అక్కయ్య, తల్లిదండ్రుల యిష్టానికి వ్యతిరేకంగా నిలబడి ధైర్యంగా తనకి కావలసిన భాగస్వామిని ఎన్నుకున్న అన్నయ్య - వీరిద్దరిలో ఎవరిది సరైన మార్గమో నిర్ణయించుకోలేకపోయింది శైలజ.

రుక్మిణి సమస్యగురించి యింట్లో అందరూ ఎవరి ఆలోచనలలో వారుండగానే మరో రెండు రోజులకి అల్లుడు లక్ష్మీనారాయణశాస్త్రి దగ్గర్నించి ఘాటైన వుత్తరం వచ్చింది.

"పూజ్యులైన మామగారికి,

లక్ష్మీనారాయణ వ్రాయునది. ఈపాటికి మీ అమ్మాయిద్వారా విషయాలన్నీ వినేవుంటారు ఇక నేను చెప్పదలచుకున్నది యిది. మా యింటి సాంప్రదాయం, నిష్ఠాగరిష్ఠులైన మా తండ్రుల, తాతల విషయం తెలిసే మీరు మాకు మీ పిల్లనిచ్చారు. ఇప్పుడు ఆవిడగారి నవీన పద్ధతులకి యివి సరిపోవంటే మానుకోడం మాకు చేతకాదు. మా యింటి సాంప్రదాయాలు ఎప్పటికీ యిట్లా పాటించవలసిందే. ఇష్టంలేని మనుష్యులు తప్పుకోవాలే గానీ, వాటికి మాత్రం ఏ లోటూ జరగనీయము. సర్దుకోగలిగితే మీ అమ్మాయిని, పిల్లల్ని పంపండి. లేదా నా కొడుకులిద్దరినీ వెంటనే పంపాల్సింది. మీరు ఎప్పుడు పంపేది వుత్తరం రాస్తే బొంబాయిలో మా తమ్ముడు వాళ్ళని దింపుకుని బరోడాకి పంపగలడు. మీ మనసుకి కష్టం కలిగిస్తే మన్నించండి.

నమస్కృతులతో,
లక్ష్మీనారాయణ."

వుత్తరం చూసి లలితాంబగారు, శంకరంగారే కాక రుక్మిణికూడా భయపడింది. భర్త తనంటే చాలా ప్రేమగా వుంటాడు. మాటలలో ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోకపోవడంతో ఒకసారి యిట్లా వచ్చేస్తే ఏమైనా రాజీకొస్తాడేమో అని అనుకుంది. కానీ ఆ అంచనా తప్పయింది. ఇప్పుడు రభసచేస్తే తప్పంతా తన మీదే వుంటుంది అనుకున్న రుక్మిణి భర్తదగ్గరికి వెళ్ళిపోతానంది. వెంటనే

శంకరంగారు అల్లుడికి వుత్తరం రాసేశారు, ఏదో మనసు బాగులేక అలా చేసిందనీ, ఓ పదిరోజులుండి పిల్లల్ని తీసుకుని రుక్మిణి బరోడా వచ్చేస్తుందని. అలాగే పదిరోజులయాక వెళ్ళిపోయింది రుక్మిణి.

* * *

జరిగినది చూసి భయపడిపోతోంది శైలజ. పిల్లలకి కావలసిం దొకటి, తల్లిదండ్రులు చూసేది మరొకటి. నిజానికి రుక్మిణేమీ గయ్యాళిది, చెడ్డది కాదని తెలుసు శైలజకి. 'కానీ మనవాళ్ళే అని పద్ధతులు సరిపడనివాళ్ళకిచ్చి పెళ్ళి చేస్తే ఎంతకష్టమో' అనే వూహ వచ్చింది ఆమెకి. అన్నయ్య ధైర్యంగా తనకు కావలసిన అమ్మాయిని ఎన్నుకున్నాడు. ఇక చిన్నవాడైన తమ్ముడినొదిలేస్తే తన సంగతి సమస్యగానే వుంది. తన సమస్య అనుకోగానే మధుసూదనరావు గుర్తొచ్చాడు ఆమెకి. అతను శైలజకి రెండేళ్ళు సీనియర్. ఇప్పుడు ఎమ్. ఎస్. చేస్తున్నాడు. అతను ఫైనలియర్ మెడిసిన్‌లో వున్నపుడు ఒకసారి శైలజకి ప్రపోజ్ చేశాడు.ఒకసారి హాస్పిటల్‌కి వెళ్ళినపుడు అక్కడ వున్నాడు. ఆ రోజు శైలజ ఫ్రెండ్సెవ్వరూ రాలేదు. అప్పుడు అన్నాడతను.

"శైలజా, ఎన్నాళ్ళనించో నా మనసులో మాట మీకు చెప్పాలనుకుంటున్నాను. ప్రైవేటుగా ఒక నర్సింగ్ హోం పెట్టి వీలైనంత తక్కువ డబ్బుతీసుకుని బీదవాళ్ళకి సేవచెయ్యాలని నా జీవితాశయం. దానికి నా భార్యకూడా అటువంటి వుద్దేశం వుండే డాక్టరయితే బాగుంటుంది. మీరంటే నాకు యిష్టం, గౌరవం. మీ కభ్యంతరం లేకపోతే నేను మీ పెద్దవాళ్ళతో మాట్లాడతాను."

మధుసూదనరావు కామేశ్వరికి దూరపు బంధువు. అప్పుడప్పుడు అతనితో మాట్లాడినా, ఒక్కసారి అతను పెళ్ళిమాట ఎత్తేసరికి భయపడింది శైలజ.

"క్షమించండి డాక్టర్. మా తల్లిదండ్రులు ఒప్పుకోకపోవచ్చు. అది తెలిసి మీకు అనవసరంగా ఆశలు కల్పించలేను. మీ అభిమానానికి థాంక్స్. ప్లీజ్, ఈ విషయం యిక్కడితో మర్చిపోండి" అంది శైలజ, ఎంతో డీసెంట్‌గా. తన మనసులో మాటచెప్పిన మధుసూదన్ ఎక్కడ నొచ్చుకుంటాడో అని భయపడుతూ.

మధుసూదన్‌కి ఆశ్చర్యం వేసింది.

"అదేమిటి, మీరు అంత ఖచ్చితంగా చెప్తున్నారు, మీవాళ్ళు ఒప్పుకోరని? మీకు ప్రత్యేకమయిన అభ్యంతరం ఏమీ లేకపోతే వాళ్ళని ఒప్పించే బాధ్యత నాది," అన్నాడు.

"కారణం చెప్పాలని మీరు పట్టుబడితే నేనేం చెయ్యను. కామేశ్వరికి బంధువులంటే మీరు నియోగులు కదా. మావాళ్ళు శాఖాభేదం ఒప్పుకోరు."

"నాకు చాలా ఆశ్చర్యంగావుంది శైలజా. ఈ రోజుల్లో, అందులోనూ మెడికల్ కాలేజీలో చేరి మీకింత పట్టింపా?"

"పట్టింపు మా పెద్దవాళ్ళకని చెప్పాను," అంది శైలజ చిరుకోపంతో.

"మా వాళ్ళంతా బ్రాహ్మలైతే చాలని తృప్తిపడుతున్నారు. మరీ యింత మూర్ఖంగా ఆలోచిస్తే ఎలా శైలజా?"

తర్వాత అతను చాలా ప్రయత్నంచేశాడు శైలజ మనసు మార్చాలని. తన కభ్యంతరంలేదు కానీ పెద్దవాళ్ళని నొప్పించడం తన కిష్టంలేదని ఖచ్చితంగా చెప్పింది శైలజ. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా శైలజ హౌస్‌సర్జన్సీ ఎప్పుడౌతుందా అని కాచుకు కూర్చున్నాడతను, అప్పుడే శైలజ తల్లిదండ్రులతో మాట్లాడాలని.

శ్రీనివాస్ పట్టుదల చూసిన శైలజ ఆలోచనలోపడింది. రుక్మిణి సమస్యలు చూశాక యింకా భయం పట్టుకుంది. నిజానికి శైలజకీ పూజలు, ఆచారాల్లో ఎక్కువ నమ్మకంలేదు. అలాంటప్పుడు రుక్మిణి భర్తలాంటివాడే దొరికితే అలా అనుకున్నప్పుడల్లా మధుసూదన్ గుర్తువస్తాడు శైలజకి. తన ఆశయం కూడా డాక్టరుగా వీలైనంత సేవచెయ్యాలనే. మరి ఆశయాలు కలిసినప్పుడు పెళ్ళి చేసుకుంటే ఏం? ఈ ఆలోచన రోజురోజుకీ బలమయింది శైలజలో. కానీ శ్రీనివాస్ నిర్ణయం యింట్లో ఎంత అలజడిలేపిందో, తల్చుకున్నప్పుడు ఆ కోరిక నీరసపడిపోయేది.

* * *

శైలజ ఎటూ తేల్చుకోలేక సతమతమవుతుండగానే మరో రెండు నెలలకి శ్రీనివాస్ తనకి బెంగుళూర్ ట్రాన్స్‌ఫర్ అయిందని, పదిహేనురోజుల్లో వెళ్ళి జాయిన్ అవాలని యింట్లో చెప్పాడు. ఆ రోజు యింట్లో వాతావరణం వర్ణనాతీతంగా తయారయింది.

శంకరంగారు కొడుకుని తన రూమ్‌లోకి పిల్చి అడిగారు.

"శీనూ, ఈ ట్రాన్స్‌ఫర్ మనం వద్దనుకుంటే ఎవరితోనైనా మాట్లాడి ఆపించడానికి ప్రయత్నం చేస్తాను, ఏమంటావు?"

"వొద్దు నాన్నా. చదువు, వుద్యోగం అన్నీ యిప్పటిదాకా ఈ వూళ్ళోనే అయాయి కదా. కొన్నాళ్ళెక్కడైనా వేరే చోట వుందామని వుంది బెంగుళూరు కూడా మంచి సిటీ కదా. ప్రస్తుతం వెడదామనే అనుకుంటున్నాను."

ఇంకేమీ అనలేదు శంకరంగారు.

లలితాంబగారికి ఏం తోచలేదు. చాలారోజుల తర్వాత కొడుకుతో ఆ రోజే మాట్లాడారావిడ రాత్రి భోజనాల దగ్గర.

"బాబూ, కంపెనీవాళ్ళు నువ్వెళ్ళితీరాలని పట్టుబడుతున్నారా? పోనీ ఎలాగూ నీకేదైనా సొంతంగా చెయ్యాలనివుంది కదా. అది యిప్పుడే మొదలుపెడితేసరి. గవర్నమెంటు లోనిస్తుందటకదా. అంతదాకా ఓ పాతిక ముప్ఫైవేల దాకా మనం పెట్టగలం. ఏమంటావు?"

ఎంత అణచుకుందామన్నా ఆవిడ కళ్ళల్లో నీళ్ళుబికాయి. తల్లిని అట్లా చూసి శ్రీనివాస్‌కి కూడా హృదయం బరువెక్కింది. కాస్సేపు మాట్లాడలేకపోయాడు. తర్వాత మెల్లిగా అన్నాడు.

"అమ్మా, అలా మొదలుపెట్టాలంటే కనీసం ఓ పదేళ్ళు అనుభవం వుంటే బాగుంటుంది. అదీకాక యిప్పుడు ఈ ట్రాన్స్‌ఫర్ ఒప్పుకుంటే అమెరికా వెళ్ళే ఛాన్సు త్వరగా రావచ్చుననుకుంటున్నాను. ఇది వదులుకొని మళ్ళీనా వ్యాపారం అని మొదలుపెడితే ఎక్కడ తేల్తానో తెలీదు. కాబట్టి ఒకటి రెండేళ్ళయినా బెంగుళూరులో వుంటే బాగుంటుంది."

పైకి సమాధానం చెప్పినా తల్లి మనసులో బాధ, భయం గ్రహించిన శ్రీనివాస్‌కి తనమీద తనకే కోపం వచ్చింది. తనే కావాలని ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నట్టు వాళ్ళు పైకి అనకపోయినా తేలిగ్గా గ్రహించగలరు. కానీ అంతకంటే మార్గంలేదు. ఎదుటవుండి వాళ్ళని బాధపెట్టేకంటే దూరంగా వుండడమే మంచిది అనుకున్నాడతను.

శ్రీనివాస్ బెంగుళూరు వెళ్ళాల్సిన రోజైతే లలితాంబగారి బాధ యింకా ఎక్కువైంది. శంకరంగారు మౌనంగా వూరుకున్నారు. కానీ ఆవిడ పదే పదే భర్తతో ఈ విషయమే మాట్లాడారు. శైలజ ఎటూ మాట్లాడలేక వూరుకుంది. లలితాంబగారు మాటి మాటికి శ్రీనివాస్‌గదికేసి వెళ్ళడం, ఏదో చెప్పాలనుకోడం, మళ్ళీ ఏంమాట్లాడకుండా తిరిగివచ్చేయడం గమనించిన శ్రీనివాస్ బాధపడ్డాడు. ఎన్ని కబుర్లు చెప్పినా, అసలు సమయం వచ్చేసరికి తల్లిదండ్రులకి బాధకలిగించే పని చెయ్యడం ఎంత కష్టమో అనుభవపూర్వకంగా తెలిసింది అతనికి.

శ్రీనివాస్‌కి వీడ్కోలివ్వడానికి అందరూ స్టేషన్‌కి వెళ్ళారు. శంకరంగారు, "జాగ్రత్త బాబీ, మొదటిసారి యిల్లు వదలి బయటకి వెళ్తున్నావు. అక్కడి మనుష్యులు కొంచెం కొత్తగా వుండచ్చు. వుత్తరాలు మాత్రం రాస్తుండు," అన్నారు.

శైలజ "ఆల్ ది బెస్ట్ అన్నయ్యా. మేం యిలాగే త్వరలో నిన్ను అమెరికా పంపించాలి" అంది.

లలితాంబగారు "జాగ్రత్త బాబూ..." అని ఏమో చెప్పబోయారు కానీ కంఠం గద్గదమైపోయి మాట రాలేదావిడకి. బలవంతంగా దుఃఖాన్నాపుకుంటున్న తల్లికళ్ళల్లో బాధ, భయం, తనంటే ప్రేమ అన్నీ ఒక్కసారి చూడగలిగాడు శ్రీనివాస్.

"బెస్ట్ ఆఫ్ లక్" అన్న రఘురాంతో "దేనికి" అన్నాడు శ్రీనివాస్ మెల్లిగా.

"దేనికైనా" అని అర్థవంతంగా భుజాలెగరేశాడు రఘురాం.

శ్రీనివాస్ వెళ్ళిన తర్వాత రెండుత్తరాలు క్షేమ సమాచారాలు తెలుపుతూ రాశాడు. మరో నెల రోజులకి అతని దగ్గర్నించి పెద్ద వుత్తరం వచ్చింది. తల్లికి తండ్రికి కలిపి రాశాడా వుత్తరం. కొడుకు తమని విడిచి వెళ్ళిపోతున్నప్పుడు లలితాంబగారు ఏమనుకుని భయపడిందో అదే ఆ వుత్తరంలోని సారాంశం. పద్మజని తను పెళ్ళిచేసుకుంటున్నందుకు వారి మనసు బాధపడితే తనని క్షమించమని ఓ పదిసార్లు వేడుకుంటూ, వారిని బాధపెట్టాలని తన వుద్దేశ్యం కాదని పదే పదే రాశాడు. ఏదైనా వూహలో వున్నంత బాధ నిజంలో వుండనట్టు ఆ వుత్తరం చదివిన శంకరంగారు, లలితాంబగారు నిర్వేదంగా వుండిపోయారు.

రెండురోజులయాక పద్మజ వచ్చింది శంకరంగారింటికి. ఆ సమయానికి యింట్లోనేవున్న శైలజ ఆశ్చర్యపోయింది ఆమె ధైర్యానికి. శంకరంగారు హాల్లో సోఫాలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. లలితాంబగారు కూడా ఆయన పక్కనే కూర్చుని వున్నారు. వారిని ఎలా సంబోధించాలో తెలియని పద్మజ ఏమీ అనకుండానే మాట్లాడటం మొదలుపెట్టింది.

"మీ అనుమతి లేకుండా యింటికి వచ్చినందుకు నన్ను క్షమించండి. కానీ మీకు చెప్పడం నా బాధ్యత అనుకున్నాను. మీ అబ్బాయి దగ్గర్నించీ విన్ననే నాకు వుత్తరం వచ్చింది. ఎల్లుండి బయలుదేరి నేను బెంగుళూరు వెడుతున్నాను. మీ కోడలిగా నన్ను అంగీకరించడం మీకు చాల కష్టమని నాకు తెలుసు. కానీ నేను వెళ్ళేది మీ అబ్బాయిదగ్గరికి గనుక మీకు చెప్పాలని వచ్చాను. మీతో యింత పరిచయం వుంది కాబట్టి ఈ సాహసం చేశాను. మన్నించండి. మిమ్మల్ని బాధపెట్టాలని నా వుద్దేశ్యంకాదు. నేను నా వాళ్ళందరినీ వదులుకుని వెడ్తున్నాను. మా తల్లిదండ్రులకి వుత్తరం ద్వారానే ఈ విషయాన్ని తెలిపాను కానీ మీకు స్వయంగా చెప్పాలనిపించింది. మీకు యింకొక్క విషయం చెప్పాలని నా



కోరిక. మీ అబ్బాయిని మీ దగ్గర్నించి దూరం చేశానని మాత్రం భావించవద్దని నా ప్రార్థన. అంతేకాదు. ఆయనకి మీరంటే ఎంత భక్తి గౌరవాలున్నాయో నాకు తెలుసు. మీకు పైకి ఏమీ చెప్పలేని పరిస్థితిలో ఆయన బెంగుళూరు వెళ్ళారు. ఇద్దరి తరపున నేనే అర్థిస్తున్నాను, మీ ఆశీర్వచనం మాకు చాలా అవసరం" అంటూ వంగి వాళ్ళ కాళ్ళకి నమస్కరించింది పద్మజ.

"దీర్ఘసుమంగళీభవ" దీవించారు శంకరంగారు.

లేచి నుల్చున్న పద్మజ ముఖంలో సంతోషం కనిపించింది ఆయనకి.

"వస్తానండీ" అంది పద్మజ చివరిసారిగా శలవు తీసుకుంటూ.

"శైలజా, యింటికి వచ్చిన వాళ్ళు వెడుతుంటే బొట్టుపెట్టి తాంబూలమివ్వాలన్న జ్ఞానం కూడా పోతోందా?" గట్టిగా తల్లి అడిగిన ప్రశ్నకి అప్పటిదాకా నిల్చున్న చోటే నేలకతుక్కుపోయి పద్మజ మాటలు వింటున్న శైలజ, శిల్పానికి ప్రాణం

వచ్చినట్టు లోపలికి పరిగెత్తింది. కొద్ది క్షణాలలోనే తమలపాకులు, వక్క, పసుపు, కుంకుమ, పళ్ళు పెట్టిన తాంబూలం ఒక పళ్ళెంలో తీసుకువచ్చి బొట్టు పెట్టి పద్మజ చేతిలో వుంచింది. రెండు చేతుల్లో తాంబూలాన్ని పదిలంగా పట్టుకుని ఆ చేతులని కళ్ళ కద్దుకుంటుంటే పద్మజ రెండు కళ్ళల్లోంచి రెండు కన్నీటి బొట్లు రాలాయి. తాంబూలాన్ని ఎడంచేతిలో పట్టుకుని ఏం మాట్లాడలేక కుడి చేత్తో శైలజచేతిని తాకి కళ్ళతోనే ఆమె దగ్గర శలవు తీసుకుని బయటకు వెళ్ళిపోయింది పద్మజ.

బయట గుమ్మం తలుపుదగ్గర నిల్చుని పద్మజ కోసం చూస్తున్న రఘురాం ఆమె అక్కడికిరాగానే "నా పరీక్షలవంగానే నేను మెడ్రాసు వస్తాను పద్మా" అన్నాడు.

"అప్పుడు తప్పకుండా బెంగుళూరు రా రఘూ. మీఅన్నయ్య సంతోషిస్తారు" అంది పద్మజ.

"నువ్వు విచారిస్తావా వదినా" అన్నాడు రఘు. ఆ ప్రశ్నలోని వేళాకోళాన్ని పట్టించుకోకుండానే

"థాంక్స్, వెరీమెనీ థాంక్స్ రఘూ" అంది పద్మజ అభిమానంగా అతని వంక చూస్తూ.

"బెంగుళూరు తప్పకుండా వస్తా వదినా" అన్నాడు రఘు మనస్ఫూర్తిగా.

పద్మజ బెంగుళూరు చేరిన మర్నాడు పద్మజా శ్రీనివాసుల పెళ్ళి జరిగింది. అక్కడ శ్రీనివాస్ తోటి వుద్యోగులే అతిథులుగా గుళ్ళో ఆర్భాటమేమీ లేకుండా పెళ్ళిచేసుకున్నారు.

ఆ రోజు శ్రీనివాస్ పద్మజ నడిగాడు.

"పద్మజా మన పెళ్ళి రిజిస్టరు చేయిద్దామా?"

"నువ్వు నన్నొదిలేస్తావన్న భయం నాకు లేదు శీనూ. నా మీద నీ కటువంటి భయాలేమన్నావుంటే సరే చేయిద్దాం."

"ఏమిటోయి ఆ మాటలు?" శ్రీనివాస్‌కి కొంచెం కోపం వచ్చింది. పద్మజ భర్తకోపం పోగొట్టాలని నవ్వింది.

"శీనూ, పెళ్ళి అంటే నా అర్థం పరస్పర నమ్మకం, గౌరవం అని. అవి పోయాక సంఘం దృష్టిలో, చట్టం దృష్టిలో విలువవున్నా, ఆ పెళ్ళి నిజమైన బంధం కాదు. నీకో చిత్రమైన సంగతి చెప్పనా. నేను మెడికల్ కాలేజీలో చేరిన రెండేళ్ళకి మా ఎనాటమీ ప్రొఫెసర్ ఒకాయన రిటైరయ్యారు. నేను కాలేజీలో

చేరినప్పుడు అందరూ ఆయన గురించి బలే సంగతులు చెప్పారు. ఇంతకీ అసలు విషయం ఏమిటంటే ఆయనా, ఆయన భార్య అసలు పెళ్ళి చేసుకోలేదట. భార్య అని ఎందుకన్నానంటే అప్పటికి ఎప్పుడో దాదాపు ముప్ఫైఏళ్ళనించీ వాళ్ళు కలిసేవున్నారట. ఇద్దరికీ ఏ రకమైన పెళ్ళి తంతులోనూ నమ్మకంలేదుట. అందుకని మేం కలిసి జీవించడానికి నిర్ణయించుకున్నాం అనుకుని దాంపత్యం మొదలుపెట్టేశారుట. మొదట వాళ్ళ కథ వింటే భయమేసింది నాకు. మనుష్యులకి అంత ధైర్యం కూడా వుంటుందా అని. చివరికి ఏం జరిగిందంటే మేం ఫిఫ్త్ యియర్‌లో వున్నప్పుడు ఆవిడ పోయింది. తర్వాత నెలరోజులకంతా ఆయన వున్న యిల్లు అదీ అమ్మేసి రుషీకేశ్ వెళ్ళిపోయాడు తనకి జీవితం మీద యింక ఆశలేదని చెప్పి. శీనూ మరి వాళ్ళది అనుబంధం కాదంటావా? వాళ్ళు భార్యాభర్తలు కాకపోతే యింక లోకంలో ఎవరూ తగరేమో ఆ పేర్లకి అనిపిస్తుంది నాకు. మరి మా బాబాయీ వున్నాడు. ఇరవై ఎనిమిదేళ్ళు కాపురం చేసిన మా పిన్ని చనిపోతే, పెద్ద పెద్ద పిల్లలుండగా, అర్నెల్లు కాకుండా మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. దీనికేమంటావు శీనూ?"

"ఏమంటాను. ఏ విషయమైనా నాచేత ఒప్పించగల పెళ్ళాం వచ్చింది నాకు అంటాను. సరే. ఏంచేస్తాం? గతజలసేతుబంధనం." విచారించాడు శ్రీనివాస్.

"ఫరవాలేదు పెళ్లికొడుకుగారూ. పెళ్లింకా రిజిస్టరు కాలేదు. విచారించక్కర్లేదు." కవ్వించింది పద్మజ.

"ఇక్కడ రిజిస్టరు అయిపోయింది డార్లింగ్. ఇంక తప్పించుకోడం కష్టం" అంటూ పద్మజని గుండెలకి హత్తుకున్నాడు శ్రీనివాస్.

పద్మజ, శ్రీనివాస్ శైలజకి వుత్తరం రాశారు తమ పెళ్లి అయిన సంగతి. తన పెద్ద కొడుకు పెళ్లి బంధుమిత్రుల మధ్య తనెంతో గర్వించదగినట్లు జరుగుతుందనుకుంటే అట్లా అయినందుకు లలితాంబగారు బాధపడ్డారు. ఆవిడ, శంకరంగారూ మూడు నాలుగు రోజులు ఎక్కడికీ వెళ్ళకుండా యింట్లోనే వుండిపోయారు. వుత్తరం అందుకున్న పద్మజ తల్లిదండ్రులు మాత్రం వెంటనే బయలుదేరి హైదరాబాదు వచ్చేశారు. పద్మజ వుత్తరంలో బెంగుళూరనే రాసింది కానీ ఎడ్రసు రాయలేదు. అయినా ఆమె బాబాయి బెంగుళూరు వెళ్లి శ్రీనివాస్ ఫాక్టరీలో వాళ్ళ అడ్రసు కనుక్కొని యింటికి వెళ్ళాడు అయితే యిదంతా జరిగేటప్పటికి వాళ్ళ పెళ్ళయిపోయింది. కోపం పట్టలేక ఆయన శ్రీనివాస్‌ని నానా మాటలు అన్నాడు. వాళ్ళేం లెక్కచెయ్యలేదు అవి.

శేషగిరి మాత్రం తల్లిదండ్రుల కోపాన్ని, తిట్లని ఎదుర్కొని అభాండాన్ని నెత్తిమీద వేసుకోవలసి వచ్చింది.

"కులంగాని వాడ్ని చేసుకుని అందర్నీ కాదని వెళ్లిందే నాలుగురోజు లేలుకుని వాడు వదిలేస్తే ఏమిటి దాని గతి?" కొడుకుమీద ఎగిరాడు వెంకటరత్నం.

"అయ్యో, అవ్వే మాటలయ్యోయ్. అవతల మన పిల్ల బతుకే"కసిరింది భార్య రాజారత్నం.

"బాపనాళ్ళలా చదువుకోవాలి, బాపనాళ్ళలా పెద్ద వుద్యోగాలుచెయ్యాలి అని చెప్పేవాడివికదా మాకు నువ్వే. మరిప్పుడు పద్మజ చేసుకుంది ఆ కులంవాడినేగా తక్కువ కులంవాడు కాదుగా" తండ్రి వరస చూసి చూసి విసిగిపోయిన శేషగిరి తిప్పికొట్టాడు తండ్రి మాటలని.

వెంకటరత్నం కోపం మిన్నంటింది.

"ఏదిరా పెద్దకులం? వొరే, ఎవరికి వాళ్ళ కులమే గొప్ప....మనది ఎటువంటి కుటుంబం? చుట్టుపక్కల పదూళ్ళలో మన పొలాలున్నాయే. ఇట్లా వేరే కులం వాడిని నా కూతురు పెళ్ళిచేసుకుంటే యింక మనవాళ్ళు మన ముఖం చూస్తారా అని. ఇంతదాకా నేనన్నా, నా మాటన్నా భయపడి చస్తున్నవాళ్ళు రేపటినించీ వేలెత్తి చూపిస్తారు మనని."

"పోనీలే. మనకేం నష్టం" అన్నాడు శేషగిరి పెంకెగా.

"అవన్నీ చెప్పినా ఈ కాలపు వాళ్ళకి అర్థంకావురా. అన్నవుకదా దగ్గరుండి ఆడపిల్లల్ని జాగ్రత్తగా చూసుకుంటావంటే యిట్లా చేశావు. అయినా నన్ను కాదంటే దానికి ఆస్తిలో చిల్లి పైసా కూడా యివ్వను ఏం అనుకుంటున్నావో."

శేషగిరికి కోపం వచ్చింది తండ్రిమీద. గట్టిగా చెప్పాడు సమాధానం

"మనమేం యివ్వకపోయినా దానికి నష్టమేమీలేదు. రాజాలాంటి భర్తని సంపాదించుకుందది. మీ పుణ్యమా అని చెప్పించిన చదువుంది చేతిలో. అయినా యిప్పుడే చెప్తున్నాను. దాని పేర దాని కట్నంకోసం నువ్వు బ్యాంక్‌లోవేసిన దెబ్బైవేలు యివాళే బెంగుళూరు బ్రాంచ్‌కి ట్రాన్స్‌ఫర్ చేసేస్తున్నాను. దాని కిష్టమైనవాడ్ని చేసుకుందని దాన్ని అన్యాయం చేస్తే నేనూరుకుంటానా?"

ఆవేశంగా మాట్లాడిన కొడుకుని చూస్తే తండ్రికూడా భయమేసింది. అసలు పట్నంలో పెట్టి చదివించడం తనదే బుద్ధితక్కువ అని సణుక్కుంటూ అప్పుడే బయలుదేరి వూరికెళ్ళిపోయాడాయన.

పద్మజ తనకి రాసే వుత్తరాలు కామేశ్వరి యింటికి రాసేట్టు ఏర్పాటుచేసింది




శైలజ. అసలే బాధపడ్తున్న తల్లి తరచూ పద్మజ దగ్గర్నించి తనకి వుత్తరాలు వస్తే యింకా బాధపడ్తుందని అట్లా రాసింది వదినకి. తర్వాతో నెలకి పద్మజ అక్కడి లైన్స్‌క్లబ్ సహకారంతో క్లినిక్ ఒకటి తెరిచి వుచితంగా వైద్యం చేస్తోందని తెల్సి శైలజ సంతోషించింది. పద్మజ కట్నంకోసం ఆమె తండ్రి బ్యాంక్‌లో వేసిన డబ్బు ఆమె అవిధంగా వుపయోగిస్తున్నందుకు చాలా సంతోషించి, కంగ్రాచులేట్ చేస్తూ వుత్తరం రాసింది శైలజ. పద్మజ వుత్తరాలద్వారా వారి అన్యోన్య దాంపత్యాన్ని గురించి తెల్సుకుంటున్న శైలజ అన్నయ్య ధైర్యానికి మనసులోనే అభినందించింది. అయితే లలితాంబగారు కొడుకు చేసిన పనికి యింకా సమాధానపడకపోవడంతో అన్నయ్య యింటికి వెళ్ళాలన్న కోరికని లోలోపలే అణుచుకుంది.

కామేశ్వరి ద్వారా శ్రీనివాస్ పద్మజల విషయం తెలుసుకున్న మధుసూదన్‌కి కొండంత బలం వచ్చింది. తను యింకా లేట్ చేస్తే శైలజకి ఏదన్నా సంబంధం చూసేస్తారేమో అని భయపడి శంకరంగారింటికి వెళ్ళాడు ఒకరోజు.

కాలింగ్‌బెల్ కొట్టగానే పనిమనిషి వచ్చి తలుపు తీశాడు.

"శంకరశాస్త్రిగారున్నారా?" అడిగాడు మధుసూదన్.

"ఎవరొచ్చారని చెప్పనండీ?"

"డాక్టరు మధుసూదనరావు అని చెప్పు."

"కూర్చోండి బాబూ." అని లోపలికి వెళ్ళాడు.

అయిదు నిమిషాల తర్వాత శంకరరంగారు బయటి గదిలోకి వచ్చారు. సాధారణంగా సాయంకాలాలు ఎవరూ యింటికి రారు ఆయనకోసం. అందులో ఎప్పుడూ చూడని వ్యక్తి!

"మీతో నేను పర్సనల్‌గా కొంచెం మాట్లాడాలి. నేను డాక్టరు మధుసూదనాన్ని. మా నాన్నగారు ఆడిటర్ కె. వి. సుబ్బారావుగారు. మీకు తెలిసే వుంటుంది."

సుబ్బారావుగారబ్బాయి అనగానే శంకరరంగారు అభిమానంగాచూసి, "లోపలికి రా బాబూ, నా రూంలో కూర్చుని మాట్లాడుకుందాం" అన్నారు.

ఇద్దరూ శంకరరంగారి స్టడీ రూమ్‌లోకివెళ్ళి కూర్చున్నాక మధుసూధనే మొదలుపెట్టాడు.

"నేనింత ధైర్యంగా మీ దగ్గరికి వచ్చానని ఆశ్చర్యపోకండి. నాకు యిదే సరైన పద్ధతిగా అనిపించింది. మీ శైలజని పెళ్ళిచేసుకోవాలని నా కోరిక. నా ఎమ్. ఎస్. ఈ సంవత్సరంతో అయిపోతుంది. వీలైతే అయిదారేళ్ళు ఏదైనా ఫారిన్‌కంట్రీకెళ్ళి కాస్త అనుభవం సంపాదించి, నా స్పెషలైజేషన్ యింప్రూవ్ చేసుకుని తిరిగి రావాలనుంది. వచ్చాక యిక్కడొక నర్సింగ్‌హోమ్ పెడదామనుకుంటున్నాను. మా నాన్నగారికి నేనే పెద్దకొడుకుని. అందుకని యిప్పుడే బయటికి వెళ్ళి కాస్త వాళ్ళు పెద్దవాళ్ళయేటప్పటికి తిరిగి వచ్చి వారి దగ్గరుండాలని నా కోరిక. శైలజంటే నాకు చాలా అభిమానం. తనని ఎన్ని సార్లడిగినా మీరు ఒప్పుకోరని అంటోంది. కాబట్టి ఈ విషయం డైరక్టుగానే తెలుసుకుందామని వచ్చాను. నా చొరవకి మన్నించండి."

గబగబా తను చెప్పదలచుకున్నది చెప్పేశాడు మధుసూదన్. అతని మాట తీరు, తన కోరిక చెప్పినవిధానం సుబ్బారావుగారబ్బాయి అని కలిగిన అభిమానాన్ని పెంచాయి శంకరరంగారి మనసులో. శ్రీనివాస్ పెళ్ళి తరవాత శైలజకి ప్రయత్నం చెయ్యడమంటేనే భయంగావుంది ఆయనకి చటుక్కున ఎవరైనా ఏమైనా అంటారని. అందుకని మధుసూదన్ శైలజతో పెళ్ళికి తమ అంగీకారం అడగగానే ఆయన మనసు, వివేకం వెంటనే ఒప్పేసుకున్నాయి. చిరునవ్వుతో అన్నారాయన.

"బాబూ, మీ వాళ్ళకి శాఖాభేదాలు లేవా?"

"సర్, నేను మెడికల్ కాలేజీలో చేరినప్పటినుండి మా అమ్మ దాదాపు ప్రతి రోజూ అంటుంది. 'ఎవరైనా సరే బ్రాహ్మలపిల్లని చేసుకోగానీ, బ్రాహ్మలపిల్ల కాకపోతే, నా యింటి గడపతొక్కనివ్వను యిద్దర్నీ,' అని. అది ఆవిడ

భయంతో అన్నా, కోపంతో అన్నా వాళ్ళని నొప్పించడం నాకే యిష్టంలేదు. శైలజంటే మా యింట్లో అభ్యంతరం చెప్పరు. పైగా నా కిష్టమయిన పిల్లైతే నెత్తిమీద పెట్టుకుంటారు. నా కిప్పుడు కావలసింది మీ వుభయుల అంగీకారమే."

"మాకు అభ్యంతరం వుండదు బాబూ." మనస్ఫూర్తిగా అన్నారు శంకరం గారు.

"థాంక్యూసర్, మెనీ మెనీ థాంక్స్" మధుసూధన్ మొహంలో నిండిన సంతోషం శంకరంగారిని ఆనందపరిచింది.

తరువాత పనులు చకచకా జరిగిపోయాయి. కొడుకు చేసిన పనివల్ల తగిలిన దెబ్బనించి యింకా కోలుకోని లలితాంబగారు శైలజ పెళ్ళి విషయంలో ఏమీ అనలేదు. శంకరంగారే హడావిడిచేశారు. బంధువుల్లో ముఖ్యమైన వాళ్ళందరినీ పిలిచి చాలా గ్రాండ్‌గాచేశారు పెళ్ళి. శైలజ తన సమస్య అంత తేలికగా విడి పోయినందుకు ఆనందంతో తలమునకలై పోయింది. మధుసూదన్ ధైర్యాన్ని పదే పదే అభినందించింది.

విషయం తెలిసిన శ్రీనివాస్, పద్మజ శైలజని అభినందిస్తూ వుత్తరాలు రాసి వెయ్యిరూపాయలు కానుకగా పంపారు. ఆ వుత్తరాలు అందినరోజు శైలజ మొదటిసారి భర్తని ఒక కోరిక కోరింది. 'బెంగుళూరు అన్నయ్య, వదినల దగ్గరికి తనని తీసికెళ్ళాలని.' వెంటనే ఒప్పేసుకున్నాడు ఆనందపు టంచుల మీద విహరిస్తున్న మధుసూదన్.

పెళ్ళి హడావిడంతా అయ్యాక శైలజ అత్తగారింటికి వెళ్ళిపోయింది. ఆరోజు పొద్దున్నే శైలజ వెళ్ళిపోగానే యిల్లంతా బోసిపోయినట్టయింది లలితాంబగారికి. అన్యమనస్కంగా యిల్లంతా తిరిగింది ఆవిడ. రెండుసార్లు శ్రీనివాస్ రూంలోకి, శైలజ రూంలోకి వెళ్ళి వచ్చింది. ఏమీ తోచలేదు. మధ్యాహ్నం భర్త వచ్చేదాకా ఆలోచిస్తూ సోఫాలోనే కూర్చుండిపోయింది, భోజనం కూడా చెయ్యకుండా. శంకరంగారు యింటికి వచ్చి, బట్టలు మార్చుకుని పేపరు తీసుకుని సోఫాలో భార్యపక్కనే కూర్చున్నారు ఆవిడని చూడగానే అర్థమయింది ఆయనకి. ఇన్నాళ్లూ కొడుకు లేనిలోటుకే బాధపడుతున్నా, యిప్పుడు కూతురు కూడా వెళ్ళిపోవడంతో ఆవిడ బాధ రెండింతలయింది అని గ్రహించారు శంకరంగారు. ఆవిడని ఏదైనా మాట్లాడించాలని చాల మామూలుగా అడిగారు.

"ఏమిటి లలితా ఆలోచిస్తున్నావు?"

"ఏమండీ, నా పెంపకంలో ఏదైనా లోపం వుందా? ఎప్పుడూ పిల్లలు కోరినవి చేస్తూనే వున్నాను కదా! ఎందుకు వాళ్ళకంత పనికిరాకుండా పోయాను నేను?"

చేసుకొందామె. ఆమెకు భయం తగ్గలేదింకా.

"నిద్ర రావటం లేదు డాక్టర్! సహాయం చెయ్యగలరా?" అర్థించాడు రజనీ. అతని కళ్ళలో నీళ్ళు. ఆమె వెళ్ళింది బయటకు. రెండు నిముషాలలో తిరిగి వచ్చింది ఒక టాబ్లెట్ అతని కిచ్చి గబగబా తన అన్న డాక్టర్ రెడ్డి రూముకేసి నడిచింది డాక్టర్ రూప.

* * *

తన వాళ్ళందరూ ఎదురుగా కనిపించారు రజనీకి. హరి, అతని భార్య! చెల్లెలు, బావ! మల్లికార్జునం మామయ్య అందర్నీ చూస్తుంటే ఆనందంగా ఉందతనికి. ఏ కోరికలూ లేవిక! ప్రశాంతంగా ఉంది మనసుకి.

"అన్నయ్యా!" బావురుమని ఏడ్చాడు హరి. తమ్ముడ్ని కౌగలించుకొన్నాడు రజనీ. అతడి కన్నీళ్ళు తుడిచాడు.

"నువ్వు నవ్వుతూ ఉండాలన్నయ్యా! మా అందరి కోసం" అని కన్నీళ్ళు పెట్టుకొన్న చెల్లెలి తల నిమిరాడు. మల్లికార్జునం మామయ్యతో మాట్లాడాడు కాసేపు. చిరునవ్వు నవ్వుతూ అందర్నీ చూచాడు తనివితీరా! వాళ్ళకక్కణ్ణుంచి కదిలారు.

నిర్జీవంగా పడివున్నాడు రజనీకాంత్ బెడ్‌మీద. అతని గుప్పిట్లో స్లీపింగ్ టేబ్లెట్స్ మిగిలివున్నాయి యింకా. ఇరవై రోజులనుండీ ఒక్కొక్కటే దాచుకొంటున్నాడతడు. లోకంలో స్వయంకృతాపరాధులకు, వంచితులకు తన జీవితాన్ని దర్పణంగా వదిలి, మూడు పదుల యేండ్లకే మరో లోకం చేరుకున్నాడు రజనీ. తన (సంగీత) ప్రజ్ఞాపాటవాలతో వేలాది పండిత పామరులను రంజింపజేసిన సంగీతసుధానిధి, స్వరకర్త స్వర్గానికి పయనమై పోయాడు. రజనీకాంత్ మరిలేడు! చంద్రుడస్తమించాడు!!

(సమాప్తం)





''మరే. అంతా నా చెప్పుచేతల్లోనే వుంటున్నారమ్మా....'' బుంగమూతి పెట్టి అటుతిరిగి కూర్చుంది రాజ్యలక్ష్మి.

"లేదేమిటి? దేవిగారు అడుగులో వుండమంటే అరడుగులో వుంటున్నాడీ దాసుడు ఒక్క అయిదునిమిషాలాలస్యమయింది. అంతేగా? ఏదీ? అరె! చూడు నీ చేతులెలా కందిపోయాయో .." తన రెండుచేతుల్లోకి ఆ పిల్ల మృదు హస్తాలను తీసుకుని మూర్కొన్నాడు కృష్ణ. "అసలే ఆ బల్లి గేదెపెయ్యలాంటిది. ఒక్కర్తివీ దాన్నెందుకు అట్నుంచి యిటు వేయడం చెప్పు? నువ్వు చాకిరీచేయడం నాకిష్టం వుండదు"- నిజంగా భార్య పడ్డ శ్రమకి నొచ్చుకున్నాడు.

రాజ్యలక్ష్మి "పోదురూ" అని చేతులు జాగర్తగా లాగేసుకుని, సిగ్గుతో ఆ దోసిట్లోనే మొహం దాచుకుంది.

"ఇక్కడెవరూ లేరు కదా! ఎందుకో అంత సిగ్గు?" అన్నాడు - లేచి. "ఆ, ఆఫీసుగుడ్డలు మార్చుకుని, మొహం

కడుక్కొని రండి," అంటూ వంటయింటి వేసి వెళ్ళిపోతున్న రాజ్యలక్ష్మిని తన్మయంగా చూస్తూ ...

కృష్ణ గదికి పాతరూపు లేనేలేదు. బల్ల అట్నుంచి యిటు మారిపోయింది. కిటికీకి మట్టి కొట్టుకున్న తెర లేదు. రంగు రంగుల కొత్త తెర కళకళలాడుతోంది. బల్లమీద ఏనాటిదో ప్లాస్టిక్ గుడ్డ తీసి అవతల పారేసి దానిస్థానే స్వహస్తాలతో అల్లిన అల్లికగుడ్డ పరిచింది రాజ్యలక్ష్మి. గోడలమీద సాలెపురుగులకు, నల్లులకు గల జన్మహక్కును రాజ్యలక్ష్మి ఒప్పుకోలేదు. కొత్త వెల్తురు వచ్చినట్లుంది గదిలోకి "పుస్తకాల ర్యాకు"లో పుస్తకాలన్నీ బుద్ధిగా వున్నాయి!

"ఇంటికి, యిల్లాలు దీపం" అన్నారు అనుకున్నాడు కృష్ణ. అంతలో రాజ్యలక్ష్మి టిఫిను, కప్పుతో కాఫీ పట్టుకొని వెలిగించిన దీపంలా నవ్వుతూ వచ్చింది. "థాంక్యూ" అని అందుకోబోయాడు.

"నో మెన్షన్ సార్." టిఫిన్ ప్లేటు వెనక్కి తీసుకుంది. "మొదట ఆ దిక్కుమాలిన దుమ్ముగుడ్డలు తీసి అవతల పారేయండి."

కృష్ణ మాట్లాడకుండా అవతలికి వెళ్ళి బట్టలు మార్చుకుని, మొహం కడుక్కొని వచ్చాడు.

"చిత్తం" అన్నాడు. అతగాడికి తెలుసు భార్యతో 'టిఫినూ కాఫీకి కూడా మడికట్టుకోవాలా ఏం!' అని వాదిస్తే ప్రయోజనం వుండదని.

"చూసుకుని మరీ తాగండి. వేడి ఎక్కువగా వుంటే అనక నన్ను అనొద్దు."

కృష్ణ కాఫీ తాగుతూ వుంటే రాజ్యలక్ష్మి అల్చిప్పలంతేసి కళ్ళు చేసుకుని వింతగా గమనిస్తోంది.

కిటికీ తెరలను దూసుకుని గాలి వీచి అతని ముంగురులు ఫాలభాగంమీద ఆడుకుంటున్నాయి. అవి గీస్తున్న కార్టూన్ బొమ్మలను చూడడానికా అన్నట్లు ఆ పిల్ల అదే దీక్షగా చూస్తోంది.

పొలక మారింది కృష్ణకి. మరే మౌతుంది? చూపులు సుదతిమీద; ధ్యాస ఎక్కడో ఊహాలోకంలో.

"అదు వచ్చిందీ పొడిదగ్గుకూడా. ఏ హోటల్లోనో వెధవ చమురుసరుకు ఏదో తినివుంటారు ." కప్పునందుకుని తన చేత్తో అతని రొమ్ము రుద్దింది.

"లేదు రాజ్యం...నువ్వొద్దన్నావుగా!" ఎట్టకేలకు దగ్గు సర్దుకున్నాక అన్నాడు. కృష్ణకి నిజంగా భయం. మధ్యాహ్నం రామారావు బలవంతం చేశాడు. బజ్జీలు తినిపించాడు. కానీ రాజ్యం వచ్చింతర్వాత హోటల్లో తినకూడదనే ఆంక్ష విధించింది గనుక కృష్ణ ఆ వూసెత్తడు. అసలు రాజ్యం వద్దు అన్న పని చేయడం కృష్ణకి చాతకాదు. ఆ మాటే రామారావుతో అంటే ఫక్కున నవ్వేశాడు వాడు. "ఓరి నీ.... మూడేళ్ల అద్దమైన

చిరుతిళ్ళమీద బ్రతికి యివాళ అవునెయ్యి మరుగునీళ్ళు త్రాగాలంటావేమిటిరా ?" అన్నాడు.

వస్తూనే నడుమునున్న పటకా ఐనా వూడదీసుకోకుండా మంచంమీద కూలబడే కృష్ణ బుద్ధిగా మొహమూ, కాళ్ళూ కడుక్కొని వచ్చి పీటమీద కూచుని టిఫిను తింటున్నాడు.

"చూడు రాజ్యం ! నువ్వు నన్ను పూర్తిగా మార్చేశావ్ " వెళ్ళిపోతూ వుంటే కొంగుపట్టుకు లాగి నడుంచుట్టూ చెయ్యివేసి, ఒడుపుగా దగ్గిరికి లాక్కొని, తాను ఉక్కిరిబిక్కిరై ఆ పిల్లని ఉక్కిరి బిక్కిరి చేసి మరీ ఒప్పుకున్నాడు కృష్ణ.

"అదుగో అదే వద్దు అవతల మీ సినిమాకి వేళైపోతోంది." చిలిపి చేష్టలు చేస్తే "హన్నా" అని చంటి పిల్లాణ్ణి వారించినట్లు చూసి, విడిపించుకుని మెరుపుతీగెలా దూసుకుపోయింది

"ఎంత అదృష్టం" అనుకున్నాడు తనని తాను అభిమానించుకున్న కృష్ణ. కాని "యీ డిసిప్లిన్ గొప్ప యిదిగా వుంది" అని గొణుక్కున్నాడు.

"చూడు రాజూ ! యీ యాష్కలర్ షర్ట్ వేసుకోనా?" తన బట్టలన్నీ అమర్చి వున్న చిలక్కొయ్య దగ్గిరికెళ్ళి కేక వేశాడు.

"అయ్యో! " ఇంత అమాయకత్వ మేమిటి బాబూ అన్నట్లుందా కంఠధ్వని.

"కర్మ! అవతల ముసురుపట్టినట్లుంది. ఎందుకొచ్చిన యుష్రంగు .. నీలం వుండిగా ముదురరంగు వేసుకోండి, నా కిష్టం." రాజ్యం మాటే కృష్ణ బాట. వేరే యిష్టం లేదు కృష్ణకి— అసలు యింతకుముందు ముదురు నీలం అంటే వొళ్లు మండించుకునేవాడు. వెంటనే అదే తొడుక్కున్నాడు.

నీటుగా, నీలంరంగు ఎర్రంచు చీర కట్టుకుని, ఎర్రపూలజాకెట్ తొడుక్కుని, గంభీర సంధ్యాసుందరిలా వచ్చిన రాజ్యలక్ష్మికేసి తిరిగి, 'ఓ కే' అన్నాడు వేషం పూర్తిచేసుకుని కృష్ణ.

రాజ్యలక్ష్మి దగ్గరిగా వచ్చి.. "ఆ స్లాకు వేసుకోలేకపోయారా ? .. నేనే వుతికి యిస్త్రీ చేశా యీ చొక్కాకి ధోబీ గంజి ఎక్కువ పెట్టేశాడు. కంపు వేయడంలేదూ ?" కాలరు సర్దుతూ అడిగింది.

ఏమో ? కృష్ణ కేం తెలుసు.... ఎప్పుడూ, గంజిబట్టలే . ఎప్పుడూ హోటలు తిండే. ఎప్పుడూ యాష్కలర్ ప్యాంటూ, గుర్రంబుర్ర మార్కు టై ఎప్పుడూ ఒకేమార్కు హేరాయిలు ! మంచిదని ఎడ్వరుటయిజుమెంటులో తనకు నచ్చిన తార చెప్పిన సబ్బు అంతే .

"సరే ! ఏమో మరి... యిప్పుడిప్పుకో మంటావా మరి ? టై కూడా బిగించేసు కున్నా." తప్పుచేసిన బడిపిల్లాడిలా నుంచున్నాడు.

"పోన్లెండి" సానుభూతిగా నవ్వేసింది. ఇవాళ్టికి క్షమించాం. ఆ తుంబురుడి మార్కు హై అవతల పారేసి రండి వాలు."

వెంటనే హై యిప్పేశాడు. అసలొక పిక్నిక్‌లో సహాధ్యాయిని, కాలేజీ బ్యూటీ అనిపించుకున్న కాత్యాయిని బాగుందన్నప్పట్నుంచీ తను యీ గుర్రంబొమ్మ వున్న ఎర్ర హై వాడుతున్నాడు. కాని రాజ్యం మాటకి తిరుగులేదు. అసలివాళే కాదు— పెళ్ళిచూపులకు ముందే తొలిసారి రాజ్యలక్ష్మిని తాను చూసినప్పుడే, ఆ పిల్ల కృష్ణ మనసుకు పూర్తిగా వశమైపోయింది. తమాషా ఏమిటీ అంటే పెళ్ళిచూపులకు తను "గుర్రం హై, మాష్‌కలర్ ప్యాంటూ, వైట్ షర్టూ" వేసుకుని వెళ్లాడు. అప్పుడు నల్లరంగు 'షూ' వుండేది కూడా. దరిమిలాన రాజ్యలక్ష్మి ఎర్రరంగు జోళ్లు కొనిపించింది.

"'పగటి నక్షత్రాలు' సినిమాకేగా మన ప్రయాణం?"

అందులో తన కాలేజీరోజులనాటి అభిమాన తార 'ఆరాధన' వుంది. అందుకే అడిగాడు ఆశగా.

"ఛీ! పోనిద్దురూ! .. 'కొత్త గడియలు' చూద్దాం" అనేసింది రాజ్యలక్ష్మి.

కృష్ణకి రాజ్యలక్ష్మిని కాదనగల శక్తిలేదు. రాజ్యలక్ష్మికి, కృష్ణ యిష్టానిష్టాలు తనకు తెలుసుననే గర్వముంది. చాలాసార్లు "అమ్మకు వున్న గుణాలు కొన్ని నీకు వున్నాయి," అనేవాడు కృష్ణ. రాజ్యలక్ష్మి భర్తచేసిన ఆ అభినందనకి మురిసిపోయేదేం కాదు గాని— "నాకు తెల్సు మీరు అమాయకులని అవిడా గ్రహించివుంటారు.. " అనేది ఆ పిల్ల! బంగాళాదుంపలను వుడికించి, వేపడంగాచేసి 'మీకు యిష్టమని చేశాను' అనేది. మూణ్ణెల్ల కాపురంలో ఆ పిల్లకు అదెలాతెలుసో కృష్ణ అడగలేదు. అమ్మకూడా యిలాగే అనేది. తనకు వెల్లుల్లిపాయలు యిష్టంలేదు. హాస్టలులో, హోటలులో, మరెక్కడా తినడు కాని అమ్మ మాత్రం, "నాకు తెలుసు నీకు యిష్టమే చిన్నప్పుడు మీ నాన్నగారు తినరని ఆయనకు వేరే చేసి, నీకు ఈ వెల్లుల్లిపాయలు దండిగా పోసి చేసేదాన్ని" అనేది. తినేవాడు కృష్ణ. ఇప్పుడు రాజ్యలక్ష్మి అంతే!

"ఇంచక్కా రాయ్‌గార్డెన్స్‌లో ఏర్ కండిషన్డు రూంలో భోంచేసిపోదాం," అన్నాడు సినిమా అవగానే.

సినిమా ఏం బాగోలేదు. తన స్నేహితుడెవరైనా తీసుకువెళ్తే, వెనకటి రోజుల్లో తలనొప్పి మాత్రలు కొని యిమ్మని అల్లరిచేసేవాడు కాని రాజ్యం! రాజ్యంతో అంత మాట అనడమే!! భేషుగ్గా వుంది అనకపోయినా, ఆ పిల్ల చెప్పినదానికి "వూఁ" కొడితే చాలు.



ఈ పిల్ల కోడలుగావడం నీకిష్టంలేకపోతే
ఆ సంగతి ముప్పు ముందే చెప్పుండాల్సిందమ్మా!!

భర్త సరదా గుర్తించని పిల్లకాదు రాజ్యలక్ష్మి. ఎయిర్‌కండిషన్డ్ గదిలో భోజనం చేయలేని అనాగరికురాలు అంత కన్నా కాదు. కాని యింటి దగ్గిర ఆయనకి యిష్టమని కష్టపడి పుస్తకాల్లోని ఆడశీర్షికలు వెతికి వెతికి 'పారోశీ' తయారుచేసింది. అందుకనే "వుహూఁ" అంది.

ఏడుపు మొహం పెట్టాడు పాతకేళ్ళ కృష్ణ. పద్దెనిమిదేళ్ళ రాజ్యలక్ష్మి చంటి పిల్లాడి గెడ్డంలా, అతని గెడ్డం పుచ్చుకుని, "ఛా కోపమా.. రేపెల్దాంగా . పరేనా" అంది. కరిగిపోయాడు. "నీ యిష్టం," అన్నాడు.

"కాదు పారోశీ మీకే యిష్టం" అన్నది రాజ్యలక్ష్మి.

రిక్షాలోనుంచి రాయ్‌గార్డెన్స్ రంగు దీపాలు ఆశగా చూసి, పోనీలే అనుకున్నాడు కృష్ణ రాజ్యాన్ని దగ్గరగా తీసుకుని తన్మయత్వం చెందుతూ.

## 2

మర్నాడు యింటికి వచ్చేసరికి రాజ్యలక్ష్మి యింటిముందు కాంపౌండులో చిన్న చిన్న మొక్కలు నాటుతున్నది అరగంటకు ముందుగా ఎలాగో బయట పడి, దోవలో పూలబజారు వెళ్ళి కావలసినవన్ని పూలు కొనుక్కొచ్చాడు కూడాను. రాజ్యలక్ష్మి నుదుట చెమట పోసింది. ముంగురులు ఫాలభాగాన కరుచుకుపోయాయి. కుంకుమ ముక్కు మీదికి కారిపోయింది. గుమ్మడిగింజ లాంటి ఆ ముక్కుకొనని మట్టి పులుము కుంది. ఎండలో వాడిన తమలపాకులా వుంది ఆ పిల్ల.

గొప్ప కష్టమనిపించింది కృష్ణకు. "ఛః ఎండలో, మన్నులో యేఁవిటా సరదా?

పూలమొక్కలు వేసి, అవి పూసి, అనక నే కోసి యివన్నీ చాలా రోజులు . . పడుతుంది. అందుకేగా చూడు .. ”

వులిక్కిపడి వెనుదిరిగి చూసింది రాజ్యలక్ష్మి. పూలపొట్లం అందించాడు కృష్ణ. రాజ్యలక్ష్మి మొహంలో ఎరుపు తగ్గిపోయింది.

''మారాజులు మీకేం? . . పూలు బజార్లో కొంటారు. భోజనం హోటల్లో చేస్తారు. కాని నాకు పూలమొక్కలు అంటే సరదా . ” ఆ ప్రక్కనే వున్న నీళ్ళకుండీలోనించి నీళ్లు తీసి మొక్కని పసిపిల్లాడిలా సున్నితంగా పట్టుకుని తడిపింది లక్ష్మి.

''సారీ! అదికాదు నా ఉద్దేశం .... నువ్వు ” అక్కడే చతికిలబడ్డాడు, పూలమొక్కలంటే బొత్తిగా యిష్టంలేని కృష్ణ.

“మూణ్ణెల్లు టైమివ్వండి. మీ బజారు పూలకి చక్రవడ్డీతో సహా బదలాయించేస్తాను'' విరిసిన పూలమొక్కలా నవ్వేసింది రాజ్యలక్ష్మి.

“నే ననుకోలేదు . పూలమొక్కలంటే నీ కింత యిష్టమని ..రేపు నర్సరీ పార్కు కెళ్ళి మొక్కలు కొనుక్కుందామా!”

“ముందిక్కణ్ణించి లేద్దాం.” భర్త మాటకి పూర్తి ఆమోదాన్ని చూపించి లేచింది రాజ్యలక్ష్మి.

“ఇవాళ నీదే వొంతు .... ముందా 'మన్ను' చేతులు కడుక్కొని అనక టిఫిను తే” ఆ మట్టిచేతులే వోసారి పుచ్చుకుని మొహం దాచుకోబోయి, ఆ పిల్ల కళ్ళెర్రజేసి వారించగా మానేశాడు.

“గొప్పే” అంటూ లోపలికి తుర్రు మంది రాజ్యలక్ష్మి.

* * *

“బాబోయ్? యిదేంటిది? స్వీటు! నాకొద్దు” నిజంగానే ఆ స్వీటు యిష్టం లేదు కృష్ణకి. కోపం వచ్చేసింది రాజ్యలక్ష్మికి

జిలేబీలు చేయించడానికి ఉదయం నుంచీ వెళ్ళి పక్కింట్లో నున్న తులసక్కయ్యగార్ని ప్రాధేయపడి తీసుకువచ్చి, ఆవిడ సాయంతో చేసినందుకు మారుగా భర్త సయించవంటే మరేమొస్తుంది? ఆ పిల్ల ముక్కు, దాని మీదున్న గుమ్మడిగింజా యివే ముందు కందిపోతాయి!

“అదిల్లా యివ్వండి .. అవతల పారేస్తా”

ఇంకా ఎక్కడుంది యివ్వడానికి. అప్పటికప్పుడే గొంతులో కుక్కేసుకుని నీళ్లు తాగేస్తున్నాడు కృష్ణ. దోకు వచ్చేస్తోంది కూడా. కాని రుచి అనుభవిస్తున్నట్లు నటిస్తున్నాడు.

కోపం మాయమైపోయింది రాజ్యలక్ష్మికి. భర్త దగ్గరగా వెళ్ళి, రొమ్ముకద్దీ, అతని తలను గుండెల్లో దాచుకుని, “మరి తినక్కర్లేదులే.... నాకేం

తెలుసమ్మా! మీకు జిలేబీలు యిష్టం లేదనీ" అన్నది రెండో చేత్తో ప్లేటు ఎడంగా నెట్టేసి అతని తలమీద ముద్దు పెట్టుకుంది.

వూపిరి పీల్చుకుని 'అలవాటై పోతాయిలే రెండుసార్లు తింటే' అన్నాడు కృష్ణ మరింత దగ్గిరగా తన తల గుండెల మధ్య సర్దుకుంటూ.

"ఉహూఁ! పకోడీలు తినండి చాలు" జిలేబీలు అవతలికి తీసేసుకుంది.

పకోడీలు 'మాంఛి' బాగున్నాయి. కృష్ణకి యిష్టం కూడాను. అందుకనే మరో ధ్యాసేలేదు.

"పోనీ! మరేఁ! ఏ వ ం డీ ..." తన్మయత్వంగా టిఫిను తింటున్న కృష్ణ రాజ్యలక్ష్మి యేదో అడగటానికి సంకోచ పడుతోందనుకున్నాడు. "ఊఁ! ఊఁ! దేవిగారు చెప్పండి. పకోడీలు ఫస్టాస్లు అనుకో" అన్నాడు.

"ఇవాళే పనిలో పని పూలపార్కుకి పోయి ఓ డజను మొక్కలు కొనేసు కుంటే " నేలని బొటనవేలు రాసింది.

పూలచెట్లంటే అంత మమకారం లేదుగా కృష్ణకి. మింగడం అమిత కష్టమై నట్లు ఓ పకోడీ ముక్క మింగి— "వెళ్దామంటావా?" అన్నాడు.

"ఉహూఁ! . మీ యిష్టం. నిన్న మీరే అన్నారుగా " వంటగదిలోకి వెళ్ళిపోయింది రాజ్యలక్ష్మి.

వేరే యిష్టమెక్కడ? కృష్ణకి.

"నేను రెడీసార్"— కేకవేశాడు.

"ఇదో వచ్చా —" రాజ్యలక్ష్మి హుషారుగా నడిచింది-దాంతో పాంజు వలు, మట్టెలూ ఆ పిల్ల ఎదపులకింతనూ, ఆనందాన్నీ ప్రకటించాయి!

కృష్ణ కేం తెల్సు? ఏ మొక్కల్ని ఎలా పెంచాలో .. అన్నీ రాజ్యలక్ష్మి వోపిగ్గా నర్సరీపార్కు 'మాలిని' కనుక్కుంటూవుంటే, ప్రక్కనే రోడ్డు మీద వెళ్తూ, వస్తూవున్నవాళ్ళను చూస్తూ నుంచున్నాడు.

"మరేమో . మీకు యీ పూల మొక్కలూ అవీ అంత నచ్చవుకదూ?" తిరుగుదలలో అడిగింది రాజ్యలక్ష్మి.

"ఇంకా నయం! ఎంతో యిన్‌సల్ట్! రాజ్యలక్ష్మి ప్రియుణ్ణి కదా? నాకు పూలంటే యిష్టంలేదా చెప్పు! నువ్వు 'వూఁ' అంటే చాలు— ఆ మొక్కల్ని అమాంతం తినేస్తాను" ఇద్దరూ కిలకిలా నవ్వుకున్నారు.

"సరేకానీ, నేనో స్వెటర్ దేవి గారి శెలవైతే ." ఫ్యాన్సీషాపుముందు ఆగాడు.

"బాగానేవుంది వరస . అంతా నా అజ్ఞేనా? నిండుగర్వంతో, బుగ్గలు కెంపెక్కచూసి కనులు వాల్చుకుంది.

మెల్లెక్కుతున్న భర్తను ఎడంచేత్తో సున్నితంగా తాకి "అదికాదండీ మా వారికి స్వెటర్ నేనే అల్లియిస్తానుట

పూలు రెండు పొన్లు తీసుకుందాము " చెప్పింది రహస్యంగా.

ఏమంటాడు? మనసులో 'చిత్తం' అనుకున్నాడు.

* * *

"పరిపోయింది . ఏం పిల్లాడమ్మా! స్వెటర్ తొడుక్కోడమేనా రాదూ . " చేతులు పులిసిపోయేలా ఏకాగ్రంగా కూచుని, స్వయంగా తను అల్లిన స్వెటర్‌ను తిరగేసి తొడుక్కున్న భర్తను చూసి పుత్తిత్తి కోపం ప్రదర్శించి, మురిసిపోయింది రాజ్యలక్ష్మి.

'మరెలాగ'? అన్నాడు పసిపిల్లాడి మొహంపెట్టి భర్త! మాతృవాత్సల్యం పొంగార స్వెటర్ సరిగ్గా తొడిగింది రాజ్యలక్ష్మి. "ఏదీ చూద్దాం కాస్త దూరంగా వెళ్ళి నుంచోండి" అంది కుతూహలంతో.

"అయ్యో! కాస్త పొట్టి అయిందల్లే వుందే.మరి రెండవున్నులంటే పోయేదా? ఎన్నిసార్లు చెప్పానో. పూలు మాటే జ్ఞాపకంలేదు మీకు పూలగోల తప్ప "

ఓసారి మురిసిపోయింది. ఓసారి అక్కడ పొట్టి అని, యిక్కడ మెలిక పడిందనీ నొచ్చుకుంది. అటు తిరగమని, యిటు తిరగమని కృష్ణను ఆటబొమ్మను తిప్పినట్లు తిప్పి చూసుకుంది.

గర్వపడ్డది. "ఇంచక్కా రాజులాగా పిన్నారు" అన్నది.

'అవును మరి. నా రాజ్యలక్ష్మి ధర్మమా అని రాజునేగా మరి—" దగ్గరికి లాక్కున్నాడు.

"అబ్బో! బడాయి' అతని గుండెల్లో తలదాచుకుంది.

కృష్ణని రాజ్యలక్ష్మి పూర్తిగా మార్చేసింది. పోయినేడాది 'ఉగాది'కి కృష్ణ యింటిదగ్గరే లేడు. హోటల్లో పొద్దున్నే ఒక 'ఇడ్లీ సాంబారు' దుఃఖపడుతూ తింటున్నాడు. అప్పుడు రాజ్యలక్ష్మి వేపపూవు పచ్చడి స్వయంగా చేయలేదు. వాళ్ళక్కయ్యచేసి వాళ్ళ బావతోపాటు యిస్తే పుచ్చుకుంది "మళ్ళీ ఏడాదికి మీ అయనగారికి నువ్వు యిద్దువుగానిలే" అన్నాడు బావ— వాళ్ళ అక్కయ్య చేతిలో వుండగానే, ఉగాది పచ్చడి నాకేస్తూ.

"సిగ్గు లేకపోతే సరి" అనుకున్నది లక్ష్మి.అక్కణ్నుంచి అవతలికిపోయింది.

కాని యివాళ సరిగ్గా ఆ సిగ్గులేని ఘనకార్యాన్నే కృష్ణ చేస్తే ఎంత ఆనందంతో పలకించిపోయిందని!

"పాపం పసిపిల్లాడు కదూ!" అంది కొంటెగా.

"ఔను" అన్నాడు గర్వంగా.

"అ యి ం ది లె ం డి అయ్యగారి రాజ్యం. . యింకేన్నాళ్ళు" అతనిజుట్టు రేపేసి అవతలికి పారిపోయింది సిగ్గుతో త్రొటుపడుతూ.

"ఏమిటీ?" సంభ్రమాశ్చర్యాలతో చతికిలబడిపోయి రెండు క్షణాలయ్యేక



రాజ్యలక్ష్మి అన్న మాటలకు అర్థ పరిశోధన మొదలెట్టేడు కృష్ణ.

"మీకు కజ్జికాయలిష్టమా? పెరుగుగారెలిష్టమా?" చేకవ్వం, పెరుగుగిన్నె పుచ్చుకుని వచ్చింది రాజ్యలక్ష్మి.

"నువ్వంటేనే యిష్టం."

"అయితే సరే!" వెళ్ళిపోబోయింది. లేచి దగ్గరగా పొదవుకొని "నా ఆట కడుతుందన్నావే? పుట్టింటిమీదికి మనసు పోయిందా?" భయంగా అడిగాడు.

"కాదులెండి" విడిపించు షని పెరుగ్గిన్నె అక్కడపెట్టి ముందుకు డిన జడ వెనక్కి వేసుకుని గోడనున్న కేలండరుకేసి చూపించి, తుర్రున పెరుగ్గిన్నె తీసుకుని పారిపోయింది

కేలండర్‌లో యశోద 'కృష్ణుణ్ణి' ఎగరేసి అందుకొని మురిసిపోతోంది.

"హుర్రే!" మని అరిచాడు. చెంగున గెంతేడు కృష్ణ "మై గుడ్నెస్! మై . మై..." అద్దంలో చూసుకుని మళ్ళీ 'ఏయ్ రాజూ' అంటూ పెరట్లోకి పరిగెత్తాడు.

"ఏవిఁటండీ రాజుగారు అల్లుతున్నారు? స్వెట్టరా?"

"మీ పూసు కాదులెండి" వాళ్ళో దాచేసుకుంది.

"సర్లే! మన శత్రువుకొంబోలు" నన్నాడు కుర్చీలో కూలబడి గబగబా వెళ్ళింది రాజ్యలక్ష్మి. టిఫినూ, కాఫీ తెచ్చి అక్కడ పెట్టి, "యిదో, ఒక్క క్షణం... యీ నాలుగు గళ్లూ "అని మళ్ళీ అల్లుకోసాగింది.

కృష్ణ డీలాపడిపోయాడు. చేతులూ కాళ్లూ కడుక్కోమని చెప్పలేదే లక్ష్మి? కోపంగా టిఫిను తినేశాడు. అలాగే పాంట్ బెల్టు కూడా తీసుకోకుండా పడక కుర్చీలో కూలబడ్డాడు.

* * *

మర్నాడూ అంతే . స్వెట్టరు అల్లు తోంది రాజ్యలక్ష్మి. తనకి కాదు కృష్ణకి అసలే కాదు. చిన్న బుల్లి స్వెట్టర్! దాన్ని గుండెల కదుముకుని నూనిరాగాలు తీసింది.

అలా మూణ్ణెల్లు తిరిగాయి.

కృష్ణ గుండెల్లో రాయిపడింది.

"అమ్మ . బాబోయ్, నువ్వెళ్ళకు రాజ్యం," అన్నాడు.

"సరే!" నంది ఏమనాలో తెలియని రాజ్యలక్ష్మి.

కాని, రాజ్యలక్ష్మి వాళ్ళమ్మ నాన్రో జుల్లో వచ్చింది. కృష్ణ తండ్రి కూడా వచ్చాడు. ఇంకా 'పెద్ద దిక్కులు' దిగబడ్డారు.

తప్పదన్నారు. ఐదో నెలనే పుట్టింటికి రాజ్యలక్ష్మిని ప్రయాణం కట్టించారు.

కృష్ణ రాజ్యలక్ష్మి గుండెల్లో తల దూర్చి ఏడిచాడు.

"ఛ! మన 'బాబు' కోసమేగా మళ్ళీ ఎన్నాళ్ళు యిట్టే రానూ " వోదార్చింది రాజ్యలక్ష్మి.

పద్ధెనిమిదేళ్ళ రాజ్యలక్ష్మి అప్పుడే ఎంత పెద్దదై పోయింది!

"మరి, మీకు మా 'నాన్నగారు' కావాలా? మీ అమ్మగారా?" నవ్వుతూ సిగ్గుపడుతూ అడిగింది ఆడపిల్లా, మగపిల్లాడా? అవి ఆ పిల్ల ఆరాటం.

"నాకు నువ్వే కావాలి"

"బాగుంది అయ్యగారి కోరిక నాకూ మీరే కావాలి," అన్నది. రాజ్యలక్ష్మికి కృష్ణ అంటే చాలా ప్రేమ.

## 3

టెలిగ్రాం వచ్చింది కృష్ణకి.

మాసిన గెడ్డం తడుముకుంటూ అకౌంట్స్ కూడుకుంటున్నవాడు, వులిక్కిపడి, టెలిగ్రాం అందుకుని,

"లక్ష్మి కులాసాయేనా?" అన్నాడు ఆత్రుతగా.

వేదాంతిలా నవ్వి, "ఏమో సార్! ఇది టెలిగ్రాం," అన్నాడు పోస్ట్‌మాన్ చెవినున్న పెన్సిలు సంతకానికందిస్తూ.

పరిగెత్తాడు కృష్ణ....తనకి కొడుకు!

"ఒరేయ్ రామం .... ఏమండోయ్ రావూజీ....అరె .... శ్యామలగారా....?" అందరికీ చెప్పేశాడు.

టెన్సింగ్ నార్కేవా? తను! కాదు. గగారినా? క్రికెట్ సెంచరీయా? డబుల్ ప్రమోషనా ? కాదు కాదు .... రివ్వున వెళ్ళాడు.

రైలెక్కిపోయాడు.

వెధవ రైలు....ఎక్స్‌ప్రెస్సుని తిడుతున్నాడు.... "గూడ్సుబండీ....ఎద్దుల బండీ నయం" అని.

రైల్లోనే అందరి మధ్యా పచార్లు చేయబుద్ధైంది.

"ఎలా వుంటాడో తన కొడుకు' అచ్చం దాని ముక్కులాగే వుంటే బావుంటుంది....అమ్మో లక్ష్మిముక్కు! అది ముక్కు కాదు," అనుకున్నాడు. మరో అలంకారంకోసం వెదుకుతున్నాడు. జేబులు తడుముకుని "లక్ష్మి ముక్కుకి సాటిలేదు" అన్నాడు. ఇంకా నయం ఎవరూ వినలేదు అని తనలోనే సిగ్గుపడి పేపరు చదవాలని తీశాడు. చదవడం రాలేదు....

రిక్షా ఎక్కాడు గానీ, నాలుగడుగులు పరిగెత్తిపోదునా? అనిపించింది.

"రా! రా! వెయ్యేళ్ళు ఆయుష్షు...."

అత్తగారు అడ్డంగా వచ్చింది - అడ్డంగా వచ్చిందని అనుకున్నాడు కృష్ణ. ఆవిడ అల్లుణ్ణి ఎదురొచ్చి పలకరించింది అంతే!

నీరసంగా వుంది రాజ్యలక్ష్మి మొహం. కాని ఆ కళ్ళల్లో ఎన్ని కాంతులున్నాయని!....ఏమిటో ఆ విబ్బరం....ప్రక్కనే ఎర్రని పసిగుడ్డు.

పిడికిళ్ళు మహా రహస్యాన్ని గుప్తపరుస్తున్నట్లు ముడుచుకుని, రెండుచేతులూ దమ్మిడీ అంత నోటిదగ్గర పెట్టుకుని 'చిరంజీవి' నిద్రపోతున్నాడు. ఆ పసిపాప కెక్కడ నొచ్చుకుంటుందో తన తాకిడి అన్నట్లు అతి సున్నితంగా పొదువుకుని బహుజాగర్తగా మడిచిన పొట్లంలాగ పడుకునుంది రాజ్యలక్ష్మి.

"అమ్మో! బాబు...." అన్నది లక్ష్మి, మోకాళ్ళమీద కూచుని తన దగ్గిరగా భర్త వొంగబోయేసరికి, 'బాబును చూశారా?' అన్నది తన భయానికి తనే సిగ్గుపడి.

"చూశాను .... అంతానువ్వే" అన్నాడు మళ్ళీ లక్ష్మిని తదేకంగా చూస్తూ....

"మా మాంవగారి పోలికే. ఆ కళ్ళు చూడండి" అనిపాపాయిని ఆప్యాయంగా గర్వంగా, నిండుగా చూసుకుంది రాజ్యలక్ష్మి.

"అబ్బ! ఎంత బాధ పెట్టేసును కున్నారు? 'వద్దు బాబూ' అనిపించాడు. పెంకినాన్న....చూడండి దొంగ మళ్లీ ఏమీ ఎరగనట్లు ఎలా నిద్దరోతున్నాడో?" పసివాడి తల నిమిరింది.

"డాక్టరు వచ్చాడా ఇవాళ?"

"బావుంది .... అమాయకత్వం...." ఎట్టకేలకు కృష్ణ జుట్టు నిమిరింది లక్ష్మి. డాక్టరూ, మంత్రసానీ ఎవ్వరూ యిక అక్కర్లేదంది. భార్య స్పర్శతో కృష్ణ ప్రాణాలు లేచివచ్చాయి. ఎంతో ఆనందమయింది. ఆర్నెల్లు ఈ స్పర్శ కోసమే రాత్రింబగళ్ళు మరో ధ్యాస లేకుండా 'తపస్సే' చేశాడు. కలలే కన్నాడు.

"రాజూ" అన్నాడు-కళ్ళనిండా నీళ్లు నింపుకుని.

"ఛ! బాబుని చూడండి...."అన్నది తృప్తిగా.

"చిక్కిపోయావు" అన్నాడు.

"తప్పు" అంది ముక్కున వేలేసుకుని - ''నాకేం బాగానే వున్నాను" అంది.

## 4

మూణ్ణెల్లదాకా పుట్టింట వుండి - బాబుని తీసుకుని వచ్చేసింది రాజ్యలక్ష్మి- అప్పటికే "యింకా ఎప్పుడొస్తావు" అంటూ కృష్ణ నానా యాగి చేసేశాడు - నెలకి రెండేసిసార్లు మెడికల్ లీవు పెట్టేసి వచ్చి!

కాని వారంరోజులలో ఆ యిల్లు తినదేనా అన్నట్లుంది!!

గుమ్మంలో అగుపిస్తుందనుకున్న రాజ్యలక్ష్మి కనిపించకపోయేసరికి కృష్ణ మనసు చివుక్కుమంది. ''బాబుని చూసుకోవద్దా మరి" అనుకుని సర్దుకున్నాడు. మెట్లెక్కి తలుపులు తోసుకుని లోపలికి వచ్చాడు. తలుపు 'దబీ' మంది.

"ఇష్" వులిక్కిపడి వెంటనే వారించింది రాజ్యలక్ష్మి — "బాబుకి ఇప్పుడే చిన్న కునుకు పట్టింది" - అంటూ.

"సారీ!"

తాపీగా కూలబడ్డాడు. "మొదట్లో నువ్వు నాకు ఎక్కువ ముద్దుచేశావు. యిప్పుడు నన్ను మరిచిపోయావు" అందామా అనుకున్నాడు. కాని తన 'బాబు' నిద్ర పాడవుతుందనేగా తలుపు చప్పుడు చెయ్యొద్దన్నది! అని సర్దుకోబోయాడు. కాని వుదయమూ అంతే! బూట్లు టకటకలాడించుతూ వెళ్ళకండి. బాబు వులిక్కిపడతాడంది. ప్రతిదానికీ 'బాబు' అంటూ తనను నిర్లక్ష్యం చేస్తున్నది.

ఉదయం ఆఫీసుకెళ్తూ బాబుని ముద్దెట్టుకుంటే "ఆ గుడ్డలు




తొడుక్కున్నాకా ఎందుకేం ఆ ముద్దు" అని నిలదీసింది.

ఇప్పుడు కృష్ణని రాజ్యలక్ష్మి దండించడం మానేసింది సాధింపు మొదలెట్టింది. అలా అనుకున్నాడు కృష్ణ. "మీరు కాళ్లు కడుక్కోనిదే టిఫిన్ లేదు" అనదు యిప్పుడు – "అన్నీ అక్కడున్నాయి తీసుకోరూ బాబు లేస్తున్నాడు చూసుకోవాలి" అంటుంది.

"రాజా" అని కేకేస్తే "మెల్లగా పిలవండి దొంగ లేచాడంటే యింక వదల్డు," అంటుంది

ఆఫీసునుంచి రాగానే, యిదివర్లో తనగురించే మాట్లాడే లక్ష్మి యిప్పుడు బాబు ఆ పుదయం ఎన్నిసార్లు నవ్వేడో, కేకలు పెట్టాడో చెబుతుంది.

"మా బాబు! మా బంగారు తండ్రి ముద్దబూర్లు చేస్తున్నాడండీ" అంటుంది.

"చూడండీ! యీ టోపీ అల్లాన వాడికి", అని చూపెడుతుంది.

ఒకనాడు అరగంటముందే యింటికొచ్చిన కృష్ణ, యింట పూసిన పువ్వొకటి కోసి స్వయంగా పెడదామని తెచ్చాడు రాజ్యానికి. "పెట్టనా" అన్నాడు.

"అక్కడుంచండి అనక పెట్టుకుంటాను ... ఆఁ . అయినా వొద్దు లెద్దురూ... బాబుకి జలుబుచేస్తుందిట...' అన్నది ఒక్క అడుగు వెనక్కి వేసి

కృష్ణకి చిర్రెత్తింది. అది చూసి జాలిపడ్డది రాజ్యం. "పోనీ పెట్టండి" అని వెనక్కి తిరిగింది. బాబును చూసుకున్నదే తప్ప కృష్ణ స్వయంగా పువ్వుపెడుతున్నప్పుడైనా ఆ ధ్యాస లేదు. వెనుకటి ఆ ..గ్గుదొంతర్లే లేవు ఆ పిల్లలో!

ఆఫీసునించి వస్తూనే "రాజ్యం!

నేను హోటల్‌లో పెరుగ్గారెలు తినేశా" నన్నాడు కృష్ణ.

"సరే ఏంచేయను?... బాబు ఎందుకనో యివాళ నజ్జుగా వున్నాడు. నాకు మనసు మనస్సులో లేక టిఫిను చెయ్యనేలేక పోయా"నంది।

అదివరకు యిలాంటి సంఘటన - కృష్ణకి చెప్పగల ధైర్యమే వుండేదికాదు. చెప్పినా, రాజ్యం సతాయించి గుంజీళ్ళు తీయించినంత పనిచేసేది.

సినిమాలు అడగదు. పువ్వులు అడగదు. "ఎందుకండీ ఆ గుర్రంబుర్ర మార్కు షైకట్టుకున్నారు" అని అడగనేలేదు.

మూడ్రోజులు వరుసగా తెల్ల ప్యాంటూ, తెల్ల చొక్కా, గుర్రం తలకాయ మార్కు వున్న షై వేసుకుని ఆఫీసుకెళ్లాడు. వుహుఁ రాజ్యలక్ష్మి అడగనేలేదు. "ఏమండీ। తెచ్చారా। పూసల గిలకలు" అనో లేదా "అయ్యో బాబుకి ఫలానా సబ్బు తెమ్మన్నాను గదా? తేలేదా?" అనో అడుగుతుంది

"రాజ్యం . బాబుకి యిన్ని చొక్కాలెందుకు ? వాడెలాగా రోజురోజుకీ ఎదుగుతాడు కదా నీకు ఆ ఆకుపచ్చని సిల్కుగుడ్డ జాకెట్ కుట్టించుకోరాదూ?" అన్నాడు ఓసారి.

"వుహుఁ బాబు ఎదుగుతాడు గనుక మన పొదుపుకి తక్కువ అయిందేం ? ఏకంగా వాడు బళ్ళోకి వెళ్ళినప్పుడు కుట్టించండి"— ఆ గుడ్డ మొహాన విసిరి, బాబునెత్తుకుని వెళ్ళిపోయిందక్కణ్ణుంచి.

రోజూ బాబుకి 'దోమలగూడు కావాలి, రబ్బరు బొమ్మలు కావాలి, ఫలాని పౌడర్ కావాలి, వాడు నజ్జుగా వున్నాడు. ఫలాన టానిక్ కావాలి' అంటుంది రాజ్యలక్ష్మి ఉదయం తాను ఆఫీసుకెళ్తున్నప్పుడు.

అవి తేకుండా కృష్ణ యింటికి వస్తే అది అపరాధమే.

"ఈ వెధవ। నా ఖర్మకొద్దీ పుట్టాడనుకో" అన్నాడు ప్రాణం విసిగి-చివరికొకసారి.

"ఛ। ఏం మాటలవి " అని రాజ్యలక్ష్మి నిజంగా నొచ్చుకుంది కనుకొలుకుల నీరు నింపుకుంది.

"అది సరేగాని రాజ్యం నేను మేజోళ్లు కొనుక్కోవాలి ఏ రంగు కొనుక్కోను?" అ మన్నాడు అడిగేడు.

"మీ యిష్టం గాని, బాబుకి మాత్రం జపాన్ కారు తీసుకురండి ఆ చేత్తోనే" అని పురమాయించింది. "మరే। మా బాబు కలెక్టరు అవుతాడుగా," అంది.

"బాగుంది యింకా పాకడమేనా రాదే వాడికి." ఏడుపుమొహం పెట్టేడు చిరాకు తెచ్చుకోడం అలవాటులేక.

"అందుకనే మరకారు లేకపోతే నా బంగారు తండ్రికి నడబండీయే తేవాలి. నిజం 'కారే' కావాలి"— పాపాయి నెత్తుకుని ముద్దులాడింది.




"వీడికి జరిగిన ముద్దులో సగం మీ అమ్మా. నాకు మా అమ్మా వెయ్యో వంతేనా చేసేరంటావా?" అడిగాడు కృష్ణ కసిగా కొడుకును చూస్తూ.

"అమ్మో ఎంత దుష్టులో మీరు! ఛీ మనం వాడికి చేస్తున్న ముద్దేవిఁటి? నా బంగారు తండ్రికి మరోరైతేనా ఎంతేనా చేద్దురు " అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది రాజ్యలక్ష్మి.

తన బూట్లు వెతుక్కొని, మేజోళ్ళు వెతుక్కొని, బట్టలు తీసుకుని, అన్నీ అయ్యాక కాస్సేపు తిట్టుకుని ఆఫీసుకి తయారయ్యాడు కృష్ణ.

"జో అచ్యుతానంద! జో లాలి పరమానంద లాలీ"... బాబుని వుయ్యాల్లో వేసి పడుకోబెట్టుతోంది రాజ్యలక్ష్మి.

భర్త హడావుడి ఆ పిల్లకి పట్టనే లేదు. ఇదివరకు "ఎంత హాయి ఈ రేయి నిండెనో" పాట పాడి తనను నిద్రపుచ్చే లక్ష్మికి ఆ పాటలే రావు. మరచిపోయాననే తెగువ కూడా వచ్చేసింది. కృష్ణ అదే పదిసార్లు అనుకున్నాడు. విసుక్కొన్నాడు. "వెళ్తున్నా" నన్నాడు కోపంగా.

"ప్లీజ్ తలుపు మెల్లిగా వేసుకోండేం" అన్నది అక్కణ్ణించే కంఠస్వరం నొక్కిపట్టి పలికి.

"వుహుఁ" ఏమనుకోవాలో తెలియక కోపంగా ముక్కి వెళ్ళిపోయాడు ఆఫీసుకి కృష్ణ. తలుపులు గట్టిగా వేసుకున్నాడు.

"ఛడాలు"మందది.

'తనను పూర్తిగా మార్చిన జవరాలు 'రాజ్యం' యివాళ తానే యిలా మారి పోయింది! తనో పాత బొమ్మ అయి పోయాడు! కుర్రవెధవ కొత్త బొమ్మ అయిపోయాడు!! ఛీ! అంతే యీ జీవితమే ఓ బొమ్మలాట!' కృష్ణ — బస్‌స్టాపులో బస్‌కోసం ఆగడం మరచిపోయి గబగబా, కోపం తరుముతూండగా ఆఫీసుకు పోతున్నాడు!

---




రాంబాబు పూజలూ పునస్కారాలూ చేస్తున్నాడని విన్నప్పుడు చిరంజీవి చాలా ఆశ్చర్యపడ్డాడు. వింతల్లోకెల్లా వింతయిన విషయంగా కనిపించిందతనికది. అంతేకాదు అసలతనికి నమ్మబుద్ధి కాలేదు కూడా. కాని నమ్మక తప్పలేదు.

"కూర్చోండి, లోపల అయ్యగారు పూజచేసుకుంటున్నారు," అని పనిపిల్ల చెప్పింది విన్నాక.

ఆరేళ్ళక్రితం నాగార్జునసాగర్‌లో వాళ్ళిద్దరూ కొలీగ్స్‌గా పనిచేసారు. అప్పట్లో ఇద్దరూ చాలా స్నేహంగా ఉండేవాళ్ళు, బ్రహ్మచారులు కావటంతో ఒకే క్వార్టరులో ఉంటూ, ఒకే మెస్‌ని మెయిన్‌టెయిన్ చేసుకుంటూ, పరస్పరాభిప్రాయాల్ని ఎక్ఛేంజి చేసుకుంటూ చాలా ఆత్మీయంగానూ, అన్యోన్యంగానూ. అట్లాంటిది ట్రాన్స్ఫర్ల కారణంగా

విడిపోయారు. మళ్ళీ ఇన్నాళ్ళకు కలుసుకుంటున్నారు. రెండేళ్ళ క్రితం నుంచీ రాంబాబు ఈ ప్రాజెక్టులో ఉంటున్నాడు. చిరంజీవే కొత్తగా ట్రాన్స్ఫరై వచ్చాడు.

లోపలిగదిలోంచి గంట మ్రోగిస్తున్న చప్పుడు వినిపించటంతో పూజ పూర్తి కావచ్చింది గావును అనుకున్నాడు చిరంజీవి. కొద్ది క్షణాల తర్వాత చేతిలో కొబ్బరిముక్కల పళ్ళెంతో రాంబాబు ముందుగదిలోకి వచ్చాడు. చేతిలో పళ్ళెన్ని చిరంజీవి ముందుకు చాపుతూ అన్నాడతను.

"తీసుకో!"

ధోవతీ, భుజంచుట్టూ ఉత్తరీయంతో, నుదుట స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్న విభూదిరేఖలతో– రాంబాబు – విచిత్రంగా కనిపించాడు చిరంజీవికి.

"ఏమిటలా చూస్తున్నావు?" అన్నాడు రాంబాబు.

"నీ అవతారానికి! నాకు నవ్వొంటే నవ్వొస్తుంది నిన్ను చూస్తుంటే," అన్నాడు చిరంజీవి నవ్వబోతూ.

"సర్లే, ముందు ప్రసాదం పుచ్చుకో," అన్నాడు రాంబాబు నిర్వికారంగా.

చిరంజీవి ఒక కొబ్బరిముక్కను తీసుకుని నోట్లో వేసుకున్నాడు.

"చాలా తప్పది, ప్రసాదాన్ని ఎప్పుడూ కళ్ళకద్దుకుని తినాలి!"

రాంబాబు మాటలకు చిరంజీవి అయోమయంగా చూసాడు. అసలు తన ఎదురుగా వుంది తన మిత్రుడు రాంబాబేనా అని కూడా కొద్దిక్షణాలపాటు ఆశ్చర్యం కలిగిందతనికి. పూర్వం సాగర్‌లో పని చేస్తున్న రోజుల్లో రాంబాబు పరమ నాస్తికుడుగా ఉండేవాడు. అతను ఫిలాసఫీ పుస్తకాలే కాక సైన్సుకు సంబంధించినవి కూడా బాగా చదివిఉండటంవల్ల దేవుడు లేడనే తన వాదాన్ని చాలా సహేతుకంగా వినిపించి వొప్పించేవాడు ఇవతలివాళ్ళను. అంతేకాదు, దేవుణ్ణి నమ్ముతున్నామనే వాళ్ళంతా పరమమూర్ఖులైనా అయి ఉండాలి. లేక దొంగముండాకొడుకులైనా అయిఉండాలంటూ చాలా అనాగరికమైన భాషలో ఉద్రేకంతో మాట్లాడేవాడు. అట్లాంటి మనిషి ఇవాళ పూజలు చేస్తుండటమే కాక ప్రసాదాన్ని కళ్ళకద్దుకుని తినమంటున్నాడంటే చిరంజీవికి ఎంతో విచిత్ర మనిపించింది. అతనేదో అడుగుదా మనుకుంటుండగా రాంబాబు లోపలికి వెళ్ళిపోయాడు. తర్వాత అతను డ్రెసప్ అయి తిరిగివచ్చేసరికి అతని వెనక మరో స్త్రీ ఉంది కాఫీ ట్రేతో.

"అనూరాధ – నా మిసెస్. చిరంజీవి – ఇంతకుముందే చెప్పాను కదా నీకు!"

"నమస్కారమండీ!" అందామె ట్రేని టీపాయ్‌మీద పెడుతూ.

"నమస్కారం!"

అన్నాడే కాని ఆమెను చూసాక చిరంజీవికి ఆపైన నోట మాట రాలేదు. ఆమె చాలా పొడుగ్గా ఉంది. అందుకుతగ్గ

లావున్నా సన్నమనిపించేట్లుగా ఉంది. ఆమె కళ్ళు తేనెరంగులో ఉండి అదో వింత ఆకర్షణను సంతరించుకున్నాయి. వంకలులేని ఆమె పొడుగాటి ముక్కు చివర సన్నటి కాడ రింగులా చుట్టబడి ఉండి ఏదో కొంటెదనాన్ని కనబరుస్తోంది. ఆమె నోరు ముద్దుముద్దుగా ఉంది, పెదిమల చివర్లు బాణపు కొనల్లా బుగ్గల్లోకి మొనదేలి ఉంది. మొత్తంమీద ఆమెదొక అపూర్వమయిన అందం పూర్వం రాజ్యాలేలిన మహారాజుల్లోనే కనిపిస్తుందేమో అట్లాంటి సౌందర్య దర్పమూ, వైభవమూ.

మూడేళ్ళ క్రితం వాళ్ళ వివాహపు ఆహ్వానం అందినా కూడా చిరంజీవి ఆ పెళ్ళికి వెళ్ళలేదు, పనుల వత్తిడి కారణంగా. ఆ తర్వాత కూడా మిత్రులిద్దరూ మరీ దూరదూరాల్లో ఉండటంతో ఇంతవరకూ మళ్ళీ కలుసుకోవటం పడలేదు. అట్లాంటిది ఇన్నేళ్ళ తర్వాత కలుసుకోవటం మిత్రులిద్దరికీ ఎంతో ఆనందాన్ని కలిగించింది. ఆబగా ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. ఆ తర్వాత చిరంజీవి రోజూ ఏదో ఓ ఖాళీసమయం చూసుకుని రాంబాబువద్దకు వచ్చేవాడు. మిత్రులిద్దరూ ఏవేవో మాట్లాడుకుంటుంటే ఎదురుగా కూర్చుని అనూరాధ కుతూహలంగా వింటుండేది ఒకో సమయాన తనూ జోక్యంకల్పించుకుని సంభాషణల్లో పాలు పంచుకునేది. అంతకంటే మధురమైన జీవితాలు ఏముంటాయి కనక ! ఇట్లాంటి సమయాల్లోనే ఒకసారి చిరంజీవి తాను అడగాలనుకుంటున్న ప్రశ్న అడిగాడు రాంబాబును

"అవునూ నువ్వింత హఠాత్తుగా నాస్తికత్వాన్ని వదలి భక్తిమార్గంలోకి ఎలా వచ్చావ్ ?"

"హఠాత్తుగా ఏమీకాదు. సహజంగానే - కాలక్రమాన "

"అదే. ఏ కారణాలవల్ల ?"

"రెండేళ్ళ క్రితం ఒకరాత్రి 'పరమాత్మ' స్వరూపాన్ని దర్శించాను. అప్పటినించీ !" అన్నాడు రాంబాబు.

"టార్, నేను నమ్మను," కోపంగా కుర్చీని వెనక్కు జరుపుతూ అన్నాడు చిరంజీవి

"ఎందుకని నమ్మరు.?" సీరియస్‌గా అడిగింది అనూరాధ.

"ఎందుకని ఏమిటండీ," చిరంజీవి అన్నాడు "ఒకప్పుడు ఈ మహానుభావుడి వాదనలవల్లే ఆస్తికుడిగా ఉండే నేను కాస్తా నాస్తికుడినయాను. అట్లాంటిది ఇవాళ మళ్ళీ ప్లేటు ఫిరాయిస్తున్నాడంటే ఏమనాలి ? ! మనిషికి వాదనాపటిమ ఉన్నంతమాత్రాన ఎట్లాపడితే అట్లా మాట్లాడకూడదు. అప్పట్లో ఏమనేవాడో తెలుసా, దేవుడు, దయ్యము, మంత్రాలు, మాయలు ఇట్లాంటివేమీ ప్రపంచంలో లేవనీ, వింతగా చెప్పుకోబడే ప్రతీది




ప్రకృతి స్వభావరీత్యానే జరుగుతోందనీ, ఈ లోకంలో జరుగుతున్నాయని చెప్పబడుతూ దేవునికి ఆపాదించబడుతున్న ప్రతి వింతకూ సైన్సు సమాధానాన్ని చెప్పగలదనీ, అట్లా ఏ ఒక్క వింతనయినాగాని సైన్సు విశ్లేషించి చెప్పలేకపోతోందంటే అందుకు కారణం కేవలం సైన్సు ఇంకా అందాకా అభివృద్ధి చెందకపోవటమేననీ, ఇవాళ కాకపోతే రేపైనా సైన్సు ప్రతి వింతకూ సమాధానం చెప్పగలదనీ అనేవాడు. అట్లాంటి పెద్ద మనిషి ఇవాళ తను 'పరమాత్మ' స్వరూపాన్ని సందర్శించానని అంటే ఎలా నమ్మమంటారు?"

"లేదండీ, ఈయనకు కొన్ని అసాధారణ శక్తులుకూడా అలవడ్డాయి." అనూరాధ అన్నది. "ఉదాహరణకు ఒకోరోజు ఉదయం పూజచేస్తున్నప్పుడు ఈయన పీటమీద కూర్చున్నవారల్లా భూమికిపైన అరడుగు ఎత్తున గాల్లో తేల్తుంటారు ఏ ఆధారమూ లేకుండా. దీనికేమంటారు మీరు?"

అంతలో రాంబాబు కల్పించుకున్నాడు.

"పోనీలే మిత్రమా ఎవరి నమ్మకాలు వారివి. బహుశా ఒకప్పుడు నిన్ను నేనే చెడగొట్టి ఉండవచ్చు. ఆ ఉడుకురక్తపు అవివేకోద్రేకంలో. కాని ఒకటి చెప్పదల్చుకున్నాను. కొన్ని పవిత్రమైన అనుభూతులు అందరికీ అందుబాటులోకి రావు. దానికెంతో సాధన ఉండాలి.... ఎవరో ఎక్కడో ఏమో చూసామనీ, చేసామనీ, రుజువుపర్చామనీ చెబుతుంటే ప్రత్యక్షంగా చూడకుండానే వాటిని అథారిటీగా తీసుకుని మనం గుడ్డిగా నమ్ముతున్నాం. అదే సైన్సు! మరి అట్లాగే కొంతమంది యోగులూ,

ఋషులూ పరమహంసగానీ, అరవిందుడు గానీ తామేదో దర్శించామని చెబుతున్నప్పుడు మనమెందుకని విశ్వసించలేక పోతున్నాం?? అక్కడే ఉంది మన అజ్ఞానమూ, మూర్ఖత్వమూనూ. మనమూ ఏకాగ్రతనూ, సాధననూ అలవర్చుకోలేము కాబట్టి — మనకా ఆనందపు టంచులు ఎటూ అందవు కాబట్టి— అవునా? కాబట్టి ఇప్పటికా ప్రస్తావనను వదలివేద్దాము ఎందుకైనా మంచిది...."

వాదనలో రాంబాబుతో తానెటూ గెలవలేదని చిరంజీవికి మొదటినుండీ తెలుసు.

"అయితే నీవు దేవుడున్నాడంటావు?" అన్నాడు ఉక్రోషంగా.

"అహా!"

"ఏ రూపంలో... "

"నిరాకారంగా. అయితే మనకోసం- ఐ మీన్ ఏకాగ్రత కోసం - ఏ రూపంలో నైనా అరాధించుకోవచ్చు. రాముడు, కృష్ణుడు, శివుడు, అల్లా, జీసస్.... ఎట్లాగైనా సరే "

"మరి పాపపుణ్యాలు?"

"అవీ వున్నాయి. ఎవరి పాప పుణ్యాలకు వాళ్ళే కర్తలు. ఈ లోకంలో కాకపోయినా పై లోకంలో నయినా ఎవరికి తగ్గ ప్రాయశ్చిత్తాలూ రివార్డులూ వాళ్ళకు తప్పవు "

''నువ్వింత మాడ్ ఫెలో వవుతావని నేను కలలో కూడా అను కో లే దు," అంటూ లేచిపోయాడు చిరంజీవి.

"నీ ఖర్మ-" చిన్నగా గొణిగాడు రాంబాబు.

భర్తవేపు మెచ్చుకోలుగా చూసింది అనూరాధ.....

* * *

పై సంఘటన తర్వాత అయిదేళ్ళు ముందుకు జరిగాయి. అయిదేళ్ళ కాలమనేది కొందరి జీవితాలకు సుదీర్ఘమైన రేఖ అయితే మరికొందరికి అది చాలా హ్రస్వరేఖ. మనుషుల వ్యక్తిగత పరిస్థితులు కిందూమీదూ కావటానికి ఆమాత్రం కాలం చాలు.

ఉన్న తండ్రి కాస్తా కాలంచేయటంతో ఆస్తిపరుడు కావటంవల్ల చిరంజీవి ఉద్యోగానికి రిజైన్‌చేసి స్వంత ఊళ్ళో వ్యవసాయం చేసుకోనారంభించాడు.

రాంబాబు మూడేళ్ళ క్రితం పెద్ద జబ్బుచేసి చనిపోయాడు. అనూరాధకు నా అనేవాళ్ళెవరూ లేకపోవడంతో చిరంజీవి కోరటం మూలంగానూ తనకు గత్యంతరంలేని పరిస్థితుల్లోనూ ఆమె వచ్చి చిరంజీవి నీడలో కాలం వెళ్ళబుచ్చుతోంది. కాలక్రమేణా ఆమె భర్తపోయిన శోకాన్నుంచి దూరమయినా కొన్ని కార్యక్రమాల్ని మట్టుకు విఘ్నం కలగకుండా యాంత్రికంగా చేసుకుపోతోంది. వాటిల్లో రాంబాబు ఫోటోకి రోజూ ఉదయాన పూజలు చేయటం ఒకటి. శనివారంనాడు ఆ తతంగం మరీ ఎక్కువగా ఉంటుంది.

అనూరాధ తనమీద ఆధారపడి బ్రతుకుతుండటం చిరంజీవికి ఏమీ భార మనిపించటంలేదు. సరికదా అతను గర్వాన్ని ఫీలవుతున్నాడు, అంత దివ్య సౌందర్యం తన ఇంట్లో అటూ ఇటూ కదుల్తోంటే. ఆమె అంగీకరించటంలేదు గాని అంగీకరిస్తే ఆమెను పెళ్ళాడదా మనే ఉంది అతనికి. ఒకరోజు ఆమె అడిగింది అతణ్ణి.

"మీరింకా పెళ్ళెందుకని చేసుకోలేదు ఇంతకాలాన్నుంచీ?"

"మీలాంటి అందగత్తె దొరకాలిగా!"

"సరేలే, నా అందమే చెప్పుకోవా లిక!'' విచిత్రంగా పెదవి విరిచింది.

ఆమె కళ్ళల్లో స్వాతిశయం స్పష్టంగా తెలుస్తోంది.

"నిజం అనూరాధా! మీ రొప్పుకోవాలి గాని మిమ్మల్ని చేసుకోవటం నా అదృష్టంగా భావిస్తాను."

"ఛీ ఛీ, ఇంకెప్పుడూ అట్లాంటి పాపపు ఆలోచనలు చేయకండి."

చనిపోయిన తన భర్తను దైవంలా ఆమె పూజించటం అదంతా చిరంజీవికి ఒకోసారి చిరాకు కల్గించేవి.

"చూడు అనూరాధా," అతనన్నా డొకసారి. "రాంబాబు పట్ల నాకూ గౌర వాభిమానాలున్నాయి. కాని చనిపోయిన అతనికి ఈ ఆధునిక కాలంలో కూడా మీరలా పూజలూ అవీ చేస్తూండటం మాత్రం నా కేదో ఎబ్బెట్టుగా కనిపి స్తోంది."

చురుగ్గా చూసిందామె.

"అదేమిటండీ అట్లా అంటారు! భర్త దైవంతో సమానం. అదీకాక ఆయన వ్యక్తిగతంగా కూడా దేవుడులాంటి మనిషి."

"అబ్బో, అంత మంచివాడన్న మాట!" వ్యంగ్యంగా అన్నాడు చిరంజీవి. ఆ వెంటనే ఆమెను ఉల్లాస పరచాలని మళ్ళీ అన్నాడు - తన చేతుల్ని రెంటినీ కొద్దిపాటి ఎడంలో పెట్టి చూపించుతూ—

"ఎంత, ఇంత మంచివాడా ?"

ఆ సమయాన ఆమె మంచి మూడ్‌లో ఉందేమో అతను చూపించిందానికంటే ఇంకొంచెం ఎడానికి తన అరిచేతుల్ని పెట్టి చూపించుతూ అన్నది—

"లేదు ఇంత!"

"అంతేనా?" కొంటెగా అడిగా డతను.

"లేదు లేదు ఇంత!!" అంతకంటే ఇంకొంచెం ఎడానికి చేతుల్ని జరిపింది.

"ఓస్, ఆ మాత్రమేనా!" మరింత కొంటెగా అడిగాడు చిరంజీవి.

అదొక ఆటలా పరిణమించింది వాళ్ళ మధ్య.

"కాదు కాదు ఇంత!!!"

చేతుల్ని పూర్తిగా బారజాపి చూపిం చిందామె.

ఆ చేతుల మధ్యకు నన్ను జేర

విచ్చేంతగానా??" అవి, వెంటనే నాలిక కరుచుకున్నాడు చిరంజీవి.

క్షణంపాటు అనూరాధకు అతనే మన్నదీ అర్థంకాలేదు. కళ్ళను మాత్రం ఇంత పెద్దగా విశాలంచేసి చూసింది. వెంటనే ఆమె కళ్ళల్లో ఎర్రటి జీర చోటు చేసుకుంది.

"మీకు మరీ మతిపోతోంది!"

అనేసి గమ్మున లేచిపోయిందామె తన గదిలోకి

చిరంజీవిలో రోజు రోజుకూ అనూరాధపట్ల వ్యామోహం పెరిగిపో సాగింది నవ్వుతుంటే ఆమె పెదాల విన్యాసానికీ, స్వరమాధుర్యానికీ పిచ్చెత్తిపోయినట్లయే దతనికి. ఆమె తన తేనె కళ్ళతో అతని కళ్ళల్లోకి చూస్తే మనస్సుతో సంబంధాన్ని వొదులుకుని తన శరీరం శూన్యంలోకి తేలిపోతున్నట్లు అనిపించేదతనికి. కాఫీ అందించేటప్పుడో, వడ్డన చేసేటప్పుడో ఆమె కొద్దిగా ముందుకొంగితే పమిట వెనక కదిలే ఆ వక్షసంపదకి అతని కళ్ళు బ్లాస్ట్అయి పోతాయా అనిపించేది. కావాలనే అతను కొత్త పల్చటి చీరలు తెచ్చిపెట్టేవా డామెకు. ఆమె నడుస్తోంటే ఆ దుస్తుల్లోంచి ఆమె పొడుగాటి కాళ్ళనీడలు అస్పష్టంగా కనిపించి - లేక అతను వాటినలా ఊహించుకుని - అట్లాంటి సమయాల్లో ఏదో ఆటవిక ప్రవృత్తి అతని మనస్సులోకి జేరటానికి వెర్రి ప్రయత్నాలు చేసేది. ఒకరోజు తెల్లవారు ఝామున అతను కళ్ళు తెరిచేసరికి, ఆమె అప్పుడే నిద్రలేచినట్లుంది, చీర సరిజేసుకోకుండా అతని ముందునుంచి పెరట్లోకి నడుస్తోంది. ఎప్పుడూ ముడి వేసుకోబడివుండే ఆమె జడ ఆ సమయాన విడిపోయి వీపుమీంచి జారి విశాలమైన ఆమె పిరుదులమీద లయబద్ధంగా అటూ ఇటూ కదుల్తోంది. ఎవరామె - ప్రబంధాలలోని శృంగారనాయికా? లేక అప్పుడే భూలోకానికి దిగివచ్చిన దేవతా స్త్రీయా??

"అనూరాధా!!" తనలో మెదుల్తున్న భావాలనన్నింటినీ స్వరంలోకి జొప్పిస్తూ ఉత్కంఠగా పిల్చాడు చిరంజీవి.

ఆమె ఆగి వెనక్కు తిరిగిచూసింది.

ఆ పెద్ద పెద్ద కళ్ళు!!

''ఏమిటి?'' అన్నది అక్కణ్ణించే.

"మిమ్మల్ని రేప్ చేయాలనిపిస్తోంది!''

పెదిమల్ని బిగించి చిత్రంగా నవ్విందామె.

"ఇంకా నయం, నన్ను కోసి కూరొండుకు తినాలనిపిస్తుందని అన లేదు!!"

జుట్టు పీక్కున్నాడు చిరంజీవి.

క్రమంగా అనూరాధలో మార్పు వస్తుండటం గమనించాడతను.పూర్వంలా ఆమె ఇప్పుడు ప్రతిదానికీ పాపపుణ్యాల ప్రసక్తి తేవటంలేదు. ఏం జరుగుతుందామెలో? శరీరం మనస్సును జయి



స్తోందా?? కావచ్చు। శాశ్వతంగా ఆమెను తనదానిని చేసుకోవాలంటే ఒక్కసారి తనామె శరీరాన్ని మలినపర్చాలి, బల వంతంగానైనాగాని. లేకపోతే ఈ దాగుడుమూతలూ, విరహవేదనలూ ఇలా జీవితాంతమూ సాగుతుండాల్సిందే. ఇలా నిశ్చయించుకున్న చిరంజీవి ఒక రోజు తన నిర్ణయాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించాడు.

ఆ మధ్యాహ్నం అనూరాధ తన గదిలో నిద్రపోతోంది అ ఉదయమే తలంటుకుందేమో ముంగురులు రేగి చిలిపిగా ఆమె మొహంమీద పడుతు న్నాయి. ఆమె మంచం పక్కనే మోకాళ్ళమీద కూర్చుని చిరంజీవి నెమ్మదిగా ఆమె చెంపమీద తన పెదిమ ల్నానించాడు. మెత్తటి ఆ స్పర్శ అతనిలో విద్యుత్తును కదిపింది. అట్లాగే మూసుకునిఉన్న ఆమె వెడల్పాటి కను రెప్పల్నీ, పొడుగాటి ముక్కునీ చుంబిం చాడు. ఆమె కదలనన్నాలేదు. చిరంజీవి మృదువుగా తన అరిచేతులతో ఆమె మొహాన్ని పట్టుకుని ఆమెనోటిమీద తన నోరునుంచాడు. ఒక్క క్షణం ఆమె

కదిలింది. చిన్నగా మూలిగింది. వెంటనే గభాల్న కళ్ళు తెరిచింది. మొదటి క్షణాన అతని మొహంలోకి నవ్వుతూ చూసింది. కాని ఆ వెంటనే భయంతో చిన్నగా అరవసాగింది ఎటో శూన్యం లోకి చూస్తూ.

"లేదండీ లేదు, నాకేమీ తెలియదు - నేను నిద్రపోతున్నాను - అమ్మో నా మీదకు రాకండి .. "

"అనూరాధా - అనూరాధా - ఏమి టిది? ఎందుకట్లా భయపడుతున్నావు?" ఆమెను చిన్నగా కుదుపుతూ ప్రశ్నించాడు చిరంజీవి.

"అమ్మతోడు, నాలో ఆ ఉద్దేశ్యం లేదండీ - నాలో అట్లాంటి భావాలు లేవండీ " వణికిపోతోంది అనూరాధ.

ఆమె భుజాలు పట్టుమని కుదప సాగాడు చిరంజీవి.

"అనూరాధా! అనూరాధా!!"

ఆ క్షణాన అతను ఊహించని సంఘటన ఒకటి జరిగింది. అతను ఆమె మీదకు వొంగి నుంచున్నాడేమో అనూరాధ తన రెండు పాదాల్ని గభాల్న అతని ఛాతీమీదకు రానిచ్చి బలాన్నంతా ఉపయోగించి ఒక్క తన్ను తన్నిం దతణ్ణి. వెనక్కు గోడవద్ద వెల్లకింతలా పడ్డాడు చిరంజీవి. వెంటనే అనూరాధ మంచంమీంచి దిగింది.

"వెళ్ళిపోండిక్కణ్ణించి! ముందీ గది లోంచి వెళ్ళిపోండి!!" అరిచిందామె వొణుకుతున్న పెదవుల్తో.

చిరంజీవి బయటికి వచ్చేస్తూ తన వెనకే ఆమె గది తలుపుల్ని మూసు కోవటం విన్నాడు.

రెండురోజులపాటు అనూరాధ అతనికి కనిపించకుండా తప్పించుకు తిరిగింది. చిరంజీవి కూడా చాలా గిల్టీగా ఫీలయ్యాడు ఆ రెన్నాళ్ళూ. మూడో రోజు ఆమెకామె అతని గదికి వచ్చింది.

"నన్ను మన్నించండి చిరంజీవి గారూ," అన్నది.

"అట్లా అనొద్దు అనూరాధా! తప్పు నాదే కదా — తల పక్కకు తిప్పి ఎటో చూస్తూ అన్నాడు చిరంజీవి.

"అసలు సంగతి అదికాదు. నేను మీకో విషయం చెప్పాలనుకుంటు న్నాను."

"ఏమిటది?"

"ఆ పూట ఆయన ప్రేతాత్మ నా గదిలోకి వచ్చింది. నావేపు కోపంగా చూసి నా మీదమీదకు వచ్చింది చేతు లూపుకుంటూ"

"వ్వాట్" అరిచాడు చిరంజీవి.

అరుంధతి చెప్పింది విని చాలా అబ్బురపడ్డాడతను.

రాంబాబు చనిపోవటానికి ముందు రోజు అరుంధతిని దగ్గర కూర్చోబెట్టు కున్నాడట. అప్పటికే అతనిమీద ఆశలు వదులుకున్నారంతా.

"అనూ! నేను చనిపోయాక ఇంకెవరి నైనా పెళ్ళిచేసుకుంటావా?"

"ఛిపాడు! ఎందుకండి అట్లా మాట్లాడతారు, నేనట్లాంటి మామూలు మనిషిననుకుంటున్నారా ?"

"లేదు అనూ - అయినా వొట్టేసి చెప్పు!"

ఒక్క క్షణం అతని మొహంలోకి చూసిందామె.

"దైవసాక్షిగా చెబుతున్నాను - అట్లాంటిది జరుగకూడదు గాని - జీవితాంతమూ మిమ్మల్ని పూజించుకుంటూ బ్రతుకుతాను తప్ప మరో పెళ్ళి చేసుకోను "

"ఎందుకంటున్నానంటే అనూ, కోరికలు తీరకుండా చనిపోయిన మనుషుల ఆత్మలు ఊర్ధ్వలోకాలకు పోకుండా తమ కోరికలకు కేంద్రమయిన వస్తువుల చుట్టూ, మనుషులచుట్టూ పరిభ్రమిస్తూ ఇక్కడే అంటిపెట్టుకుని ఉంటాయి. నీ మీద నాకింకా ప్రేమా, మోహమూ చావలేదు. అందుకే నీ మంచి కోరి చెబుతున్నాను."

రాంబాబు తన చేతుల్ని రెంటినీ గాల్లోకి చాపాడు. కనుగ్రుడ్లు పెద్దవి చేసి, నోరు తెరిచి, నాలిక బయటపెట్టి అసలే కళ్ళు పీక్కుపోయి బుగ్గలు లోతుకుపోయి కృశించిపోయి ఉన్నాడేమో - పరమ భయంకరంగా కనిపిస్తూ చాచిన చేతులతో ఒక రకమైన విన్యాసాన్ని గావించాడు.

"నువ్వు పాపం చేయబోయినప్పుడల్లా నా ప్రేతాత్మ ఈ రూపంలోగాల్లో తేల్తూ నీమీదకు వస్తుంది," అన్నాడట.

అనూరాధ భయంతో మొహం వంచుకుంది. మొన్న చిరంజీవి ఆమెను ప్రయత్నించబోయినప్పుడు రాంబాబు ప్రేతాత్మ ఈ రూపంలో కనిపించిందట ఆమెకు.

"దుర్మార్గుడా !" చిన్నగా గొణిగాడు చిరంజీవి. రాంబాబుమీద అతనికి అమితమైన కోపమొచ్చింది.

పై సంఘటన జరిగాక అనూరాధ మానసికంగా చిరంజీవికి మరింత చేరువకు వచ్చింది. అతనిలో పూర్తిగా మనసు విప్పి మాట్లాడతోందిప్పుడు. కాని తరచుగా ఆమె భయాందోళనలకు గురవుతోందేమో ననిపించిందతనికి. అదే అడిగాడు.

"లేదు లేదు," కలవరంగా అన్నదామె.

కాని అది అబద్ధం. ఇన్‌స్టింక్టివ్‌గా ఆమెలో పేరుకుపోయిన నమ్మకాలు ఆమెను కృంగదీస్తున్నాయి. కాక రాంబాబు పెట్టిన భయం ఒకటి! ఆమెను ఎడ్యుకేట్ చేయాలనుకున్నాడు చిరంజీవి. మూఢనమ్మకాలతో మకిలిపట్టి ఉన్న ఆమె బ్రెయిన్‌ని వాష్‌చేసి ఆ స్థానంలో హేతుబద్ధమైన ఆలోచల్ని ప్రవేశపెట్టాలనుకున్నాడు. అందుకు తగ్గ ప్రయత్నాలు ప్రారంభించాడు.

కాని ఎంత చేసినా ఆమె పూజా కార్యక్రమాల్ని మట్టుకు ఆపించలేక పోయాడు. ఇట్లాంటి సమయంలో అతనికో రహస్యం తెలిసింది ఆమె ద్వారా. అది రాంబాబుకు సంబంధించిన పెట్టె ఒకటి ఆమె పూజాగదిలో ఉండటం. దాన్ని ఆమె ఇంతవరకూ ఏనాడూ ముట్టుకోలేదు. ఆమె వద్ద దాని తాలూకు తాళంచెవి కూడా లేదట. చిరంజీవిని కూడా ఆ పెట్టెజోలికి వెళ్ల వద్దన్నది భయంతో కళ్ళు పెద్దవిచేస్తూ. కాని ఆమెకు తెలియకుండా ఓ రోజు చిరంజీవి మారు తాళంచెవులతో ఆ పెట్టెను తెరిచాడు. డైరీలు ! రాంబాబు రాసుకున్న డైరీలు ఉన్నాయందులో వాటిని భద్రంగా తన గదికి పట్టుకు పోయాడు చిరంజీవి చదవటం తప్పని అనిపిస్తూనే ఉన్నా రాంబాబు నాస్తికత్వాన్నుంచి ఆస్తికత్వంలోకి మారటానికి కారణాన్ని తెలుసుకోవాలన్న కుతూహలంతో చిరంజీవి వాటిని చదివాడు. చదువుతున్నకొద్దీ అతను ఆశ్చర్యంతో తలమున్కలవసాగాడు. అనేక విచిత్ర విషయాలున్నాయందులో. మచ్చుకి :- అనూరాధ శరీరంసంపర్కానికి చాలా త్వరగా ఎప్పుడు పడితే అప్పుడు సిద్ధమవుతుంది. రాంబాబు దృష్టిలో అది 'నింఫోమనియా'. అట్లాంటి శరీరాలు కలవాళ్ళు బలమైన మానసిక అవరోధం ఏదైనా ఉంటే తప్ప పాపంచేయకుండా ఉండలేరు. ఇది రాంబాబు అభిప్రాయము. నిజానికి రాంబాబు చనిపోయేదాకా నాస్తికుడుగానే ఉన్నా అనూరాధలో అట్లాంటి మానసిక అవరోధం కోసం అతను ఆస్తికత్వాన్ని నటించి ఆమెలో పాపపుణ్యాల భావనల్ని ఇంజెక్ట్ చేసాడు. అందమైన ఆమె శరీరం తనకు తప్ప మరొకళ్ళకెవళ్ళకీ ఏనాటికీ దక్కకూడదన్న స్వార్థచింతనలో అతనామె మనస్సులోకి తన ప్రేతాత్మ భావననీ, భయాన్నీ ప్రవేశపెట్టాడు. ఇదంతా చదువుతుంటే జుగుప్సతో చిరంజీవి వొళ్ళు జలదరించింది. ఈ విషయాల గురించి అతను అనూరాధకు చెప్పాలని అనుకున్నాడు. కాని అలా చెప్పటంవల్ల ఆమెను న్యూనతపరుస్తున్నట్లు అవుతుందేమోననీ, కాక దైవంలా కొల్చుకుంటున్న భర్త యొక్క నీచత్వమూ స్వార్థపరతా తెలిసిన్నాడు ఆమె కృంగిపోతుందేమోననీ, ఎప్పటికప్పుడు ఆమెకు చెప్పకుండానే దాటవేసుకుంటూ వచ్చాడు. ఇలా చిన్నగా రోజులు గడుస్తున్నాయి. అనూరాధ ఫీలింగ్స్‌ని గాయపర్చకుండా ఆమెను తనదానిగా ఎలా చేసుకోవాలో అర్థంకావటం లేదు చిరంజీవికి. ఒకటి రెండుసార్లు ఆమె మంచి మూడ్‌లో ఉండగా ఆమె భుజాలమీద చేతులు వేసాడుగాని ఆమె వెంటనే మృదువుగా తోసేసింది వాటిని.




"వద్దు వద్దు. తప్పు!!"

మరికొన్ని సార్లు ఆమెతో వివాహపు ప్రస్తావన తీసుకొచ్చాడతను. కాని ఆమె అంగీకరించటంలేదు. ఇంతలో వేసవి కాలం వచ్చింది. రాత్రులు వాళ్ళిద్దరూ డాబామీద పండుకుంటున్నారు. అంత గొప్ప సౌందర్యం తన సమీపంలో తన కందుబాటులో అవమరిచి నిద్ర పోతోం దన్న స్పృహ అతణ్ణి ఎంతకీ నిద్ర పోనిచ్చేది కాదు. లేచి చప్పుడు కాకుండా ఆమె మంచంవద్దకు వెళ్ళి పుత్తడి బొమ్మలాఉన్న ఆమెమొహంలోకిచూస్తూ చాలాసేపు కాలాన్ని వెళ్ళబుచ్చేవాడు. అట్లాంటి సమయంలోనే ఒకసారి....

మంచంమీద అనూరాధ వెల్లకిలా పండుకుని నిద్రపోతోంది. నిండు వెన్నెట్లో ఆమె దేవతాస్త్రీలా మెరిసి పోతోంది. పమిట చెదిరి ఆమె ఉన్నత మైన వక్షోజాలు చిరంజీవిని కవ్విస్తు న్నాయి. ఒక పక్క మంచంపట్టెమీద కూర్చుని చేతిని అవతలి పట్టెమీదకు జాపి ఆమె మొహంమీద మొహం పెట్టాడు చిరంజీవి. ఆమె పెదిమల మధ్య అతని నాలిక మృదువుగా పాములా కదలసాగింది. ఆమె పెదిమలు తిరిగి రెస్పాన్సునిచ్చేసరికి చిరంజీవిలో సంతోషమూ ఆవేశమూ వెల్లువలా విరుచుకుపడ్డాయి. రెండు చేతుల్తో అత నామెను కౌగిట్లోకి తీసుకోబోతుండగా...

సడన్‌గా అనూరాధ కళ్ళు తెరిచింది. వెంటనే కీచుమందామె గొంతు. ఒక ఉదుటున అతని చేతుల్నుంచి విడి పించుకుని మంచంనుంచి క్రిందకు దిగిందామె. ఆమె కళ్ళు శూన్యంలోకి- ఆకాశంవేపు చూస్తున్నాయి.

"నా తప్పు కాదండీ ఇది - నేను నిద్రపోతున్నాను - అతనే నా మీదకు వచ్చి...."

భయంతో అరుస్తూ ఆమె వెనక్కు నడవసాగింది. వెన్నెట్లో ఆమె మొహం వంకరలు తిరిగి వికృతంగా తయార య్యింది.

"లేదండీ, ఇంకెప్పుడూ అట్లా చేయను– అసలీ ఇంట్లోనే ఉండను " వెనక్కి వెనక్కి నడుస్తోందామె అరుస్తూ.

అర్థమయింది చిరంజీవికి. తన స్పర్శలకు ఆమె శరీరం స్పందించింది. అందు కనువుగా ఆమె మొహం తనకు తాను సిద్ధపరచుకుంటుండగా ఆమెలో అంతకంటే బలీయమైన శక్తిగా రూపొంది ఉన్న అంతరాత్మ మేల్కొని భ్రాంతిపూర్వకమైన రాంబాబు ప్రేతాత్మను కళ్ళఎదుట సృష్టించి ఆమె మనస్సునూ శరీరాన్నీ తనకు బానిసను చేసుకుంది. తను పాపానికి వొప్పుకున్నందుకుగాను రాంబాబు ప్రేతాత్మ తనను కబళించటానికి మీదమీదకు వస్తోందన్న ఆ భ్రాంతిలో ఆమె వెనక్కు వెనక్కు నడుస్తోంది..

ఆమె అలా వెనక్కు నడుస్తుంటే చిరంజీవికి భయమేసింది, ఆమె ఎక్కడదాకా చివరకు పోతుందోనని. కాని అదే జరిగింది. అప్పటికి ఆమె పిట్టగోడదాకా పోయింది. ఇంకా నడుస్తోనే ఉందలా – భయంలో ప్రేలాపనలు చేస్తూ, నిలువెల్లా వణికిపోతూనూ.

"అనూరాధా! అనూరాధా!!" అంటూ గభాల్న ముందుకు దూకాడు. చిరంజీవి ఆమెను పట్టుకుని ఇవతలకు లాగాలని.

"అమ్మో!!!"

మరింత భయంతో వెర్రిగా అరుస్తూ పిట్టగోడ నుంచి వెనక్కు విరుచుకు పడిందామె.

చిరంజీవి కాళ్ళు ఒకటే వణికిపోతున్నాయి గభాల్న నేలమీదకు కూలబడిపోయి చేతుల్లో మొహం దాచుకుని బావురుమన్నాడు. అతనికి తెలుసు, క్రిందికి పోయి తనాదృశ్యాన్ని చూడలేడని. అక్కడంతా రాతి ప్రదేశం!

అలా రోదిస్తూ ఎంతసేపో కూర్చున్నాడు చిరంజీవి. ఆ రోదనలోనే, అతనికి అకస్మాత్తుగా రాంబాబు తన డైరీలో ఒక చోట రాసుకున్న వాక్యం గుర్తుకొచ్చింది.

'స్త్రీలలో పాతివ్రత్యం నిలవాలంటే వాళ్ళలో ఆస్తికభావాలు బలంగా నాటుకునేట్లు చేయాలి.'

"దుర్మార్గుడా, గెల్చావు రాంబాబూ!" కసిగా గొణిగాడు చిరంజీవి.



సీరియల్

# కాంచన కుటీరం



## 28

క్రాంతిబాబు మద్రాసు చేరుకున్నాడు. అతనివెంట దివాన్జీ రాఘవయ్య కూడా వచ్చాడు. చదువుకొనేరోజుల్లో క్రాంతి బాబు తోటి విద్యార్థులతో కలిసి కాలేజీ హాస్టల్స్‌లోనే వుండేవాడు. చదువు పూర్తయింతర్వాత మద్రాసు రావడంతో తొలిసారిగా తన తాతలనాటినుంచి వున్న గెస్ట్‌హౌస్‌లో దిగాడు. నిజానికి రాజా రాజశేఖరం, ఆయనవెంట వచ్చిన శ్రావణి ఆ గెస్ట్‌హౌస్‌లో దిగిన తర్వాత కాంచనకుటీరం వంశీకులు ఎవ్వరూ గెస్ట్‌హౌస్‌కు రాలేదు. కొన్ని సంవత్స రాల తర్వాత కాంచనకుటీరం వారసులు, ప్రస్తుత యజమాని అయిన క్రాంతిబాబు తొలిసారిగా గెస్ట్‌హౌస్‌లో దిగాడు.

అందుకే వెంట దివాన్జీ రాఘవయ్యకూడా వచ్చాడు. గెస్ట్‌హౌస్‌లోని వంటవాళ్ళకూ, పనివాళ్ళకూ క్రాంతిబాబును పరిచయం చేశాడు. జాగ్రత్తగా చూసుకోవాలని హెచ్చరించాడు. అదేరోజున క్రాంతిబాబు దగ్గర సెలవుతీసుకొని, తిరిగి వెళ్ళిపోయాడు.

రాఘవయ్య ఆదేశానుసారం క్రాంతిబాబును పనివాళ్ళందరూ కంటికి రెప్పలా చూసుకుంటున్నారు. రాజా రాజశేఖరానికి జరిపిన రాచమర్యాదలనే క్రాంతిబాబుకు కూడా జరుపుతున్నారు. కాంచన కుటీరంలో క్రాంతిబాబు తల్లిచాటు బిడ్డగా వున్నా మద్రాసు గెస్ట్‌హౌస్‌లోమాత్రం కాంచనకుటీర పరిపూర్ణ యజమానిగా సేవలను, మర్యాదలను పొందుతున్నాడు. తలుచుకుంటే తనకే ఆశ్చర్యమనిపించింది. నిన్నమొన్నటిదాకా కాలేజీ హాస్టల్‌లో తోటి విద్యార్థుల్లో ఒకడుగా మసిలిన తనకు అంత మర్యాదా, అంత ఆడంబరం ఏదో కొత్తగా, కృతకంగా అనిపించింది. కలలో ఏనుగు వచ్చి మెడలో దండవేస్తే రాజైనట్లుగా అనిపించిందతనికి. కాని అన్ని భోగాల మధ్య అన్ని మర్యాదల మధ్య భారతిని తల్చుకొనేసరికిమనస్సు గతుక్కుమంది.

కాంచనకుటీరంనుంచి తాను బయలుదేరేముందు నీలగిరిలో వున్న భారతికి ఉత్తరం వ్రాశాడు క్రాంతిబాబు. భారతీ, తనూ కాలేజీ చదువులనుంచీ యూనివర్సిటీ చదువులదాకా కలిసి చదువుకున్నారు. మనస్సులు ఇచ్చిపుచ్చుకున్నామని మాటలలో ఒకరికొకరు చెప్పుకోలేదుగానీ, చూపులలోనూ, చేష్టలలోనూ వివరించుకున్నారు. ఎన్నోసార్లు కలుసుకున్నారు. ఏవేవో మాట్లాడాలనుకొని, మాట్లాడాలని అనుకొన్నవి తప్ప, మిగిలినవన్నీ మాట్లాడుకున్నారు.

ఈసారి తన మనస్సులోని మాటను, మనస్సును భారతి ముందు పెట్టాలని ఆమె మనసేమిటో తెలుసుకోవాలనీ అతని ఆశ. అందుకే వ్రాశాడు. తన వ్రాసిన ప్రకారం ఆమె మరుసటిరోజుఉదయానికి రావాలి. కాని ఆమె వస్తుందో రాదో అనే అనుమానం అతని మనస్సును చికాకుపరుస్తోంది. తాను మగవాడు. పైగా సర్వస్వతంత్రుడు. ఎక్కడికైనా వెళ్ళొచ్చు; ఎవరినైనా కలవొచ్చు. భారతి చదువుకున్నదే అయినా వయస్సులో వున్న ఆడపిల్ల. ఆమె వెనుకా పెద్దవాళ్ళుంటారు. సెలవుల్లో మద్రాసు దేనికని ఆమెను మద్రాసు రానివ్వకుండా చేస్తారో, లేక ఆమె ప్రయాణానికి అనుమతిస్తారో, ఒకవేళ వాళ్ళు అనుమతించకపోతే, తనకీ ఆమెకీ వున్న సంబంధాన్నీ, స్నేహాన్నీ వివరించి, వొప్పించి వస్తుందో! – అలా ఆలోచించే కొద్దీ క్రాంతిబాబుకు భారతి మద్రాసు వచ్చే అవకాశాలు చాల తక్కువగా కనబడుతున్నాయి. ఆమె మద్రాసు రాదు

అనే నిర్ధారణ తన మనస్సుకు తోస్తే మనసంతా వికలమైపోతోంది తనకు.

అలా ఆమె వస్తుందో, రాదోనన్న ఆలోచనల మధ్య, ఆశనిరాశల మధ్య క్రాంతిబాబు కలతనిద్రపోతున్నాడు.

తెల్లవారింది.

భారతి వచ్చే నీలగిరి ఎక్స్‌ప్రెస్ ఉదయం ఎనిమిది గంటలకే స్టేషన్‌కు చేరాలి. క్రాంతిబాబు ఏడున్నరకే తన స్వంతకారులో స్టేషనుకు చేరుకున్నాడు. టైం ప్రకారం ట్రైన్ వొచ్చింది.

వెయ్యికళ్ళతో ప్లాట్ ఫారమంతా వెతికాడు భారతికోసం క్రాంతిబాబు.

తొందర తొందరగా ప్రతి కంపార్ట్‌మెంట్‌లోకి తొంగిచూశాడు. ఒక ఫస్ట్ క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోకి తొంగిచూస్తూ ఉండగా, "మిస్టర్ క్రాంతీ! ఐయామ్ హియర్," అన్న తీయని కంఠస్వరం వినిపించింది.

ఆ పిలుపు విన్న క్రాంతి నవ్వు మొహంతో వెనక్కు తిరిగి చూశాడు.

ఎదురుగా భారతి.

చిరునవ్వులు చిందిస్తూ వెన్నెల దీపంలా వెలుగుతోంది భారతి.

ఆమె నవ్వుతూనే, "ఏమిటంత ఖంగారుగా వెతుకుతున్నారు? నేను రాలేదేమోననా?" అంది భారతి.

"కాదు. నేను మిస్ అవుతానేమోనని, కమాన్," అని కూలీని పిల్చి, సూట్ కేసు ఇచ్చి, ఇద్దరూ స్టేషను బయటికొచ్చారు.

క్రాంతిబాబు భారతిని తన కారు దగ్గరకు తీసుకెళ్ళాడు.

అతని కారును చూసి, "ఎవరిదీ కారు?" అంది భారతి.

"మనదే. ఎక్కండి," అని డోర్ తెరిచాడు.

ఆమె వెనుకసీట్లో కూర్చుంది. పక్కన అతను కూర్చున్నాడు.

డ్రైవరు కారు స్టార్ట్ చేశాడు.

"మీరెప్పుడూ యూనివర్సిటీకి కారులో వచ్చేవారు కాదే?" అంది భారతి 'ఇప్పుడీ కారు ఎక్కడిది?' అని అడుగుతూన్న ధోరణిలో.

"అప్పుడు స్టూడెంట్‌ను. ఇప్పుడు యజమానిని," అన్నాడు క్రాంతి ముక్తసరిగా.

భారతి, క్రాంతితో తనకున్న పాత పరిచయాన్ని పురస్కరించుకొని, చనువుగా దగ్గరగా మాట్లాడుతోంది. కాని క్రాంతి తన పనివారు తనకిచ్చే మర్యాదలనుబట్టి ఎంతో హుందాగా, ముభావంగా మాట్లాడుతున్నాడు. ఆమెవైపుకు తన ముఖాన్ని తిప్పికూడా చూడకుండా, ఆమెను ఎదురుగా వున్న కారు మిర్రర్‌లోనే చూస్తున్నాడు. ఎదురు గాలికి ఆమె ముంగురులు కేరింతలు కొడుతూ వుంటే జాబిలి మీద చిరుమబ్బులు కదులుతూన్నట్టు అనిపించింది అతనికి. ఆమె మాత్రం నిస్సంకోచంగా, నిర్భయంగా ముందుసీట్లోవున్న డ్రైవర్ని

కూడా పట్టించుకోకుండా అతనితో మాట్లాడుతూన్నది. అతన్నే చూస్తోంది. కొ స్తకొంటెగా, "కారు అత్తగారిచ్చారా?" అంది భారతి.

"కారున్న పెళ్ళికొడుకేక్కి అత్తవారు కూడా కారిస్తారు," అన్నాడు క్రాంతి నవ్వుతూ.

"అబ్బాయి అందాన్ని చూసికూడా ఇవ్వొచ్చుగా !"

"అమ్మాయి అందంగా లేకపోతే యిస్తారు."

ఆ మాటలకు భారతి పకపకా నవ్వింది.

"అయితే కట్నం ఎక్కుణ్నుంచి బాగారాబట్టాలోతెల్సుకున్నారన్నమాట।"

"నన్ను ఆటపట్టించే పనిమీదే వచ్చారా ?"

"ఏదో సరదాగా జోక్‌చేశాను. అంతలోకే ఆటపట్టిస్తున్నానని ఎందుకనుకోవాలి? అవునూ. మీరు మీరూ అంటున్నారేమిటి నన్ను."

"మీరూ నన్ను మీరేనని అంటున్నారుగా."

"నేనన్నానా ?"

"మిస్టర్ క్రాంతి అని పిలిస్తే క్రాంతి గారు అని కాదా ?" అన్నాడు ఓరగా చూస్తూ.

"ఓ ! అదా ! ప్లాట్ ఫారంమీద క్రాంతి, క్రాంతి అని పిలవడం బాగోదని మిస్టర్ క్రాంతి అని పిలిచాను. అదీ కాక పోయినా మనం విడిపోయి అప్పుడే నెలరోజులు కావస్తూంది."

"కలుసుకోవడం ఆలస్యమైతే మనుష్యులు దూరమవుతారన్నమాట ?"

"మనుష్యులు దూరమైనా కలసిన మనస్సులు దూరం కావులే క్రాంతీ।" అని తలవంచుకుంది భారతి.

ఆ మాట క్రాంతికి తీయని వీణా నాదంలా వినిపించింది. ఒక ప్రణయ గీతానికి పల్లవిగా, పదాలులేని ఒక ప్రేమగీతికి భావాలాపనగా అనిపించింది అతనికి. డ్రైవర్ లేకపోతే భారతిని తన సందిట్లోకి తీసుకొని ఆమె తనువులోని అణువణువునూ ముద్దులతో ముంచెత్తేవాడు. తాను పరవశించి ఆమెలో ఒక అణువైపోయేవాడు. కాని ముందున్న మూడో వ్యక్తి సభ్యత, అతని ఆవేశానికీ, తన్మయత్వానికీ కళ్లాలు వేశాయి.

కారు గెస్టుహౌస్ పోర్టికోలో ఆగింది. డ్రైవరు తొందరగా దిగి డోర్ తెరిచాడు.

ఇద్దరు నౌకర్లు వచ్చి డిక్కీ ఎత్తి భారతి సూట్‌కేసును లోపలకు తీసుకెళ్లారు.

ముందుగానే జరిగిన ఏర్పాట్ల ప్రకారం నౌకర్లు భారతిని ఆమె ఉండాల్సిన గదికి తీసుకెళ్లారు.

గది ఎంతో అందంగా అలంకరించ బడింది. అన్ని అలంకరణలకూ మించి




టీపాయ్ మీదున్న అప్పుడే విరిసిన ఎర్ర గులాబీలు భారతిని ఎంతగానో ఆకర్షించాయి.

ఒక నౌకరు విండో కర్టెన్లను పక్కకు తొలగించాడు.

ఎదురుగా కేరింతలు కొడుతూన్న సముద్రం కనిపించింది భారతికి. త్రుళ్ళి పడే కెరటాలను చూస్తూ నిలబడింది.

నౌకర్లు బయటకు వెళ్ళిపోయారు.

క్రాంతి వచ్చి ఆమె వెనకనే నిలబడ్డాడు.

సముద్ర కెరటాల్ని తిలకిస్తూన్న భారతి అతని రాకను గమనించలేదు.

"ఈ గది నీకు బావుందా?" అని పలకరించాడు క్రాంతిబాబు.

"వెరీ ఫైన్. ఫాంటాస్టిక్. ఎవరిదీ ఇల్లు?"

"ఇది ఇల్లుకాదు. గెస్టుహౌస్."

"ఐసీ, వెరీ ఫైన్ లొకేషన్। ఇంతకీ ఎవరిదిది?"

"మనదే."

ఆమె అతని కళ్ళల్లోకి చూసింది - మనదే అంటే అన్నట్టు.

క్రాంతి సర్దుకొని, "అదే। మాదే," అన్నాడు.

ఇద్దరి మధ్యా ఒక్క క్షణం నిశ్శబ్దం ఆవరించింది.

"స్నానం చేయి, బ్రేక్‌ఫాస్ట్ తీసుకుందాం," అని బయట కొచ్చేశాడు క్రాంతి.

భారతి ఏమీ అర్థంకానట్టు భుజాలెగరవేసి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది.

* * *

భారతీ క్రాంతీ డైనింగ్ టేబుల్

ముందు కూర్చున్నారు. టేబుల్ నిండా వెండిసామగ్రి పరిచిఉంది. మచ్చుకైనా పింగాణీ వస్తువు కనబడటంలేదు. ఇద్దరు నౌకర్లు పూర్తి యూనిఫారమ్‌లో చేతులుకట్టుకు నిలబడ్డారు. తినేవాళ్ళ అవసరాలనుబట్టి అడక్కుండానే వడ్డిస్తున్నారు వాళ్ళిద్దరూ. అక్కడి పద్ధతీ, దర్జా చూసి క్రాంతితో భారతి ఏమీ మాట్లాడలేకపోయింది.

బ్రేక్‌ఫాస్ట్ తీసుకొని భారతి తన గదిలోకి వచ్చింది.

చదువుకొనే రోజుల్లో ఆమె క్రాంతిని క్లాస్‌మేట్‌గా, మంచి స్నేహితుడిగా చూసింది, తెల్సుకుంది. పరిచయాన్ని పెంచుకుంది. అతనిమీద నమ్మకాన్ని పెంచుకుంది. అలా ఆమె తన కళ్ళ ముందు కనిపించే అతని గురించే తెలుసు కుంది గానీ అతని వెనుకవున్న ఆస్తి పాస్తుల గురించీ, పెద్దవాళ్ళ గురించీ తాను అడగనూ లేదు; అతను చెప్పనూ లేదు. నిజానికి క్రాంతి కూడా ఆమెను అలాంటి విషయాలు అ డ గ లే దు. సర్దాగా ఎప్పుడైనా ఉత్తరం రాస్తాడేమో ననుకుంది గానీ, అకస్మాత్తుగా ఇలా వైరిచ్చి పిలిపిస్తాడని కూడా అనుకో లేదు.వైర్ వచ్చింతర్వాత అమ్మమ్మకూ, అమ్మకూ ఏమని చెప్పాలో, వాళ్ళను ఒప్పించినా బాబాజీని ఎలా ఒప్పించాలో తన కర్థంకాలేదు. చాలాసేపు ఆలో చించి ధైర్యంచేసి, బాబాజీ దగ్గరకే వెళ్ళింది. వచ్చిన వైరే చూపించింది.

బాబాజీ వైర్ చదివాడు -

"రీచ్ మద్రాసు బై ఫోర్టిన్త్ ఎక్స్‌ప్రెస్ - క్రాంతి" అని.

"క్రాంతి ఎవరమ్మా !"

"నా ఫ్రెండ్ బాబాజీ ! క్లాస్‌మేట్ కూడా !"

"వైర్ రమ్మనే వుంది కానీ, ఎందుకో కారణం లేదే !" అన్నాడు. బాబాజీ పైప్ పీలుస్తూ.

"ఏదో తగినంత కారణం వుంది వుంటుంది బాబాజీ," అంది బెరుకుబెరుగ్గా భారతి.

"ఊఁ ! అంత క్లోజ్ ఫ్రెండా !"

"క్లోజ్. నేనంటే ప్రాణం !"

"ఓ. కే. బయల్దేరు. మళ్ళీ త్వరగా వచ్చేయ్ !"

అలా బాబాజీ దగ్గిర అనుమతి తీసుకుని వచ్చిందితను.

క్రాంతి అమ్మాయనుకొని బాబాజీ అనుమతించాడు కానీ లేకపోతే ఏమనే వాడో ! ఏమైనా తాను బాబాజీని ఒక రకంగా మోసగించానేమో అనుకుంది. అమ్మమ్మ, అమ్మ, డాడీ బా బా జీ ని దేవుడిలా చూసుకుంటారు. ఆయన గీసిన గీటు దాటరు. అలాంటి వ్యక్తికి నిజంచెప్పకుండా మభ్యపెట్టి తనొచ్చింది. క్రాంతి మీద నమ్మకంతో, క్రాంతి పిలుపును తిరస్కరించలేక, పిచ్చిగా రెక్కలు కట్టుకువచ్చి వాలింది తను. తీరా ఇక్కడకు వచ్చాక చూస్తే తనకు తెలిసిన

క్రాంతి వేరు; ఇప్పుడు తన కళ్ళముందు కనిపిస్తున్న క్రాంతి వేరు. వెనక తనతో కలిసి చదువుకున్న క్రాంతి తనలాంటి స్టూడెంటే. ఇప్పుడు తాను చూస్తున్న క్రాంతి ఒక పెద్ద జమీందారు. ఇంత పెద్ద గెస్టుహౌస్, పెద్దకారు, ఇంటి నిండా వెండి సామాను, ఖరీదైన ఫర్నిచరు, అడుగులకు మడుగులొత్తుతూ అతని కనుసన్నల్లో మసిలే నౌకర్లు— చూస్తూంటే తనలోకాన్ని వొదిలి, వేరే లోకానికి దారి తప్పి వచ్చినట్టు అనిపించింది ఆమెకు. ఒక్క గెస్టుహౌస్ ఇలా ఉంటే అతనికున్న మొత్తం ఆస్తిపాస్తులు, అతని వంశం, అతని పెద్దలు ఎంత ఇదిగా వుంటారో, వూహ కందడంలేదు ఆమెకు. అతను రమ్మన గానే వచ్చాను. ఇక్కడ అతను నన్ను ఏంచేస్తే మాత్రం నేనేం చేయగలను? అనుకుంది. ఆ ఆలోచన రాగానే ఒక్క క్షణం ఆమె గుండె ఝల్లుమంది. అంతలోనే 'ఛీ, క్రాంతి అలాంటివాడు కాడు' అని తనకు తానే నచ్చచెప్పుకుంది.

అలా పరధ్యాన్నంగా ఆలోచనల్లో ఉన్న భారతి దగ్గరకు క్రాంతి వచ్చాడు. ఎదురుగ్గా వున్న సోఫాలో కూర్చుంటూ, "ఏమిటి భారతీ? అంత పరధ్యాన్నంగా వున్నావు?" అన్నాడు.

"అబ్బే? ఏంలేదు" అంది భారతి చిరునవ్వుతో.

కాని ఆమె అతని మొహంలోకి చూడకుండా తన అరచేతిని చూసుకుంటోంది.

"ఈ మధ్య పామిస్ట్రీ చదువుతున్నావా?" అన్నాడు క్రాంతి.

"అబ్బె! అదేం లేదు," అని అరచేతిని ముడుచుకొని, తలెత్తి అతని మొహంలోకి చూసింది.

నిష్కల్మషమైన అతని మొహం చూసి, అలాగే చూస్తూ ఉండిపోయింది. ఈసారి క్రాంతే తలవంచుకొని, "నిన్ను మోసం చేశాననుకుంటున్నావా, భారతీ!" అన్నాడు.

"ఎందుకలా అనుకున్నావు?"

"నేనింత ఆస్తిపరుణ్ని అని ఇదివరకెప్పుడూ చెప్పలేదు గదా అని."

"నేనూ అడగలేదుగా, ఆ మాట కొస్తే నా సంగతే నువ్వు అడగలేదు."

"నిజం భారతీ! అప్పుడే కాదు. ఇప్పుడూ నీ ఆస్తిపాస్తుల సంగతీ, నీ వంశం సంగతీ నేను అడగదల్చుకోలేదు. కారణం – నా క్కావాల్సింది నువ్వుగానీ, నీ ఆస్తిపాస్తులూ అంతస్తులూ కావు."

భారతి మౌనంగా ఉండిపోయింది.

"ఏం భారతీ! నేను పొరపాటుగా మాట్లాడుతున్నానా? లేక నువ్వు వూహించనంత చనువు తీసుకుంటున్నానా!"

(సశేషం)




# రావణాసురుడి బొమ్మ

## యర్రంశెట్టి శాయి

మరో అరగంటలో సామర్లకోట చేరుకొంటుంది రైలు. టైము చూసుకొంటూ కూర్చున్నాను. ఆ రాత్రంతా ఎలాగోలా గడిపేను కానీ, ఆ అరగంట గడపడం మాత్రం దుర్లభమయిపోతోంది. ఒక్కొక్క నిముషం ఒకో గంటలా గడుస్తోంది. అంత వరకూ వేగంగా వెళ్తోన్న ఆ రైలు అకస్మాత్తుగా తాబేటిలా నడుస్తున్నట్లనిపించసాగింది అసహనంగా వాచీవంక చూసుకొంటూ కూర్చున్నాడు. బయట ఇంకా చీకటిగానే ఉంది.

“భగవంతుడా! రాజిని కాపాడు.” మనసులోనే దేవుడిని ప్రార్థించుకున్నాను. అలా అనుకొంటూంటే నా కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్. జేబులోని టెలిగ్రామ్ తీసి మరోసారి చదివాను. “రాజికి సీరియస్‌గా ఉంది. వెంటనే బయల్దేరు” అంతకు ముందురోజు ఉదయం ఇచ్చిన టెలిగ్రామ్ అది. మరిప్పుడు పరిస్థితి మెరుగయిందో, మరింత క్షీణించిందో! రైలు నెమ్మదిగా ఆగిపోయింది. బయట స్టేషనేమీ

కనిపించటంలేదు. బహూశా సిగ్నల్ ఇవ్వలేదేమో? ఆ ఆలస్యం నన్ను మరింత కృంగదీస్తోంది. అయిదు నిమిషాల తర్వాత మళ్ళీ బయల్దేరింది రైలు సామర్లకోట దగ్గరవుతున్నకొద్దీ రాజిని గురించిన ఆలోచనలు, పాతస్మృతులు క్రిక్కిరిసిపోతున్నాయ్ నాలో. రాజి మా మావయ్య కూతురు. నా కంటె నాలుగయిదేళ్ళు చిన్నదను కొంటాను.

ఆమె పుట్టిన సంవత్సరానికే అత్తయ్య చనిపోయింది. అప్పుడే రాజిని తనతోపాటు మా ఇంటికి తీసు కొచ్చేసింది మా అమ్మ. రాజిని చూస్తూనే నేనూ, అక్కయ్యా, చెల్లాయీ అందరం ఆశ్చర్యపోయాం. అప్పటికే రెండేళ్ళ పిల్లలా కనిపించేది. మా అందరికంటె బలంగా ఉండేది అప్పటికే నడిచేయడం చూసి మా వాళ్ళందరూ ఆశ్చర్య పోయారు. మూడేళ్ళకే దానికి మాటలన్నీ వచ్చేశాయ్. అయిదేళ్ళు వచ్చే సరికి రూపుకూడా మారిపోయింది. పెద్ద పెద్ద కళ్ళు, కోల మొహం, చిన్న నోరూ, కళ్ళు కనిపించకుండా మొహంమీదకు పడే జుట్టూ నాకు భయంగా ఉండేదెందుకో దాన్ని చూస్తూంటే. నాకంటె చిన్న దయినా మా ఇద్దరినీ చూస్తే ఆ విషయం ఎవరూ నమ్మేవారు కాదు. నేనే దానికంటే చిన్నవాడినని అనుకొంటూండేవాళ్ళు.

అది మొదటి కారణం – రాజి అంటే నాకు అయిష్టం కలగడానికి. రెండోది దాని ప్రవర్తన; తను నిజంగానే నా కంటె పెద్దదానిలా ప్రవర్తించేది నన్ను ఏదొక సాకు తీసుకొని మందలిస్తూండేది. నేను మా ఇంటి చుట్టుపక్కల కుర్రా ళ్ళందరితో రాజా - దొంగా ఆటలాడు కొంటూంటే తనూ వచ్చి జొరబడి ఆడేది సాధారణంగా నేనూ, శీనుగాడూ, చంద్రంగాడూ దొంగల వేషాలు వేసే వాళ్ళం. శంకరం, రాధాగాడూ, రాఘవ రావూ రాజులుగా ఉండేవాళ్ళు. మిట్ట మధ్యాహ్నం రెండింటికి అందరం పెద్దాళ్ళకు తెలీకుండా మా ఇంటి వెనుక ఉన్న సరుగుడు తోటలోకి రహస్యంగా ఓ సంకేత స్థలంలోకి చేరుకుని ఆడుకునే వాళ్ళం. తీరా ఆట ప్రారంభించబోయే సమయానికి ఎక్కడినుంచి వచ్చేదో తనూ వచ్చి నిలబడేది రాజి. దాన్ని చూడగానే మా కందరకు పై ప్రాణాలు పైనే పోయేవి. "నేనూ ఆడతాను" అనేది మా అందరివేపూ నిర్లక్ష్యంగా, బెదిరింపుగా చూస్తూ. దాని పొగరు చూస్తూంటే నాకు కడుపు రగిలిపోయేది.

"వద్దు" అనడానికి మాకెవరికీ దమ్ము ల్లేవు ఎందుకంటే మేమంతా అలా ఆ ఎండలో పడి సరుగుడుతోటల్లో ఆడు తున్నట్లు మా పెద్దాళ్ళతో చెప్పేస్తుంది. దాంతో మాకు దెబ్బలు తప్పవు. ఈ విషయం అందరకీ తెలుసు. పోనీ

ఆడనిద్దామా అంటే ఒక పార్టీలో ముగ్గురు, మరో పార్టీలో నలుగురయి పోతారు. అదీగాక సరుగుడు బెత్తాలతో మేము చేసే యుద్ధంలో ఆడపిల్ల పాల్గొనడం మా కిష్టంలేదు. ఏమీ చేయలేక దాన్ని రాజులపార్టీలో వేసే వాళ్ళం. ఆట ఆఖర్లో రాజులకూ దొంగలకూ మావూరి టూరింగ్ సినిమా హాల్లోని సినిమాలోలా జరిగే కత్తియుద్ధం మేమూ చేస్తూంటే రాజి తనో బెత్తం తీసుకొని మా వెనుకనుంచీ అందరినీ నిజంగానే చావబాదేసేది. అలా నిజంగా బాదకూడదని ఎన్నిసార్లు చెప్పినా నిష్ప్రయోజనమేఅయేది.చాలాసార్లు మాఅందరి వొళ్లూ వాతలు తేలిపోయినయ్. తిరిగి దాన్ని కొట్టాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా సాధ్యంకాలేదు. రాకెట్లా దూసుకునిపారిపోయేది దాన్ని వెంబడించి అందుకోగల శక్తి మాలో ఎవరికీ లేదు. దాని బాధపడలేక కొద్దిరోజుల్లోనే మేమా ఆట కట్టివేశాం. గోళీలాటయితే అది మా జోలికి రాదనీ, ఒకవేళ వచ్చినా దానికా ఆట రాదుకాబట్టి రాజిని తేలిగ్గా ఓడించి మోచేత్తో దేకించవచ్చనీ, అలా చేస్తే రెండోసారి అది మా జోలికి రాదనీ నిర్ణయించుకొని మర్నాడు అందరం గోళీలు తెచ్చుకుని ఆట మొదలెట్టాం. మామూలుగానే సమయానికి వచ్చి నుంచుని నేనూ ఆడతానంది రాజీ తన దగ్గరున్న గోళీ చూపిస్తూ. అసలు ఆ రోజు మేము గోళీలాట ఆడాలని నిర్ణయించుకున్నట్లు దానికెలా తెలిసిందో మాకెవ్వరికీ అర్థంకాలేదు. తర్వాత కూడా మాదే ఘోర పరాజయం. ఒక కన్ను మూసి ఖచ్చితంగా గురిచూసి మా గోళీలను ఆమడదూరం పోయేట్లు కొట్టటం మొదలుపెట్టింది. రాజికితప్ప మిగతా మా అందరి మోచేతులూ చర్మం లేచేట్లు గీరుకుపోయినయ్యా రోజు. మా అందరికీ మతిపోయినట్లయింది. "ఈ గొడవంతా ఎందుకు? అసలు మనం మధ్యాహ్నంపూట ఆట లాడవద్దు" అన్నాడు చంద్రంగాడు ఏమీ చేయలేక. అదే మంచిదని అందరం వారం రోజుల పాటు ఇళ్ళు కదలడం మానివేశాం. అవకాశం దొరికితే ప్రతీకారం తీర్చుకోవాలని ఎదురుచూడసాగాను నేను. అప్పుడే మా కోసమని కేరమ్‌బోర్డ్ కొనుక్కొచ్చారు నాన్నగారు. నేనూ, చెల్లీ ఓ వేపూ, అక్కా, రాజీ మరో వేపూ ఉండి ఆడాము. ఆడిన ఎనిమిది గేముల్లోనూ అయిదు గేములు గెల్చుకొందది. దానిచేతిలో ఏముందోగాని అది కొట్టిన ప్రతి కాయినూ బీరుపోకుండా 'పాకెట్' అయేది. ఆ రోజునుంచీ అదంటే ఓ విధమయిన ద్వేషం కూడా మొదలయింది నాలో. నేనుఓడిపోతున్నందుకుకాదది. గెలిచినప్పుడల్లానావంకఅదో రకంగా ఠీవిగా, గర్వంగా చూసేదది. మేమిద్దరం సింగిల్స్ ఆడినప్పుడు నా




పని మరీ ఘోరంగా ఉండేది. రెండు ష్ట్రియికుల్లోనే బోర్డ్ క్లీర్ అయిపోయేది. అప్పుడు దాని చూపునుంచి తప్పించుకోడానికి నానా అవస్థాపడేవాడిని. తరువాత అసలు అది ఉన్నప్పుడు ఆడడం మానేసేవాడిని రానురాను దాని ఎదుట పడి తిరగడానికూడా మనస్కరించేది కాదు నాకు. నేను ఫోర్త్‌ఫారం కొచ్చేసరికి రాజి ఫస్ట్‌ఫారంలో చేరిపోయింది. రాజీ బాధ నాకొక్కడికే కాదు. అమ్మా, అక్కయ్యా, చెల్లీ అందరూ విసుక్కుంటూనే ఉండేవారు. రాజి అల్లరిని తగ్గించడానికి అమ్మ ఎన్నో ప్రయత్నాలు చేస్తూండేది. ఎంత అల్లరి చేసినా, తల్లి లేనిదవడంవల్ల అదంటే వల్లమాలిన ప్రేమ అమ్మకి. ఒక్కనాడు కూడా కొట్టలేదు. రాజికి మాత్రం రోజుకో గొడవ చేయకపోతే నిద్రపట్టేదికాదు. ఓ రోజు హాల్లోని అద్దం పగలకొట్టేసింది. అది చాలా ఖరీదయిన అద్దం. కావాలని లోతుగా ఉన్న నూతిలో బక్కెట్టు పడేసి చెప్పకుండా ఊరుకొనేది. మరోరోజు రెండు అందమయిన గాజుప్లేట్లు దాని చేతిలో ముక్కలయిపోయాయ్. వాటిని నాన్నగారు కలకత్తా నుంచి తెప్పించారు. మరోరోజు చక్కని అలారం టైపీస్ రాజి చేతిలోనుంచి జారి కిందపడి ముక్కలయిపోయింది అద్దం. ఆ తరువాత అది పనిచేయడం మానివేసింది. ఓసారి జరిగిన సంఘటన ఇంకా కళ్ళకు కట్టినట్లే గుర్తుంది ... ప్రక్కింటివాళ్ళ పెరట్లోని జామచెట్టు మీది జామకాయలు రాల్చడానికని రాళ్ళు రువ్వడం మొదలుపెట్టింది. అందులో ఓ రాయి వాళ్ళ గడపలో నుంచున్న పక్కింటి కుర్రాడికి తగిలి నెత్తికి పెద్ద

గాయమయిపోయింది. ఆ యింటివాళ్ళు కోపం పట్టలేక అమ్మని నానా మాటలూ అని వెళ్ళారు. అమ్మ రాజిని దగ్గరకు తీసుకొని "ఇంత రాలుగాయివేమే," అని కన్నీరు పెట్టుకొంది.

సెకండ్ ఫారం కొచ్చేసరికి రాజిమీద నాకు ద్వేషం మరింత ఎక్కువయి పోయింది. హైస్కూల్లో, నేనూ, మా స్నేహితుల్లూ ఏమేంచేస్తుందీ, ఎక్కడెక్కడ తిరుగుతుందీ అన్నీ సీక్రెట్ ఏజంట్లా కనిపెట్టి అమ్మకు చెప్పేస్తూండేది.అప్పట్లోనే రాజికీ నాకూ ఘోరమయిన యుద్ధం కూడా జరిగింది. ఆరోజు మానాన్నగారు మాంఛి బొమ్మల కథల పుస్తకం తెచ్చిచ్చారు నా కోసం. తీసుకొని ఒక్కొక్క పేజీ చూస్తుంటే నా దగ్గరకొచ్చి "ఆ పుస్తకం ఇటివ్వు" అంది రాజి. నాకు కంపరం పుట్టు కొచ్చింది."ఇవ్వను"అన్నాను కోపంగా.

హఠాత్తుగా ముందుకి వంగి నా చేతి లోని పుస్తకం లాక్కొని పరుగెత్త సాగింది. గట్టిగా పట్టుకోవడంచేత ఆ పుస్తకం అట్టమాత్రం నా చేతిలో మిగిలి పోయింది. అలా చిరిగిపోయినందుకు నాకు చాలా సంతోషం కలిగింది. అది నాన్నగారికి చూపిస్తే రాజిని చావగొడతా రని నాకు తెలుసు.

"ఇప్పుడే నాన్నతో చెప్తానుండు" అన్నాను అట్టతీసుకెళ్ళి దానికి చూపుతూ.

"చెప్పుకో, ఫో" అంటూ తన చేతి లోని పుస్తకం తీసి ఈడ్చి నా మొహాన్ని కొట్టింది. కళ్ళు బైర్లుకమ్మినయ్ కాసేపు నాకు. కోపంకొద్దీ దాన్ని బలంగా వీపు మీద బాదాను నేను. ఇద్దరం పిడిగుద్దులు గుద్దుకొన్నాము. పోట్లాట వచ్చినప్పుడల్లా అది ఓడిపోయే పరిస్థితిలో ఏంచేస్తుందో నాకు తెలుసు. ఇప్పుడూ అదే చేసింది. తనకున్న పొడుగాటి గోళ్ళతో నా ముఖ మంతా రక్కేసింది. అమ్మ వచ్చి కూక లేశాక అది అక్కడినుంచి వెళ్ళి పోయింది. ఆ రోజు రాత్రి భోజనంచేసిం తర్వాత నా గదిలో కెళ్ళేసరికి ఎదురుగ్గా గోడకి రాక్షసుడి బొమ్మ ఒకటి వేలాడ దీసి ఉంది. దాని కింద నా పేరు రాసి ఉంది. ఆ పని ఎవరిదో నాకు వెంటనే తెలిసిపోయింది. అది చాలా మంచి అవకాశంగా కూడా కనిపించింది. ఎప్పుడయినా దాన్ని పెద్దాళ్ళతో తన్నించా లంటే ఆ బొమ్మ నాన్నగారికి చూపించ వచ్చు. దాన్ని జాగ్రత్తగా తీసి నా పెట్టె అడుగున దాచాను. కాని ఆ రోజు ఎప్పుడూ రాలేదు. ఆ తరువాత కొద్ది రోజులకే మా కుటుంబ పరిస్థితులు హఠాత్తుగా మారిపోయాయ్. ఒకరోజు రాత్రి రెండింటికి మెలకువ వచ్చింది నాకు. అప్పుడు పక్క గదిలోనుంచి అమ్మ ఏడుపు సన్నగా వినబడుతోంది. నేను లేచి నెమ్మదిగా తలుపుదగ్గరకు వెళ్ళి వినసాగాను.

"ఇప్పుడెలాగో మీరే చెప్పండి.

అందరూ చిన్నపిల్లలు. వీళ్ళను తిండి లేకుండా మాడ్చేద్దామా ?" అంటోంది అమ్మ.

"మరేంచేద్దాం చెప్పు ! ప్రొద్దుట్నుంచీ రాత్రివరకూ తిరుగుతూనే ఉన్నానుగదా! ఎక్కడా మరో ఉద్యోగం దొరికే సూచనలే కనిపించటంలేదు...."

"పోనీ- మీ స్నేహితుల నెవరినైనా అడగలేకపోయారూ ?"

"ఎవరున్నారనీ ? మా కంపెనీ లాకౌట్ వల్ల అందరి పరిస్థితీ మన పరిస్థితి గానే ఉంది. నేను ఏదొక సమయంలో ఎవరో ఒకరింట్లో భోజనం చేస్తూనే ఉన్నాను. నీదీ, పిల్లలదే నాకు దిగులు. పోనీ ఓ పనిచేయ్. రేపు నీ గాజులు తాకట్టు పెట్టేసి ఇంట్లోకి కావలసిన వస్తువులు తెచ్చుకో ! నేను తిరిగి వచ్చే సరికి రాత్రి తొమ్మిది దాటుతుంది."

"ఏమిటోనండీ ! నాకు భయంగా ఉంది. ఒకపూటే తింటున్నా నగలన్నీ అయిపోతున్నయ్.... ఇంక ఈ గాజులు కూడా అయిపోతే మనకు మిగిలేదేమీ ఉండదు...."

"భగవంతుడిమీద భారం వేద్దాం ! అంతకంటే చేయగలిగిందేముంది ? కానీ ఈ విషయయాలేమీ పిల్లలకు తెలీనీకు ! వాళ్ళు భయపడి చదువు నిర్లక్ష్యం చేస్తారేమో !"

"సరే !"

నేను అక్కడినుంచి వెళ్ళి నా పక్క మీదకు చేరుకున్నాను. నా కెందుకో భయంవేసింది. నాన్నగారి కంపెనీ తిరిగి తెరిస్తే బావుండుననుకొన్నాను. తెల్లారే సరికి రాజి బిగ్గరగా కేకలుపెడుతూ ఏడుస్తోంది. తనకి చీర కొనిపెట్టాలట. నాకు దానిమీద అంతులేని కోపం వచ్చింది. ఓ పక్క నాన్నగారు ఉద్యోగం లేక అవస్థపడుతోంటే మధ్యలో దీని చీర గొడవేమిటి ? అమ్మ ఎంత నచ్చచెప్పినా వినటంలేదది. చీర కొనిపెట్టకపోతే స్కూలుకి వెళ్ళనని కూర్చుంది. విసుగు పుట్టి అమ్మ దాని వీపుమీద గట్టిగా ఓ దెబ్బ వేసింది. దాంతో ఇల్లెగిరిపోయేట్లు ఏడ్పు సాగించది. అక్కయ్య వచ్చి రాజిని బయటకు ఈడ్చుకుపోయింది. "చీర కట్టాలంటే నువ్వింకా బాగా పొడుగవ్వాలే! లేకపోతే చీర పెద్దదయి పోతుంది. నువ్వు స్కూల్ ఫైనల్ పాసయేసరికి ఒకటి కొనిస్తాములే. అమ్మ దగ్గర అలా గొడవచేయకేం," అంటూ నచ్చచెప్పిందామె. అప్పటిగ్గాని కొంత వరకూ శాంతించలేదు రాజి.

ఆ రోజునుంచీ అది అద్దంముందు నిలబడి గంటలతరబడి చూసుకొంటూ కూర్చునేది. ఆ విషయం అందరం దానికి తెలీకుండా చాటునుంచి చూసి నవ్వు కొంటూండేవాళ్ళం. పెద్దదయినకొద్దీ తగ్గి పోతుందనుకొన్న దాని అల్లరి మరింత ఎక్కువయిపోయింది. స్కూల్లో కూడా అందరితో పోట్లాటే ! ఓ రోజు టిఫిన్

కారియర్ పారేసుకొచ్చింది. మరో రోజు టెక్ట్స్ పుస్తకాలు పోగొట్టుకుంది. ఇంకో రోజు చెప్పులు- ప్రతి రోజూ ఏదొక గొడవ. జరగాల్సిందే. ఆ పోయిన వస్తువులన్నీ కొనిపెట్టమని మరొక గొడవ. ఆ తరువాత రెండు నెలల్లో మా పరిస్థితి మరింత క్షీణించిపోయింది. పాలు కొనుక్కోడం మానేశాము. కాఫీ, టీలు లేవు. ఎలక్ట్రిసిటీవాళ్ళు బిల్లు కట్టనందుకు కనెక్షన్ తీసివేశారు. ఆ ఇంటి అద్దె కట్టలేకపోవడంవల్ల ఊరి బయట ఉన్న ఓ చిన్న పెంకుటింట్లోకి మారిపోయాము. ఇన్ని గొడవలవుతున్నా నాన్న కంపెనీ లాకౌట్‌లో ఉందన్న సంగతి నాకూ, అక్కయ్యకూ తప్పిస్తే మిగతావాళ్ళకు తెలీదు. ఏదో ఒకటి సర్ది చెబుతూండేదమ్మ. అందరికీ బట్టలు కూడా చిరిగిపోసాగినయ్. అమ్మకి అప్పుడే జబ్బుచేసింది. ఆమెను గవర్నమెంట్ హాస్పిటల్‌లోచేర్చారు నాన్నగారు. ఆమె అనేకసార్లు మా అందరికీ కడుపు నిండా భోజనం పెట్టి, ఆ తరువాత తనకేమీ మిగలకపోవడంచేత పస్తులుపడుకోవడం నాకు బాగా తెలుసు. అమ్మ హాస్పిటల్లో చేరడంతో నాన్నగారికి తట్టుకోలేని పరిస్థితి ఏర్పడింది. ఇంట్లో మమ్మల్ని చూసుకోవడం – హాస్పిటల్లో అమ్మని చూడడం – తీరికలేకుండాపోయింది. ఓరోజు రాత్రి అన్నంలేదని రాజి పెద్ద ఏడుపు మొదలెట్టడంతో ఆయన తన రహస్యాన్ని బయటపెట్టక తప్పలేదు. మమ్మల్నందరినీ దగ్గర కూర్చోబెట్టుకొని తన ఉద్యోగం లేకపోవడం గురించీ, ప్రస్తుతం ఎదుర్కొంటున్న దారుణ మయిన దరిద్రం గురించీ – మేమందరం తనకి ఎలా సహకరించాల్సిందీ క్షుణ్ణంగా వివరించారు. అలా చెప్పేప్పుడు రెండు మూడుసార్లు ఆయన కళ్ళవెంబడి నీరు కమ్ముకోవడం మేము చూశాము. కొద్ది నిముషాలు మాట కూడా ఆగిపోయింది. ఆ రోజునుంచీ మా అందరిలోనూ మార్పు వచ్చింది. ఎంత ఆకలేస్తున్నా నోరుతెరచి ఎవ్వరినీ ఏమీ అడిగేవాళ్ళం కాదు. మా స్కూలు ఫీజులు కట్టక పోవడంచేత స్కూలుకెళ్ళడానికి వీల్లేక పోయింది. ఈ పరిస్థితిని ఎదుర్కోవా లనుకొంది అక్కయ్య ఒక్కర్తే చుట్టు పక్కలున్న పిల్లలు చాలామందిని పోగు జేసి వారికి ట్యూషన్లు చెప్పటం ప్రారంభించింది. ఆ పిల్లల తల్లిదండ్రుల దగ్గర అప్పుడప్పుడు డబ్బు అడిగితీసుకొని అమ్మ కోసం మందులూ, పళ్ళూ కొంటూండేది. ఓరోజు అక్కయ్యతోపాటు మేమందరం కూడా హాస్పిటల్‌కు వెళ్ళాము. మమ్మల్ని చూసి కన్నీళ్ళు పెట్టుకొందమ్మ. అందరినీ దగ్గరకు తీసుకొని చాలాసేపు ఏడ్చింది.

"ఏం తింటున్నారో, ఏమో! అస్థిపంజరాల్లా తయారయారు," అంది. దిగులుగా ఆమె ఏడుస్తూంటే మాకూ కూడా ఏడుపొచ్చింది. అలాంటి దుఃఖ

సమయంలో కూడా రాజి తన అల్లరి మానలేదు. తనూ అమ్మదగ్గరే ఉండి పోతానని మారాం మొదలు పెట్టింది. చివరకు దానిని హాస్పిటల్ పనివారి సాయంతో హాస్పిటల్‌నుంచి బయట కీడ్చుకురావాల్సివచ్చింది. ఇంటికొచ్చాక తనకు చీర కొనిపెట్టమని మళ్ళీ ఏడుపు. స్కూలుకెళ్తానని గొడవ — ఒకచేమిటి? అక్కయ్య దాన్ని ఎలా సహించిందో నా కిప్పటికీ అర్థంకాదు. ఆరోజు నాన్న గారు సంతోషంగా ఇంటికొచ్చారు. కంపెనీ లాకౌట్ ఎత్తివేశారుట. మర్నాటి నుంచే తను కంపెనీకెళ్ళాలట.

"ఇంక మనకు ఏ భయమూ లేదు. అందరూ స్కూలుకెళ్ళండి. మళ్ళీ మన పాత ఇంట్లోకెళ్ళిపోదాం! కడుపునిండా భోజనం చేద్దురుగాని...."

"మరి....నాకు చీర కొనిపెడతారా?" రాజి అడిగిందాయనను.

"ఓ — తప్పకుండా కొంటాను" అన్నారు, నాన్నగారు దానిని దగ్గరకు తీసుకొని. ఆ విషయం, అమ్మకు చెప్పడానికని హాస్పిటల్ కెళ్ళిన నాన్న గారు అమ్మ శవంతో ఇంటి కొచ్చారు. ఆఖర్లో ఆమె "రాజికి చీర కొనివ్వండి," అందట రెండుసార్లు. నర్సులు చెప్పా రా విషయం నాన్నగారికి. వారంరోజుల వరకూ మాఇల్లే శ్మశానంలా అనిపించిం దందరికీ! ఆ తరువాత కూడా మాలో అదివరకటి సన్నిహితత్వం లోపించింది. అందరి మధ్యా అమ్మ వహించే పాత్ర అప్పుడే మాకు అర్థమయింది. జీవితం నెమ్మదిగా మళ్ళీ అదివరకటి గాడిలో పడుతోంది. రాజి అల్లరి మాత్రం ఏ మార్పూలేకుండా అలానే ఉంది. చీర కొనిమ్మన్న దాని గొడవ మాత్రం అంతం కాలేదు. అక్కయ్య వివాహం జరిగిపోయింది. బావతో ఢిల్లీ వెళ్ళడం కూడా జరిగిపోయింది. అక్కయ్య పాత్ర చెల్లి తీసుకొందిప్పుడు, అయితే అలా ఎంతోకాలం జరగలేదు. దాని క్కూడా వివాహం అయిపోయింది. మరికొద్ది రోజుల్లో అత్తగారింటికి వెళ్ళి పోతుంది. నేనూ పై చదువులకోసం వైజాగ్ వెళ్ళాల్సివచ్చింది. నాన్న గారికి ప్రమోషన్ రావడంవల్ల కాంప్‌లు ఎక్కువైపోయాయ్. నెలకు ఇరవై రోజులు ఊళ్ళు తిరుగుతూనే ఉండాలి. ఈ పరిస్థితుల్లో రాజిని మా మావయ్యా దగ్గరకు పంపించేయడం తప్పదని నిర్ణ యించుకొన్నా మందరం. ఆమెను తీసుకెళ్ళడానికి మావయ్య కూడా వచ్చే శాడు. ఆ మర్నాడే ఆమె ప్రయాణం. నాన్నగారు ఆ రోజు సాయంత్రం రాజి కోసం ఓ చక్కటి చీర కొనుక్కొ చ్చారు. మర్నాడు ఉదయం తలంటుకొని ఆ చీర కట్టుకొమ్మని సలహా ఇచ్చింది చెల్లెలు. రాజి ఆనందం పట్టశక్యం కావడంలేదు. చుట్టుపక్కల వాళ్ళందరికీ తను చీర కట్టుకోబోతోందని చాటించే సింది.

మర్నాడు తెల్లవారకముందే లేచి కూర్చుంది రాజి. దాని హడావుడికి మా అందరికీ నిద్ర పాడయిపోయింది. ఇంకా పూర్తిగా తెల్లవారకముందే రాజి తలంటు స్నానం చేసి జుట్టు అరబెట్టుకొంటూ కనిపించింది మాకు. చెల్లాయ్ వంటింట్లో హడావుడిగా ఉంది. అందరం కాఫీ టిఫిన్లు ముగించేసరికి ఎనిమిదయిపోయింది. రాజి చీర కట్టుకొని పొంగిపోతూ అద్దం ముందు కూర్చుండిపోయింది. ఈలోగా మామయ్య రిక్షా తీసుకొచ్చేశాడు. రాజి తనతోపాటు తెచ్చుకొన్న సూట్ కేస్ తీసుకెళ్ళి రిక్షాలో పెట్టాన్నేను. నాన్నగారు రాజి వెళ్ళిపోతున్నందుకు లోలోపలే కుళ్ళిపోతున్నారు. మామయ్య రిక్షా దగ్గర కెళ్ళి నుంచున్నాడు.

"రాజిరాదేం-పిలువ్-ఎక్కడుందో!" అంది చెల్లాయ్.

"రాజీ" అంటూ నేను అక్కడినుంచే అరచాను. సమాధానం రాలేదు.

"దయ్యం-ఏ మూల ఏం చేస్తోందో-వెళ్ళి పిల్చుకురా!" అందామె. అన్ని గదులూ వెతుక్కొంటూ తిరిగాను. ఎక్కడా ఆమె జాడ కనిపించలేదు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఇంతలోనే ఎక్కడికి మాయమయిపోయిందా అని. చివరకు పెరట్లోని బాదంచెట్టు క్రింద కూర్చుని ఏవో ఆలోచనల్తో ఆకాశంలోకి చూస్తూ కనిపించింది.

"ఏయ్ పద! మావయ్య పిలుస్తున్నాడు," అన్నాను చిరాకుగా.

రాజి జవాబివ్వలేదు. నావంక చూడలేదు. అసలు నా మాట విన్నట్లే కనిపించలేదు. నిర్మలంగా, కదలకుండా అలాగే చూస్తోంది. అక్కడ ఏముందా అని ఆమె చూస్తున్నవేపే నేనూ చూసేను. ఆకాశం నిర్మలంగా ఉంది. చూడదగినంత విశేషం ఏమీ కనిపించలేదు. "ఏయ్ రాజీ! అవతల బస్‌కి లైమైపోతుంది. త్వరగా పద!" అన్నాను కొంచెం గట్టిగా.

అప్పటికీ రాజి చలించలేదు. నన్ను గమనించినట్లేలేదు. నాకు ఆశ్చర్యంతో పాటు భయంకూడా కలిగిందీసారి.

దీనికేమయిందివాళ .. ఎక్కడా ఓ క్షణం కూడా కూర్చోనిది - ఇరవై నాలుగ్గంటలూ ఏదో ఒక చిలిపి పనిచేసేది, ఇలా నిశ్శబ్దంగా కూర్చోడమే కాకుండా ఎంత పిలిచినా జవాబివ్వకుండా - అదీ తనెప్పటినుంచో కావాలని ఏడ్చి, అల్లరిపెట్టి, సాధించిన చీర కట్టుకున్న రోజున ఇలా ఎందుకు ప్రవర్తిస్తోంది? నాకేమీ అర్థంకావటంలేదు.

"ఏయ్ - విన్నే పిలిచేది! అలా కూర్చున్నా వేమిటి? రిక్షా వచ్చిందవతల. అందరూ నీకోసం చూస్తున్నారు ... ఓ రాజీ!" అంటూ గట్టిగా అరిచాను. ఓ నిమిషం తర్వాత నా వంక చూడకుండానే "బావా!" అంది నెమ్మదిగా.



తృళ్ళిపడ్డాను నేను. అంతవరకూ ఏనాడూ నన్ను 'బావా' అని పిలచిన పాపాన పోలేదు. ఎప్పుడూ ఏదో నిక్ నేమ్‌తో గానీ లేదా 'ఒరేయ్' అనిగానీ, లేదా పోట్లాటలొచ్చినప్పుడు తన కిష్ట మయిన తిట్లద్వారా గానీ పిలిచేది. నెమ్మదిగా, తాపీగా మాట్లాడసాగిందది. దాని గొంతులో ఏదో కొత్తదనం కనిపిస్తోంది. దాని కళ్ళలో అంతకు ముందు కనిపించని వెలుగు -

"నాకే ఆశ్చర్యంగా ఉంది బావా! నాకు ఊహ తెలిసినదగ్గర్నుంచీ కూడా ఇంత అల్లరిదాన్నిగా, మొండిదాన్నిగా ఎందుకు తయారయ్యాను? అమ్మని ఎందుకంత ఏడిపించేదాన్ని? నిన్నూ, అక్కయ్యనూ ఎందుకంత అల్లరి

పట్టించేదాన్ని? నాన్నగారి మనసు ఎందుకు కష్టపెట్టేదాన్ని? నా చుట్టూ ఉన్నవాళ్ళందరూ అయిష్టపడేలా ఎందుకు ప్రవర్తించేదానిని? ఎవ్వరు చెప్పినా వినకుండా, తెలుసుకోకుండా, ఎదురు తిరిగి ఎందుకు విర్రవీగేదానిని? నాకే తెలీదు బావా అది. ఈ చీరకోసం ఎందుకంత గొడవ చేసేదాన్నో తెలుసా? ఎందుకో నేను అందరిలా పుట్టలేదని పించేది నాకు. నా రూపం ఎందుకో నాకు సంతృప్తి కలిగించలేదు. అందరిలా ఉండాలన్న కోరిక నన్నెప్పుడూ కాల్చేస్తూ ఉండేది. చీర కట్టుకొంటే నేనూ ఓ మామూలు అమ్మాయిలా, కనబడతానన్న ఆశ కలిగింది నాలో. అందుకే చీర కావాలని గొడవచేసేదాన్ని. చీర కట్టుకొంటే నా రూపం ఎలా వుంటుందా అని ఊహించుకొంటూ గంటలతరబడి అద్దంముందు నిలబడే దానిని. కాని అమ్మని బాధపెడుతున్నా నన్న విషయమే నేను గమనించలేదు. ఆఖరి క్షణాల్లో కూడా అమ్మ "నాకు చీర కొనిపెట్టమని" కలువరించిందంటే అమ్మకి నా మీద ఎంత ప్రేముందో తెలీటంలేదూ? కాని.... బావా! అంతా నా భ్రమ. చీర కట్టుకొన్నంత మాత్రాన కొత్తరూపం ఎక్కడినుంచి వస్తుంది మనిషికి?" మాట్లాడడం కొద్దిక్షణాలు ఆపింది రాజి.

నేను నిశ్చేష్టుడనయి నిలబడి పోయాను. రాజి, పెద్ద ఆరిందాలా అంత పెద్దమాటలు మాట్లాడుతుంటే వింతగా ఉంది నాకు.

"కాని బావా! నా పైరూపం, లోపలి రూపం ఒకటికాదు. లోపల నాకే మాత్రం కపటంలేదు. పెంకెతనం లేదు. ద్వేషం లేదు అయిష్టం లేదు. కోపం లేదు. నేను అందరినీ ప్రేమించాను బావా! నిన్నూ, అక్కయ్యలనూ, అమ్మనూ, నాన్నగారినీ — నీకు తెలుసు కదు బావా! ఓ సారి మనందరం బందర్లో దసరా పండగకి అర్ధరాత్రి కోనేటి సెంటర్ కెళ్ళాం! అక్కడ ఊరేగింపుతో రావణాసురుడి బొమ్మను తీసుకొచ్చారు. బొమ్మ లోపల ప్రేలుడు సామానుంచారు. పైన గుడ్డలతో కప్పారు. దానికి నిప్పంటిస్తే ఏమయింది? బొమ్మ ప్రేలిపోయి అసలు రూపమేలేకుండా చెల్లా చెదురయి పోయింది. అవునా బావా! నేనూ ఆ రావణాసురుడిబొమ్మనే. నేనుచేసేఅల్లరీ, అగడాలూ అన్నీ ప్రేలుడు పదార్థాలు బావా! అవి ప్రేలిపోతే లోపల మిగిలే దేమిటి? ఖాళీ! ఏమీ ఉండదు. మీ అందరకూ నేను చేసిన అల్లరికి నేనంటే కోపం ఉంటుంది. నాకు తెలుసు. అందుకే నేను వెళ్ళిపోతున్నా మీకు సంతోషంగానే ఉంటుంది. కానీ చిన్నప్పటినుంచీ, నాకు ఊహ తెలిసిం దగ్గర్నుంచీ, నా సర్వస్వమూ మీరే




అనుకొన్న నాకు - ఇప్పుడు మా ఇంటికే వెళ్తోన్నా-ఏ పరాయివాళ్ళింటికో వెళ్తున్నట్లుంది. నేనింక అదివరకటి రాజిని కాదు బావా! మారిపోయాను. ఎంత మారిపోయానంటే అప్పటికీ ఇక ముందుటికీ అసలు పోలికే ఉండదన్న మాట " ఇలా చెప్తూంటే ఆమె కళ్ళ వెంబడి జలజల నీళ్ళు రాలిపోయినయ్. లేచి నుంచుని నా దగ్గరకొచ్చి నా కళ్ళల్లోకి చూసింది.

"బావా! నా మీద కోపం ఇంకా ఉందా?"

"ఊహు లే...దు " అన్నాను గాబరాగా.

"అలా అని మాటివ్వు!" అంది చేయి చాస్తూ.

"నిజంగా రాజీ! నువ్వంటే నా కిప్పుడు కోపం లేదు " అన్నాను ఆమె చేతిలో చేయివేస్తూ.

"రాజిని తీసుకురా అంటే నువ్వా వచ్చి ఇక్కడే నుంచున్నావా" అంటూ వచ్చింది చెల్లాయ్. రాజి వెంటనే చెల్లాయ్‌తో బయటకు నడిచింది. నేనొక్కడినే అక్కడ మిగిలిపోయాను. హఠాత్తుగా ఓ అనుమానం వచ్చి రాజి ఆకాశంలోకి చూసినవేపు చూశాను. అక్కడ ఏమీ లేదు. అంతా తెల్లగా ఉంది.

రాజి వెళ్ళిపోయింది. ఆ తరువాత కొద్ది రోజులకు చెల్లాయ్ కూడా అత్తారింటి కెళ్ళిపోయింది. నేను వైజాగ్ యూనివర్సిటీలో చేరిపోయాను. ఆరు నెలలు కాకుండానే ఇప్పుడీ టెలిగ్రామ్.

"రాజికి సీరియస్‌గా ఉంది. వెంటనె బయల్దేరు."

రైలు సామర్లకోటలో ఆగింది. త్వర త్వరగా దిగి స్టేషన్ బయటకు నడిచాను. ఓ టాక్సీ ఎక్కి వేగంగా పోనిమ్మని చెప్పాను డ్రైవర్‌కి. గాలిలో తేలి పోతోన్నట్లు నడుపుతున్నాడతను. నలభై నిమిషాల్లో మామయ్యవాళ్ళ పల్లె చేరు కున్నాను. ఒకరిద్దరి సాయంతో శిథిలా వస్థలో ఉన్న మామయ్య పెంకుటిల్లు చేరుకొన్నాను. మట్టి అరుగులమీద దిగులుగా కూర్చుని ఉన్నాడు మామయ్య. నన్ను చూడగానే అతని ముఖం వికసించింది.

"నీకు టెలిగ్రామ్ అందిందో లేదోనని ఆలోచిస్తున్నాను పద-రాజిని చూద్దూ గాని," ఆనందంగా అన్నాడతను. ఇద్దరం వెల్తురు అంతగా చొరని లోపలిగదిలోకి నడిచాము. మంచంమీద చిక్కి శల్య మయిపోయిన రాజి గుర్తుపట్టడానికి వీల్లేకుండా ఉంది.

"మీ అందరిమీదా బెంగెట్టుకొం దయ్యా-ముఖ్యంగా నీ మీద" నెమ్మదిగా అన్నాడు మామయ్య. నాకు దుఃఖం క్రమ్ముకొచ్చిందామెను చూస్తుంటే.

మంచంమిద కూర్చుని "రాజ" అంటూ ఆమె శిరస్సుని తాకాను. అతి కష్టంమీద కళ్ళు తెరిచిందామె. "నేనే రాజీ వచ్చేశాను - చూడు!" అన్నాను ఆప్యాయంగా. ఒక్క-క్షణం ఆమెకళ్ళల్లో వెలుగు కనిపించింది నాకు. ఆ రోజు బాదంచెట్టుక్రింద కొత్తచీర కట్టుకొన్న సమయంలో ఆమె కళ్ళల్లో కనిపించిన వెలుగే అది. నెమ్మదిగా తనచేతిని ఎత్తి నా చేతిని తాకింది. అంతే- మరుక్షణం ఆమెప్రాణాలు గాలిలో కలిసిపోయినయ్. మామయ్య ఆమె చేతిని పట్టుకొని చూసి బిగ్గరగా ఏడ్చేయడం మొదలుపెట్టాడు. నేను లేచి బయటి కొచ్చేశాను, నాకు తెలీకుండానే. నా ప్రమేయమేమీ లేకుండానే నా కళ్ళవెంబడి నీళ్ళు కారిపోతున్నయ్.

రావణాసురుడి బొమ్మ ప్రేలి పోయింది.

లోపల ఖాళీ - అసలా బొమ్మ ఉండే దన్న గుర్తు కూడా మిగలనంతటి శూన్యం! — ఆ రాజి నాకు మిగిల్చిం దల్లా పుట్టెడు దుఃఖం. ఆనాడు నా గదిలో తగిలించిన నా "రాక్షస చిత్రం" అంతే!





# జిజ్ఞాస సప్తకం

ఆ ఏడుగురు అన్వేషకులను గురించి వినటం అదే ఆఖరుసారి నాకు. బహుశా ఎవరికైనా గూడా అదే చివరి సారి అనుకుంటాను.

ఈ కథను నాకు ఒక గోసాయి చెప్పాడు. గోసాయిలదంతా ఒక జాతి. ఆ జాతి ఇప్పుడు క్రమంగా క్షీణించి పోతోంది. వారు నిరంతర సంచారులు. ఒక్క చోటా స్థిరంగా ఉండరు. ఒక చోటునుంచి మరొక చోటుకు, ఒక గురువును వదలి మరొక గురువుదగ్గరకు పోతుంటారు. భక్తి విశ్వాసాలతో గురువును సేవించుతారు. గురువుచెప్పే ఆత్మకధలను, అనుభవాలను, ఆధ్యాత్మిక పాఠాలను శ్రద్ధతో వింటారు. కాని ఆ సన్యాసులు సాధించేది మాత్రం శూన్యం. వారికి పెద్ద కోరికలుండవు. ఉన్నచోటనే ఉండటం వాళ్ళకు ఇష్టం. వాళ్లు పెద్ద పెద్ద గడ్డాలను పెంచుతారు. కానీ వాళ్ళ మాటల తీరు, చేష్టల వైఖరి ఆడవాళ్ళలా ఉంటాయి.

కాషాయ గుడ్డలను కట్టుకున్న సాధు

కాజ సుబ్బారావు

లంబోదర్ అనే సన్యాసి ఆ ఏడుగురు వృద్ధ అన్వేషకులకు ఒకసారి తటస్థ పడ్డాడు. అతనే నాకీ కథ చెప్పాడు.

"సత్యాన్వేషణకు వారు పనికిరారని ఖచ్చితంగా చెప్పాను. వాళ్ళు వృద్ధ జంబుకాలు. చాలా గొడవ మనుష్యులు. కాకపోతే విచిత్రవ్యక్తులు. అభిలాష ఉంటే చాలదు. సంకల్ప దీక్ష కావాలి. నిజమైన అన్వేషణ కావాలి. వాళ్ళు క్లబ్బులకే అంకితమై గాలికబుర్లు చెప్పుకుంటూ త్రాగుతూ పేకాటఆడుతూ ఉండటమే మంచిది.

"కానీ వాళ్ళు వినలేదు. 'దయచేసి దైవ సాన్నిధ్యానికి దగ్గరి దారి చూపగల ఏ వ్యక్తినైనా మాకు పరిచయం చెయ్,' అని మొరపెట్టుకున్నారు.

"ఆ పప్పులేం ఉడకవు. అడ్డదార్ల వ్యాపారం నా దగ్గర పనికిరాదు" నిర్మొహమాటంగా చెప్పాను. "నేను కొంతమంది నిష్కళంకమైన ఆధ్యాత్మిక బోద్ధకులను ఎరుగున్నాను. వాళ్ళల్లో ఒక్కరైనా మిమ్ములను శిష్యులుగా స్వీకరించి ఉపదేశించుతారని నాకు నమ్మకంలేదు. అదీగాక ఆ గురువు మీకు అడ్డుదారి చూపిస్తాడో కంటకాకీర్ణ మార్గం చూపిస్తాడో ఆయన ఇష్టం మీలో ఒకరికి ఒక దోవ చూపవచ్చు మరొకరికి అందుకు భిన్నమైన మార్గం చూపించ వచ్చు," అన్నాను.

"ఎందుకని?" బిత్తరబోయి అడిగారు వాళ్ళు." ప్రతి విషయంలోను మేమంతా సమానార్హతలు యోగ్యతలు గలవారం. మేము రిటైరైన మొదటి తరగతి అఫీసర్లము."

నేను నవ్వి చివాట్లు పెట్టాను. "మీరేమైనా కావచ్చు. మీ మొదటి తరగతితో నిమిత్తంలేదు. మీరు వంద వక్రమార్గాలు తొక్కవచ్చు. లేదా మీ యోగ్యతవల్లనే పైకి రావచ్చు. అది నా కనవసరం. నేను లెక్కచేయను. మీ తెలివితేటలుగాని మీరు చెప్పుకొనే యోగ్యతలుగాని గురువుముందు మీ స్థాయిని పెంచలేవు. ఎవరి పూర్వజన్మ సుకృతాన్ని బట్టి వారికి మార్గాలు నిర్దేశింపబడతాయి. 'పూర్వ జన్మ సుకృతమంటే తెలుసా? జన్మ జన్మాంత రాలవల్ల ఆత్మ పొందిన సంస్కృతి. మీలో ఒకరికి ఒక యేడాదిపాటు ఆధ్యాత్మిక గ్రంథాలను చదవమని ఆదేశించవచ్చు గురువుగారు. మరొకర్ని ఒక పుష్కరకాలం తన కాళ్ళను పిసుకుతూ గోవులను కాస్తూ ఉండమని శాసించవచ్చు. ఆధ్యాత్మిక గ్రంథాలను చదివేవాడు రెండోవాని కంటె మిన్న అని అనుకోరాదు."

నేను చెప్పింది వాళ్ళకు ఆశక్తి గలిగించినట్లుగాలేదు. వాళ్ళల్లో వాళ్ళు కూడబలుక్కొని నా చేతిలో ఒక వంద రూపాయల నోటును కుక్కారు. "తర్వాత ఇంకా ఇస్తాము. మాకు ఏదో

ఒకటి చేసి చూపించగల ఏ వ్యక్తి దగ్గరకైనా తీసుకెళ్ళి పరిచయంచెయ్." ప్రాధేయపడ్డారు.

"ఏం చేయాలి మీ కోసం? ఏం చూపించాలి మీకు?" అడిగాను.

"ఏదైనా సరే. మన్నుకి అగ్ని గోళాన్ని మింగటం. లేదా తాడును పాముగా మార్చటం. కాదా శూన్యంలో నుంచి ఏదైనా వస్తువును సృష్టించటం.... నా నడుము నొప్పిని పోగొట్టటం లాంటివి "

"లేదా నా బట్టతలను "

"కాకపోతే నా దృష్టి . కాదు కాదు.. మా దృష్టిమాంద్యాన్ని...."

నాకు వాళ్ళమీద గల అభిప్రాయం పూర్తిగా మారిపోయింది. వాళ్ళకోరికలు వాళ్ళు చెప్పిన దైవాన్వేషణాది మాటలకు విరుద్ధంగా ఉన్నవి.

"చూడండి. మీ నడుం నొప్పివల్ల ప్రమాదం లేదు. కొన్ని వనమూలికలతో నేనే నయం చేయగలను. కానీ మీ బట్టతలను బ్రహ్మదేవుడు కూడా బాగు చేయలేడు వెయ్యి సంవత్సరాల క్రిందట వ్రాసిన ఒకానొక వైద్య గ్రంధంలో ఇలా ఉంది: ఒక ఔన్సు మొసలి క్రొవ్వుకు నీటిగుర్రపు క్రొవ్వు ఒక ఔన్సు చేర్చి తాబేటిబొచ్చెలో కలిపి బాగా కలియబెట్టాలి. ఆ మిశ్రమాన్ని పద కొండు సంవత్సరాల పదకొండునెలల పదకొండు రోజులు మీ బట్టతలకేసి బాగా మర్దించాలి. అప్పుడు మీ తలమీదబొచ్చు ఆ మూడు జంతువులమీద మొలిచినట్లుగా విస్తారంగా పెరుగుతుంది . సరే, మిమ్మల్ని ఒక వ్యక్తి దగ్గరకు తీసుకెళ్ళ తాను. ఆయన దృష్టి లోపాన్ని బాగు చేయటమేగాక మీ కళ్ళకు ఒక విచిత్ర మైన చూపునిస్తాడు."

"విచిత్రమైన చూపంటే?"

"నిజానికి ఒకటిగాదు. అనేకరకాలైన వింత శక్తులన్నమాట. వాటిల్లో మీకు ఏది కావాలో కోరుకోండి. ఉదాహరణకు ఆయన మీకు కాసిని నీళ్ళు ఇస్తాడు. ఆ నీటిని మీ కళ్ళల్లో వేసుకుంటే మీకు భయమనేది ఉండదు పులి పిల్లిపిల్లగా కనబడుతుంది. రాక్షసి వినయవిధేయతలు గల బానిసగా కనబడుతుంది. మరొక రకమైన నీటితో మీ కళ్ళను పరిశుభ్రం చేస్తాడు. అప్పుడు ప్రపంచమంతా ఎంతో అందంగా కనబడుతుంది. అప్పుడు మీరు పంది పెదవులను ముద్దాడగలరు. ఒక పిశాచంతో ఒకే పక్కమీదపడుకోగలరు. ఇంకొక రకమైన నీటితో మరికొన్ని వింతలు చూడగలరు "

"ఎలా?"

"నేను చెప్పకుండా ఉండటమే మంచిది. మీరంతా గొప్పవారు. మంచి సంస్కృతి గలవారు. అలాంటి తుచ్ఛ వాంఛలను అనుభవించాలని కోరరు."

"ఏమైనా సరే. మేము వినితీరాలి"

"మీరు వినాలని అంతగా కుతూహల

పడుతుంటే చెప్తాను. వినండి. ఒకరకమైన నీటిని మీ కళ్ళల్లో వేసుకుంటే స్త్రీ పురుషులు ఎంత మంచి దుస్తులు ధరించి ఉన్నా దిగంబరులుగా కనబడతారు."

"దేవా, దేవా, దేవా!"

"ఇందులో దేవుడికి ఎలాంటి సంబంధము లేదని మీరు ముఖ్యంగా గమనించాలి. నిజంగా మీకు భగవంతుని మీద భక్తి, అన్వేషణాసక్తి ఉంటే మిమ్ములను మరొక "

"దేవుడియందు మాకు ఆసక్తి వుంది. ఈ వయస్సులో మేము కోరుకునేది మరేముంది? కానీ, మొదటిమెట్టుగా నీవు చెప్పే వ్యక్తిని మేము కలుసుకోవాలని వుంది ఆయన చేసే అద్భుత చర్యలు మా భక్తిని మరింత ఇనుమడింపచేస్తాయి. దేవునియందు గట్టి నమ్మకం ఏర్పడుతుంది మాకు "

"ఎన్నటికీకాదు. అద్భుతకృత్యాలు అద్భుతాలమీదనే నమ్మకం కలిగిస్తాయి. అదీగాక అవి మనిషిని తారుమారు చేస్తాయి. భ్రమింపచేస్తాయి. వాటిని అనుసరించిఉన్న అపాయాన్ని గుర్తించ లేరు. ముఖ్యంగా భగవంతునిమీద భక్తి లేనివారు చేస్తుంటే అవి వక్రిస్తాయి. నిష్కల్మషమైన సత్యాన్వేషకులు దేనినైనా ఆధారంగా పట్టుకొని ఉన్నత శిఖరాలను అందుకోగలరు. ఇది ఐహికులకు గూడా సాధ్యమే కానీ మీరంతా చిత్రమైన మనుష్యుల సముదాయం."

"బాగా అన్నావు. కానీ ఆ అద్భుత కార్యాలుచేసే వ్యక్తిని చూడాలనివుంది మాకు ఆయన దగ్గరకు తీసుకెళ్ళితే నీకెంతో ఋణపడి ఉంటాము. వినయ విధేయతలుగల సేవకులుగాఉంటాము." వాళ్ళు బాగా ఉద్రేకంగా ఉన్నారు. ఒక గంటసేపు నాతో వాదించారు.

నేను ఒప్పుకోక తప్పలేదు. నాకు చాల అర్జంటుగా డబ్బు కావలసిఉంది. అదీగాక హిడంబ బాబాను చూసి చాల కాలమైంది. ఆయన్ను కలుసుకోవాలని కొంతకాలం నుంచి అనుకుంటున్నాను. నేను ఇంకా నాలుగొందలు రూపాయలివ్వమన్నాను. పైకమంతా ఒక్కసారే ముందుగా ఇవ్వాలని గూడా కచ్చితంగా చెప్పాను. హిడంబ బాబాను చూచి ఆయన చేసే మాయలను కన్నులార గాంచిన తర్వాత ఇస్తామన్నారు.

"ఆ పప్పులేం ఉడకవు. ఇది వ్యాపారంగాదు. నన్ను నమ్మకపోతే పొండి," అన్నాను.

ఆ సాయంత్రమే అడిగిన డబ్బును నా చేతుల్లో పెట్టారు. తెల్లవారురూమున 'లువుర్వా'కొండలకు మేంబయలుదేరాం. ఆ కొండలమీద హిడంబబాబా నివాసం ఉంది ఆ మిత్ర బృందం ఆహారపొట్లాలను, మత్తు పానీయాల సీసాలను విరివిగా తెచ్చారు. నేను దారి చూపుతుంటే వారు ఒకరికొకరు మార్చుకుంటూ కారు నడుపుతున్నారు. దారి పొడుగునా సిద్ధులతో




నాకు గల పరిచయాలను కథలుగా చెప్పాను. వాళ్ల నిట్టూర్పులు విడిచి ఐహికవాంఛలతో కాలం వృథాపుచ్చినందుకు విచారించారు. పొంగి పొర్లి వస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకున్నాను.

ఒక చిన్న వీధి చివర మేము భోజనాలను ముగించాం. కాసేపువిశ్రాంతి తీసుకొని, మళ్ళీ రోడ్డునపడ్డాం. దారంతా ముళ్ళపొదలతోను, రాళ్ళగుట్టలతోను నిండి వుంది. జాగ్రత్తగా నెమ్మదిగా ముందుకు సాగాం. హిడంబ బాబా ఆశ్రమానికి చేరుకునేసరికి సాయంత్రమయింది. బాబా ప్రక్కన ఇద్దరు శిష్యులు కూర్చున్నారు. ఆయన మా వంక తీక్షణంగా చూచారు. ఆయన కళ్లు అగ్ని గోళాలులా ఉన్నాయ్. చీకటి కన్నంలో నుంచి చూస్తున్న పాముకళ్ళల్లా మండిపోతున్నాయి. నేను ఆయన పాదాలమీద పడి నమస్కారం చేశాను. మిగతావారు గూడా నన్ను అనుసరించారు.

"ఈ వృద్ధ జంబుకాలెవరు?" అరిచారు బాబా.

"సమాజంలో వారు గొప్పవారైనప్పటికీ మీకు విశ్వాసపాత్రులైన కుక్కలు. మీ పాదధూళికోసం ఇంత దూరం వచ్చారు. కనికరించండి, బాబాజీ. మీ కరుణాకటాక్షవీక్షణాలతో వాళ్లను పునీతులను చేయమని వేడుకొంటున్నాను," అన్నాను.

"ముందు వాళ్లను కాలువలో స్నానం చేయమని చెప్పు. ఇక్కడనుంచి వెంటనే తీసుకెళ్ళు, తప్పుడు గాడిద కొడకా."

మిత్ర బృందం భయంతో వణికి

పోయారు. వాళ్లకు ధైర్యం చెప్పి బాబా అన్న మాటలను లెక్కచేయవద్దన్నాను. మనమీద వాత్సల్యంతోనే ఆయన అలా మాట్లాడారు అన్నాను.

బాబా వారి ప్రత్యక్ష ఆధ్వర్యంలో మేము తృప్తిగా భోజనం చేశాం ఆ కాసేపట్లోనే బాబా శక్తిసామర్థ్యాలు వాళ్ళకు తెలిసివచ్చాయి. బాబా ఇచ్చిన పరిశుద్ధమైన వేడి వేడి పాలను తాగుతూ వాళ్ళు సంబరాలుపడ్డారు. ఎంతో రుచిగా వున్నవని సంతోషించారు. మరుక్షణంలో ఆ పాలు విషమయమయ్యాయని వాంతి చేసుకున్నారు. చాలసేపటివరకు వాళ్లకు మాటరాలేదు తర్వాత బాబా పాదాలమీద పడి, "బాబాజీ! మీ మహిమలు అపారం. మీశక్తి అనంతం. ఇంకొక వింతను చేసి చూపండి," అన్నారు. "మా కళ్ళతో అత్యద్భుత రహస్యాలను తిలకించే మంత్రజలాలను మా కిప్పించండి." అని ప్రాధేయపడ్డారు.

"అవును, బాబాజీ! వారి కోరిక తీర్చ మని వేడుకొంటున్నాను," అన్నాను.

"సరే. ఇప్పుడు మీకొక రకమైన నీటిని ఇస్తాను అది పుచ్చుకుంటే గాఢ నిద్రలో మునిగిపోతారు మీరు." అను గ్రహించారు బాబా.

"లేదా మంచి చూపును ప్రసాదించు, బాబాజీ," అన్నాను.

మిత్రబృందం క్షణం మౌనంగా కూర్చున్నారు. తర్వాత వారిలో ఒకరు ఇల్లా అన్నాడు. "బాబాజీ! మీరు ఉదారులు. ఇంకొక రకమైన నీళ్ళ సంగతేమిటి?"

"బాబాజీ! పెద్దపులి పిల్లిపిల్లలా కనబడే మంత్రజలాలను గూర్చి చెప్పాను," అన్నాను నేను.

"అలా ఎందుకు చెప్పావు?" అరిచాడు బాబా, అగ్నిగోళాల్లాంటి గుడ్లను తిప్పుతూ. కానీ ఆయనకు నా మీద నిజంగా కోపంలేదని నాకు తెలుసు.

"బాబాజీ! పురుగుల్లో పురుగు తమ అనుగ్రహం సంపాదించటానికి వంద తప్పులు చేస్తాడు,"అన్నాను వినయంగా.

ఆ అన్వేషకులు తమలో తాము సంప్రదించుకున్నారు. ఆ తర్వాత వారిలో ఒకరు నన్ను చూస్తూ ఇలా అన్నాడు: "ఇంకొక రకమైన నీళ్ళను గురించి గూడా నీవు మాతో చెప్పలేదా?"

"చెప్పాను. ప్రపంచంలో ప్రతి వస్తువు అందంగా కనబడేట్లు చేయగల నీటిని గూర్చి గూడా చెప్పాను." అన్నాను.

అన్వేషకులు క్షణం నిశ్శబ్దం వహించారు. మరొకడు లేచి "మరొక రకమైన " ఏదో అనబోయాడు.

"జనమంతా దిగంబరులుగా కనబడే నీళ్ళు? పోకిరి వెధవల్లారా!" హిడంబ బాబా అరిచారు. ఈసారి నిజంగానే చీదరించుకున్నాడు

మిత్రబృందం చేతులు ముడుచుకొని

ఆ తిట్లను మౌనంగా భరించారు. వాళ్ల ప్రవర్తన గురించి నాకెలాంటి భ్రమలు లేకపోయినా వాళ్ళు అలా సిగ్గు ఎగ్గు లేకుండా అడగటంచూస్తే నాకే అసహ్యమనిపించింది. ఆ వయస్సులో ఏ ప్రయోజనంలేని ఆ కోరిక గలిగినందుకు మిక్కిలి గర్హించాను.

"సరే. ఈ విధంగా నావల్ల లాభం పొందదల్చారన్న మాట! ఈ అడ్డగాడిద లంబోదర్‌ను చూచి అనుగ్రహిస్తున్నాను మీరు కోరిన నీళ్ళను ఇస్తాను. నాకేం ఇస్తారు?" అన్నారు హిడంబ బాబా.

వాళ్ళు మెల్లగాకూడబలుక్కున్నారు. కరెన్సీనోట్లకట్టను తీసి హిడంబ బాబా ముందుంచారు. బహుశా వెయ్యి రూపాయలు ఉండవచ్చు. వెంటనే బాబా ఒక సేవకుడ్ని పిలిచారు. వాడు ఒక చిన్న దయ్యంలా ఉన్నాడు. రహస్యంగా వాడికి కొన్ని సంకేతాలనిచ్చారు. వాడు మరుక్షణం మాయమై ఐదు నిమిషాల్లో ఒక చిన్న పసుపు పచ్చని సీసాతో తిరిగి వచ్చాడు

"ఈ సీసా తీసుకోండి. ఒక్కొక్క కంటిలో ఒక చుక్క కంటె ఎక్కువ వేసుకోకూడదు. మొదటి అయిదు నిమిషాల వరకు మీకేమీ కనబడదు. ఆ తర్వాత చూస్తారు. దాని మహిమ ఒక గంట మాత్రమే ఉంటుంది. రెండుబొట్లు వేసుకుంటే రెండు గంటలుంటుంది. కానీ రెండు చుక్కలకంటె ఎక్కువ వేసుకుండేరు, వెధవల్లారా?"

"వేసుకోం. మిగిలిన నీటిని మరొకసారి ఉపయోగిస్తాం."

"అలా పనిచేయదు. అది ఒకే ఒకసారి ఇప్పటినుండి ఇరవై నాలుగు గంటల్లోగా పనిచేస్తుంది. కావలసిన దానికంటె కొంచెం ఎక్కువగా ఇచ్చాను. పొరపాటున వృధా అయితే భర్తీచేయటానికి.... ఇకపొండి వెధవల్లారా! తెల్లవారితే మీ వెధవ ముఖాలను నేను చూడలేను."

వాళ్లల్లో ఇద్దరు ఆ రాత్రి కారులో సర్దుకొని నిద్రపోయారు. మిగతావారు దాపునున్న గుడిశలో పడుకున్నారు. అర్ధరాత్రిదాకా బాబాతో నా స్వంత విషయాలు మాట్లాడాను తెల్లవారక ముందే వాళ్ళను లేపి లువుర్వా కొండల నుంచి బయలుదేరాం.

"నిజంగా ఈ నీళ్ళు పనిచేస్తాయంటావా?" అడిగారు నన్ను దారిలో. పగటి వెలుగు వాళ్ళల్లో అనుమానాలను రేకెత్తించింది.

"ప్రయత్నించి చూడండి" అన్నాను ముభావంగా.

"ఇప్పుడా? నీ అందాన్ని నగ్నంగా చూడటానికా?" పగలబడి నవ్వారు.

"ఒక్కసారి కంటె పనిచేయవని బాబా చెప్పలేదా?" అన్నారు.

నేను మాట్లాడలేదు. నా మనస్సు

బాగా లదు. విరి మూలంగా నా పాపాల పట్టీకి మరొక పాపాన్ని చేర్చాను. వీళ్ళను ఎంత త్వరగా వదిలించుకుంటే అంత మంచిదనుకున్నాను.

ఊరు ముందుకు చేరుకోగానే పక్క వీధిలో ఒక స్నేహితుడ్ని చూడటానికి దిగిపోతానన్నాను. అర్ధోక్తిలో వాళ్ళు ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు.

"అదేం కుదరదు అలా నిన్ను పోనివ్వం," అన్నారు. ఆ మాటలు, వాళ్ళు మాట్లాడిన తీరు చూసేసరికి నాకు కోపం వచ్చింది. "నేను దిగిపోవాలి." గట్టిగా అరిచాను. "కానీ మేము నిన్ను వదలం" అంటూ నా చేతులు గట్టిగా పట్టుకున్నారు. అనుమాన పిశాచపు నైత్యాన్ని దౌర్జన్యాన్ని అంత నగ్నంగా మున్నెన్నడూ చూడలేదు నేను.

మిగతా ప్రయాణం మౌనంగా సాగించాను. వాళ్ళు హాస్యంగా మాట్లాడి నన్ను శాంతపర్చటానికి ప్రయత్నించారు. కానీ నేను లొంగలేదు. మేము ఊళ్ళోకి చేరుకునేసరికి సాయింత్రమయింది.

వాళ్ళు నన్ను క్లబ్బుకు తీసుకెళ్ళి ఒక గదిలో పెట్టి తాళంవేశారు. రెండు గంటల తర్వాత తిరిగి వచ్చారు.

వాళ్ళు ఆనందంగా అమితోత్సాహంగా ఉన్నారు. అక్కడ నుంచి 'హోటల్ హసీ'కి కార్లో వెళ్ళాం. పుష్టిగా భోజనం చేసింతర్వాత పీకలవరకు వాళ్ళు తాగారు. "మన మంత్రాన్ని ఎప్పుడు ప్రయోగిద్దాం?" అన్నాడు ఒకడు.

"ఎప్పుడో ఎందుకు? ఇప్పుడే ఎందుకు కాకూడదు?" అన్నాడు మరొకడు. వెంటనే పసుపుపచ్చని సీసాతీసి నా ముందుంచారు. "ఆ నీళ్ళ చుక్కలను మా కళ్ళల్లో వెయ్," అని ఆజ్ఞాపించారు. నేను సమ్మతించలేదు. విముఖత చూపాను. మాట వినకపోతే కార్లో నన్ను కాలవదాకా తీసుకెళ్ళి బ్రిడ్జి మీదనుంచి నీళ్ళలోకి తోస్తామని బెదిరించారు. 'సరే' నంటూ లేచి ఒక్కొక్కరి కళ్ళల్లో రెండు రెండు బొట్లు వేశాను.

వాళ్ళు నిశ్చలంగా కూర్చున్నారు. కళ్ళను తెరవలేకుండా ఉన్నారు. అందులో ఒకడు పెనుగులాడి అతి కష్టంతో కళ్ళు తెర్చి వణుకుతున్న కంఠంతో ఉద్రేకంగా అరిచాడు "నిజం. అది నిజం" అని.

వెంటనే మిగతా వాళ్ళు కళ్ళు నులుముకొని రెప్పలు ఆడిస్తూ సంభ్రమాశ్చర్యాలతో అరిచారు.

"అంత తొందరెందుకు? మీ చూపు దెబ్బతినవచ్చు. కళ్ళు మూసుకొని అయిదు నిమిషాలు కూర్చోండి. ఏమైనా మీరు నరకకూపంలో ఒక గంట గడుపుతారు గదా!" అన్నాను.

"ఒక గంట కాలమే ఉండటం ఎంత దురదృష్టకరం?" విచారించాడు ఒకడు.




"ఒక గంట ఏం కర్మ? రెండు గంటలు అనుభవిద్దాం!" అన్నాడు మరొకడు. ఇంకోసారి ఆ నీటి బొట్లను వారి కళ్ళల్లో వేయమన్నారు నన్ను. నేను గొణుక్కుంటూ వాళ్ళు చెప్పినట్లు చేశాను.

"ఇంకా ఎన్ని నీళ్ళున్నాయి?" ఇంకొకడు అన్నాడు. "మరో రెండు చుక్కలను వేసుకుంటే మూడు గంటల దాకా పనిచేస్తుంది గదా. మిగిలిన నీళ్ళు తర్వాత ఎందుకూ పనికిరావని హిడంబ బాబా చెప్పలా?"

"కానీ నాలుగు బొట్లకంటే ఎక్కువ వాడకూడదని గూడా బాబా చెప్పారు." అన్నాను.

"ఫర్వాలేదు. మేం చెప్పినట్లు చెయ్. లేదా బ్రిడ్జి క్రింద నీరంతా నీదే!" అన్నారు.

"సరే. రండి" అంటూ లేచాను. వాళ్ళు ముసి ముసి నవ్వులు విసురుకున్నారు నన్ను చూసి వాళ్ళకు వింతగా కనబడి వుండవచ్చు నేను. సీసాలో మిగిలిన నీళ్ళను వాళ్ళ కళ్ళల్లో వేశాను. ఖాళీ సీసాను కిటికీలో నుంచి వీధిలోకి గిరాటేశాను వాళ్ళు కళ్ళు మూసుకొని నిశ్చలంగా కూర్చున్నారు.

నేను గదిలోనుంచి వీధిలోకి వెళ్ళాను. హోటల్ ముందు పచార్లు చేస్తూ వాళ్ళల్లో ఏవైనా మార్పులు వస్తాయేమోనని గమనిస్తున్నారు. మరుక్షణంలో ఒక పొలికేక నా గుండెల నుండి దూసుకెళ్ళింది. ఆ తర్వాత

గంద్రగోళంగా అరుపులు. వీధిలో వెళ్ళేజనం ఆగిపోయారు. వందల సంఖ్యలో హోటల్ ముందు గుమి గూడారు ఒకరి ముఖాలు ఒకరు చూచు కుంటున్నారు. అసలు ఏం జరిగిందో ఎవ్వరికీ తెలియదు.

సప్త స్నేహితుల్లో ఒకరు గుండె జబ్బు మనిషి. కుర్చీలో కూర్చున్నవాడు కూర్చున్నట్లే ప్రాణం విడిచాడు. ఇద్దరు మూర్ఛపోయారు. మిగతావారు గగ్గోలగా పారిపోవటానికి ప్రయత్ని స్తున్నారు. వాళ్ళ దగ్గరకు ఎవరు వెళ్ళినా తప్పించుకు పారిపోతున్నారు. చివరకు వాళ్ళు పట్టుబడ్డారు.

ఈ వింత సంఘటన గూర్చి పోలీ సులు ఎంత ఆచూకి తీసినా ఫలితం లేకపోయింది. హోటల్లోని ఆహారాన్ని తినుబండారాలను మత్తుపదార్థాలను పరీక్షలు జరిపించారు. ఉపయోగం లేక పోయింది. ఈ సంఘటనతో నాకు సంబంధం ఉన్నట్లు ఎవరికీ తెలియక పోవటం నా అదృష్టం. మాకు సర్వ్ చేసిన వెయిటర్ నేనంటే పడిచస్తాడు. నా ఉనికి వాడు ఎవరితోను చెప్పలేదు.

కొంతసేపటికి జిజ్ఞాస సప్తకంలో చాలమంది పిచ్చి ఆసుపత్రిలో చేరారు. చివర వరకు తన కుమారుని వద్దే ఉన్న ఒక జిజ్ఞాసువు ఉలుకు పలుకు లేకుండా కూర్చున్నాడు.

తర్వాత అసలు రహస్యాన్ని హిడంబ బాబా నాకు చెప్పారు. మూడవ సారి వేయటంలో వారి దృష్టిలో గుణా ధికమైన మార్పు వచ్చింది. వాళ్ళు కళ్ళు తెరచి చూచేసరికి దిగంబరులైన మానవులే గాక రక్తమాంసాలు లేని అస్థిపంజరాలను చూశారు. శతాధికమైన అస్థిపంజరాలు వాళ్ళ చుట్టూ నృత్యం చేస్తున్నాయి. భయంతో బజారున పడ్డారు. అక్కడ కూడా అంతే. అస్థిపంజరాలు కార్లు నడుపుతున్నాయి. అస్థి పంజరాలు పత్రికలను విక్ర యిస్తున్నాయి. తమను పట్టుకోడానికి అస్థిపంజరాలు వాళ్ళను చుట్టు ముట్టు తున్నాయి. అస్థిపంజరాలు పళ్ళుతెరచి ఇకిలిస్తున్నాయి.

లంబోదర్ కథ పూర్తిచేశాడు.

కొన్ని సంవత్సరాలు క్రిందట ఒక పోష్ హోటల్లో కొందరు వృద్ధులు హఠాత్తుగా పిచ్చివారై తిరగబడినట్లు పత్రికలలో వచ్చినవార్త జ్ఞాపకమున్న వాళ్ళకు ఈ కథలో నిజానిజాలు ఎలా వున్నా లంబోదర్ చెప్పిన కథ కుతూ హలం కలిగించవచ్చు.

ఆంగ్లమూలం : శ్రీ మనోజ్ దాస్
(సాహిత్య అకాదమీ అవార్డు గ్రహీత)

# సూత్రాశ్రమం

—బైరాగి

కత్తి వంటిది తార్కిక బుద్ధి.
ఇరు వంకల పదునుగల వంకర కత్తివంటిది.
అటంకాల సహియించని అహంకారం.
సుత్తి వంటిది విశ్వాసం

రెండూ డీకొనిన వేళ విప్లవ విలయ విస్ఫులింగ మహాసారం
సృష్టికావ్యనవాశ్వాసమహోచ్ఛ్వాసం.
తార్కిక శిలల నిర్జల, సంకట సంకుల భూమి
సామాన్య కుసుమకన్యల నెలవు కాదు

శూలాగ్రాల శయనించే అశరీర దివ్యాప్సరలు
(కల్పనా కోమల హంసతూలికల తల్పంమీద కాదు)
అసిధారా ప్రఖర తీక్ష్ణ మేధాగంధ వీచికలపై నర్తిస్తారు.
కాని వారి ఆ అందం అందరి కొరకు కాదు.

రొమాన్సుల రోమాంచాలు
లలనా క్రమస్తనస్తబక కలనా నమ్ర తనూ వల్లరీ వేల్లిత
ప్రాబంధిక ప్రణయ నికుంజాల నీడ
మానవ మాంసగంధ మాదన పర్వతాల బంగరు విరుల మరులవాడ

ప్రబంధాల లలిత పదబంధాలు
భావంలేని చీకటిలో మాటల బాణసంచాలు
ఇవి అందరికీ అందే ఆనందాలు.
త్రోవ తేలిక కౌగిలినుంచి మంచం వరకు
ఆకలి నుంచి కంచం వరకు.

సూత్రాశ్రమ సత్రశమాధ్వం అందరి కొరకు కాదు.
శుభ్ర విద్యుత్ కాంతిలో శస్త్రకారుని శస్త్రం నవ్విన అందం
స్వష్ఠ శ్వాసలాగ, ఎర్రని మూసలోన పారే లోహపు అందం
కనుచూపుల కనుమ దాటి, మింటిని ఒంటరిగా
పయనించే ఇనుప వేగ తెల్లని రెక్కల అందం,
డీనుస్విఫ్ట్, అనటోల్‌ఫ్రాంసుల వంకర వ్యంగ్యపు టందం అందరిదీ కాదు.

హిమాలయపు వాయొలిన్‌పై మంచు తుఫానుల కమానురేపిన మహోగ్ర సంగీతం
సహారా ఎడారిలోన పవలు కురిసే సూర్యుని తప్త హేమజ్వాల
రేయి కురిసే తారికల ప్రఖర ప్రోజ్వల హిమజ్వాల.

సాగరాలు, భూధరాలు, ఊహల కాననాలు,
ఆవేదన అనంతంలో మానవ హృదయ గ్రహగోళాలు
ఎవడైనా 'కవిత ఇద మిత్థమ'ని అంటే
గోష్పదమంత నీటిలో మునిగి చావమన వలదా?

ఇసుకను చూచి బెదరే రసికులకు
సులభాశయ జలాశయాలు కనుపించాలి.
సెలల అలల కలకలాలు వినిపించాలి.

పాపం, వారికేమి తెలుసు, ఇసుకలోనే దాగిఉంది,
మానవాత్మల మహాతీర్థం –
దురవగాహ పుణ్యాంతర్వాహిని
సరస్వతి –

(* త్రిపురనేని రామస్వామి చౌదరి యిల్లు)




"ఈ పద్ధతేం బాగులేదండి," అంది రాజ్యం ఉదయాన్నే భర్తకు కాఫీ యిస్తూ. గిరేం ఆశ్చర్యపోలేదు. ఆమె చెప్పదల్చుకున్నదాని మీద అప్పుడే గత నెలరోజులుగా తర్జనభర్జనలు జరుగుతున్నాయి.

"అయితే యేం చేద్దామంటావు?" భార్య మాటలకు చిరాకేసి అడిగాడు.

"యెవర్నో కూలివాడ్ని పెట్టి తీయించేస్తే సరి," అంది పట్టుదలగా.

"పోనీ నువ్వే ప్రయత్నించు యెవర్నైనా కూలివాడ్ని," అన్నాడు నవ్వి.

"నేను వొకరిద్దర్ని ప్రయత్నించాను. కానీ కుదరలేదు. యెక్కువ డబ్బిస్తామన్నా చెయ్యమనేసారు." అంది రాజ్యం

"నిజంగా వాళ్ళు దేవుడికన్నా గొప్పవారే .."

"ఆపండి మీ పొగడ్తలు. చూడండి యింకా తెల్లవారిందో లేదో యెత తొక్కు పోగడిందో," అంది పెచ్చు

లాడిన గచ్చువేపు చూస్తూ. గత రాత్రి వర్షానికి గది కారి గచ్చు చెమ్మగావుంది. గిరి కూడా చూసాడు. నిజమే!

అదే సమయానికి పిచ్చుకలు రెండు కిటికీలోనుండి గడ్డిపోచల్ని ముక్కున కరచుకొని గదిలో దూలం సందులోకి దూరాయి.

గిరి గుమస్తా వుద్యోగం చేస్తున్నాడు. అద్దె యింట్లోనే చాలా కాలంగా వుంటున్నాడు. చాలా పాత యిల్లు అది. ముందు వొకగది. వంటిల్లు. వర్షం వస్తే కారుతుంది. 'సూర్యచంద్రులు ప్రత్యక్ష మవుతున్నారమ్మా కాస్త బాగుచేయించు' అంటే, యింటిగలామె వినదు. అలాగ యినా వారు ఖాళీ చేస్తే, అద్దె పెంచి యింకొకరికి యివ్వవచ్చని ఆమె ఆలోచన. ఉద్యోగంకన్నా యిల్లు దొరకటం కష్టమయిపోతున్నది ఆ పట్టణంలో. అందుకనేయెలాగోసర్దుకు పోవటం నేర్చుకున్నారు, ఆ దంపతులు యిద్దరి పిల్లలతో.

ముందు గది అంత పెద్దది కాకపోయినా, అదే వాళ్ళకు బెడ్‌రూమ్, రీడింగ్ రూమ్ వగైరా.... వగైరా .. వున్న వొక మంచం వర్షం వచ్చినా కురవని చోట వొకమూలగా అమర్చింది. అంతేకాక పిల్లల పుస్తకాలు, బట్టల దండెం, మాసిన బట్టల బుట్ట, కోడువిరిగి పోయిన కుర్చీ, పొట్టి స్టూలు యివన్నీ పొందికగా అమర్చింది, రాజ్యం. కానీ నెల రోజులుగా కొత్త బెడద వచ్చి పడింది.

మంచానికి మీదనే దూలం వుంటే, ఆ సందులో రెండు పిచ్చుకలు గడ్డి పోచలూ, చెత్తా చెదారంతో గూడు కట్టు కుంటున్నాయి. ఆ సందర్భంలో చెత్తా చెదారం, అంతా మంచంమీదనూ, గాలి కెగిరి గచ్చుమీదనూ పడి గలీజుగా తయారవుతున్నది గది. రాజ్యంకు యేమీ పాలుపోలేదు. యెలా మార్చినా, మంచం మీద పడక తప్పదు. సర్ఫులో వుతికిన తెల్లదుప్పటి అసహ్యంగా తయారవు తోంది. పిల్లలు ఉదయం, మధ్యాహ్నం పిచ్చుకలు ఎగరటం, అవి చేస్తున్న పనులు చూడటం తప్ప చదవటం మానేసారు. పిచ్చుకలకు పిడికెళ్ళతో బియ్యం, కిటికీ అంచున వేస్తున్నారు. అవి ముక్కున కరచుకొని తినటం వాళ్ళకి వినోదంగా వుంది. రాజ్యంకు యిల్లు యేమాత్రం అపరిశుభ్రంగావున్నా సహించదు. అవి రాలుస్తున్న చెత్తా చెదారాన్ని తుడవలేక విసిగెత్తి పోతున్నది రాజ్యం.

అందుకనే భర్తతో ఉదయం గట్టిగానే చెప్పింది. పిచ్చుకల కివేమీ పట్టనట్లుగా వాటి భాషలో అరచుకుంటున్నాయి.

"వొకపని చేద్దాం రాజ్యం," అన్నాడు కాఫీ త్రాగి కప్పు పక్కన బెడుతూ. రాజ్యం ఆశతో భర్తవేపు చూసింది, యేమిటన్నట్లుగా.

"తొందరగా యిల్లు మార్చేద్దాం," అన్నాడు సీరియస్‌గా.

"తలపాగా చుట్టలేక తలవంక రన్నారట వెనకటికొకరు అలా వుంది మీ ఆలోచన." అంది కోపంగా.

"దేశంలో యెంతమంది. పేవ్‌మెంట్ల మీద, చెట్లకింద, మురికిపేటల్లోనూ, మేడల నీడలకింద, యెండకు యెండుతూ చలికి వణుకుతూ యెంత నికృష్టంగా బ్రతుకుతున్నారో! యెవ్వరూ వీళ్ళకి ఆశ్రయ మివ్వటంలేదు. మనలాంటి దిగువ మాధ్యమిక తరగతి వాళ్ళం, సానుభూతి తప్ప మరేసహాయం చేయలేం వాళ్ళకి. మనవి చాలీ చాలని బ్రతుకులు. కానీ ఆ రెండు పిచ్చుకలకు మనం ఆ మాత్రం ఆశ్రయం, అంటే, మనం నివసించే యింట్లో దూలంమీద జానెడు చోటుయివ్వలేమా ఆలోచించు,"అన్నాడు షేవింగుసెట్టు నుండి బ్లేడు బయటకు తీస్తూ.

మరి మాట్లాడలేకపోయింది రాజ్యం. భర్తకెంత చెప్పినా చెవిటి వాడి ముందు శంఖం వూదినట్లే. ఆమె మనస్సు శూన్యమైపోయింది.

భర్తని ఆఫీసుకు, పిల్లల్ని బడికి పంపించిన తరువాత ముందుగదిలో కాస్త సేపు నడుం చేరవేసింది. పిచ్చుకలు తుర్రుమని చప్పుడుచేసుకుంటూ ఎగిరే శబ్దాలు, అవి పొరపాటున గూడు కట్టుకోబోయి జారవిడిచే గడ్డిపోచలూ రాజ్యానికి నిద్రపట్టనివ్వలేదు. యెక్కడా యిళ్ళులేనట్లు ఈ యింట్లోనే కట్టుకోవాలా! దరిద్రం పక్షులు. పట్టరాని కోపంతో అదిలించింది. కిటికీ తలుపులు వేసింది. కానీ పుచ్చిపోయిన ఆ కిటికీ తొర్ర లోంచి పిచ్చుకలు రావటం ఆపలేక పోయింది. యింక భరించలేకపోయింది వాటి చర్యలని రాజ్యం.

సాయంకాలం పిల్లలు రవీ, శాంతీ స్కూలునుండి వచ్చిన తరువాత కాఫీలు యిచ్చి వాళ్ళని ఆటకి పంపించేసి, పొరుగింటి వాళ్ళింట్లో నుండి నిచ్చెన తెచ్చింది. యింకా ఎండ కరిగిపోలేదు. పిచ్చుకల అలికిడి కన్పించలేదు. నెమ్మదిగా దూలంకు చేరవేసింది నిచ్చెన.

'ఈ రోజుతో పీడా విరిగిపోతుందీ పిచ్చుకల బెడద,' అని అనుకుంటూ దూలంలోకి తొంగి చూచింది, చెయ్యి పెట్టబోయి. అంతే! షాక్ తిన్నట్లుగా చెయ్యి వెనక్కు తీసేసుకుంది. అందులో పచ్చని మాంసం ముద్దల్లా పిచ్చుకపిల్లలు పీలగా అరుస్తున్నాయి. ఆమెకు తన పిల్లలు పొత్తిళ్ళలో వుండే దృశ్యాలు జ్ఞాపకం వచ్చాయి. మాతృహృదయం యెక్కడో కలుక్కుమంది. మెట్లుయెలా దిగిందో రాజ్యానికి గుర్తులేదు. యింతలో కూతురు శాంతి యేడుస్తూ గదిలోకి వచ్చింది.

"యేమమ్మా యేడుస్తున్నావ్?" అడిగింది రాజ్యం స్పృహలోకి వచ్చి.

''మరేనమ్మా నేను ఇసుకతో పిచ్చికగూడు కట్టుకుంటే, అన్నయ్య వాళ్ళూ కాలుతో మట్టేశారమ్మా,'' అంది. కిటికీలో నుండి చూసింది రాజ్యం. యెదురింటివాళ్ళు పెద్ద భవనం కడుతున్నారు. దాని కోసం పోసిన యిసక దిబ్బల మీద పగిలిపోయిన యిసకగూళ్లు కనిపిస్తున్నాయి.

"నేను కోప్పడుతాలే తల్లీ నువ్వు పోయి చదువుకో" అంటూ, విచ్చేన యివ్వడానికి పొరుగింటికి వెళ్ళింది.

* * *

ఆదివారం గిరికి శలవురోజు రాజ్యం ప్రవర్తనలో కొంచెంమార్పు కనిపించింది గిరికి. రోజూ వేసే పిచ్చుకలమీద గ్రామ ఫోన్ రికార్డు వేయలేదు పైగా తనే స్వయంగా బియ్యం తెచ్చి కిటికీ అంచున వేసింది మౌనంగా గమనిస్తున్నాడు గిరి

"యేమిటి రాజ్యం? నీలో యివాళ వింత మార్పు కనిపిస్తోంది," అన్నాడు మధ్యాహ్నం ముందు గదిలో రెస్ట్ తీసుకుంటూ. తమలపాకులకు సున్నం రాస్తున్న రాజ్యం కళ్ళలో నీరు తిరిగింది గుండె చిక్కబట్టుకుని ముందు రోజు జరిగిన సంఘటన చెప్పింది

"పోనీలే రాజ్యం, నీలో యిలాంటి పరివర్తన కలిగినందుకు నాకు చాలా సంతోషం వేస్తున్నది," అంటూ మంచం మీద దిండు క్రిందకు తెచ్చుకుని పడుకుని దూలం వేపు చూసాడు. పిచ్చుకలు గూడుకట్టడంలో లీనమైపోయి వున్నాయి. రాజ్యం గూడా గిరి ప్రక్కనే నడుం వాల్చింది ఆమెకు గూడా అదే దృశ్యం కన్పించింది మరో ఐదు నిమిషాలు గడిచాయి మధ్యాహ్నపు యెండ, మంచ మీద ఏటవాలుగా పడుతోంది కిటికీ గుండా.

"రాజ్యం, నిద్ర పోతున్నావా?" అడిగాడు.

"లేదండి," అని భర్తవేపు తిరిగింది.

"యీ మానవ జన్మంత నికృష్టమైన జన్మ మరొకటి లేదు." అన్నాడు

"అదేమిటండీ: అలాగంటారు. పూర్వ జన్మలో యెంతో పుణ్యం చేసుకుంటేగానీ మానవజన్మ లభించదంటారు మీరేమో " అర్థోక్తిలో ఆగిపోయింది

"యేం పుణ్యమో చూడా పక్షుల్ని స్వేచ్ఛగా తినడానికి మాత్రం ఆహారం సంపాదించుకుంటున్నాయి. నిరంతర కృషితో వాటి కొక గూడు నిర్మించుకుంటున్నాయి వాటిలో అంతస్థులభేదాలు లేవు కీచులాటలు లేవు. సంఘర్షణలు లేవు కానీ మరి మన మానవజీవితాలలో బ్రతికినంతకాలం తిండికీ, గుడ్డకు, గూడుకీ కాకుండా, ప్రతి చిన్నవిషయానికి ఆరాటం, పోరాటం తప్పదు "

"మరి యిదేనండి సృష్టి విచిత్రం " అంది పెద్ద ఆరిందలా రాజ్యం

"సృష్టి విచిత్రం కాదు. స్వార్థమానవ సమాజం వాళ్ళ కోసం నిర్మించుకుంటున్న స్వర్గం" అన్నాడు కోపంగా

"తను సుఖపడాలని కోరుకోవటం తప్పాండీ," అంది అమాయకంగా

"తప్పులేదు కానీ యెలా! యితరులను దోపిడీ చేసా? అవసరాలకు మించి యెక్కువ ఆదాచేయటం, ఆకాశాల్నంటే అంతస్థుల భవనాలు, అర్థం పర్థం లేకుండా కట్టుకోవటం, యిన్ని చేసినా ఆ వ్యక్తి ప్రాణాలు పోతున్నపుడు బయట కీడ్చేస్తారు నిర్దాక్షిణ్యంగా" అన్నాడు ఆవేశంగా

"పోన్లెద్దురూ! యింతకీ వాట్లో భర్త ఎవరు? భార్య ఎవరు?" అడిగింది సంభాషణ మార్చాలన్న ఉద్దేశ్యంతో మంచంమీద సూర్యకిరణాలు పడుతున్నాయి. వాటిమీద పిచ్చుకలు గెంతుతూ మళ్లా తుర్రుమని దూలం మీదకు ఎగిరిపోతున్నాయి

"యిప్పుడు చూడు," అన్నాడు. రాజ్యం కళ్లింతలు చేసుకుని వాటికేసి చూసింది అవి రెండూ సరాగాలాడుకుంటున్నాయి సిగ్గుతో భర్త వక్షస్థలం మీద వాలిపోయింది రాజ్యం

"చూసావా! సృష్టి రహస్యానికి ప్రాణం పోస్తున్నా యవి," అన్నాడు ఆమె నుదురు ముద్దుపెట్టుకుంటూ

"యేమండీ! మనం గూడా యిల్లు కట్టుకుంటే," అతని గాఢ పరిష్వంగం నుండి విడిపించుకుంటూ.

"మనమా! యిల్లా " నవ్వేశాడు. ఆశ్చర్యంగా చూసింది రాజ్యం.

"ఈ పిల్ల లిద్దరికే యింత కడుపు నిండా తిండిపెట్టి వాళ్ల జీవితానికో దారి చూపించగలిగితే" అన్నాడు నిరుత్సాహంగా.

"నిజమేనండి! పోనీ నే నేదయినా ఉద్యోగం చేద్దామంటే మా నాన్న నాకు అట్టే ఎక్కువ చదువు చెప్పించలేదు," అంది నిరుత్సాహంగా

"నాకు తెలిసినంతవరకూ మా వంశంలో యెవ్వరూ స్వంతయిల్లు కట్టుకుని వున్నట్లు మా నాన్న చెప్పలేదు. మా చిన్నప్పుడు ఒక అద్దె యింట్లో వుండేవాళ్లం అదొక రెక్క పడి విరిగిపోయిన యిల్లు. అందులోనే మా నాన్న రిటైరయ్యాడు. తర్వాత నెలలోనే చచ్చిపోతే, ఆ యిల్లుగల ఆసామీ, యింట్లో వున్న చెంబూ, గిన్నె, విలువ యివ వస్తువులూ తీసుకొని నన్నూ, అమ్మనీ కురుస్తున్న వర్షంలో గెంటేసాడు," అన్నాడు. అతని కళ్లు చెమర్చాయి

మళ్ళా పిచ్చుకలు తుర్రుమన్నాయి. మరో క్షణంలో ముక్కున గడ్డిపోచలు కరచుకుని గూడుకు చేరుకున్నాయి వాటి ప్రయత్నంలో యేదో సందేశం మెరుపులా గిరి మస్తిష్కంలో మెరిసింది మళ్లా రెండు పిచ్చుకలు బయటి కెళ్ళిపోయాయి

"నువ్వు చెప్పింది గూడా నిజమే రాజ్యం మనం స్వంతంగా యిల్లు కట్టుకుందాం," అన్నాడు లేచి కూర్చుని.

భర్త మాటలకు ఆశ్చర్యపోలేదు. గిరి పట్టుదల ఆమెకు తెలుసు ఆమెలో కాంతి రేఖలు తళుక్కుమన్నాయి

"మనం యెలాంటి యిల్లు కట్టుకుందామంటారు," అడిగింది

ఒక చిన్న యిల్లు" రెండుచేతులతో అభినయించి చెప్పాడు, వంగుని ఆమె రెండు చెంపల్ని తాకుతూ

కిటికీ తలుపు రెక్కమీద పిచ్చుక వూరికే గొడవ చేస్తోంది ఆరాటపడిపోతున్నది అటూ, ఇటూ చూస్తోంది

"యెందుకండీ అది అలా గోలపెడుతోంది," అడిగింది పిచ్చుకల్ని పోల్చడం చెప్పాడు, యిదివరకే భార్యకు

"యేంలేదు దాని భర్త యెక్కడికో వెళ్లి యింకా రాలేదు అందుకని అలా అరుస్తోంది," అన్నాడు నిజమే మరి కొంతసేపయిన తరువాత మగపిచ్చిక వచ్చేసింది అప్పుడు అది అరవడం మానేసింది

"యెలా తెలిసిందండీ" అడిగింది, ఆశ్చర్యపోయి రాజ్యం

"నేను పిచ్చుకల భాష నేర్చుకున్నాను," అన్నాడు నవ్వి

* * *

రోజులు గడుస్తున్నాయి. పూర్వంలా తొక్కపడుతున్నా విసుక్కోవటం మానేసింది, రాజ్యం. మధ్యాహ్నం తీరిక సమయాల్లో ఆ గూటివేపు చూడటం పరిపాటి అయిపోయింది ఆమె కళ్ళల్లో భర్త కట్టబోయే చిన్న యిల్లు లీలామాత్రంగా గోచరించేది.

గిరి ఆఫీసులో పి యఫ్ లోను పెట్టి చిన్న జాగా కొన్నాడు రాజ్యం పిల్లలకు పొద్దున కాఫీ యివ్వటం మానేసింది. పాల వాడకం తగ్గించేసింది. పనిమనిషిని మానిపించేసింది యేవో అవసరమైన బట్టలు తప్పించి మిగతావి వుతుక్కోవటం మొదలుపెట్టింది సినిమాలు మానేసింది యెంత పొదుపు పాటించాల్సిన అవసరం వుందో అంతకన్నా యెక్కువ పాటిస్తోంది గిరి పరిస్థితీ అలాగే వుంది వొక దుకాణంలో పద్దులు రాయటం, తర్వాత రెండు ప్రయివేట్లు చెప్పటం మొదలు పెట్టాడు ఉదయంపూట గూడా మరి రెండు ప్రయివేట్లు చెప్పడానికి గూడా కుదుర్చుకున్నాడు

ఆ సాయంకాలం రాజ్యం డబ్బు లెఖ్ఖపెట్టుకుంటోంది గిరి హుషారుగా వచ్చాడు

"యిదిగో రాజ్యం! యింటికి ప్లాను వేయించాను, చూడు," అని మంచంమీద పరిచాడు రాజ్యం ఆతృతగా చూసింది. ఆ గీతలు ఆమెకు సమంగా అర్థం కాలేదు

"యిది వరండా, యిది డ్రాయింగ్



రూమ్, యిది వంటిల్లు వరండా ముందు చిన్న గార్డెనుకు స్థలం. బాగుందా?" ఆమె ముఖంలోకి చూస్తూ అడిగాడు రాజ్యం పెదవి విరిచింది

"యిదేమిటింత చిన్న గదులు, మరి చుట్టాలు, స్నేహితులూ వస్తే వారికో గది వేరేగా వుండొద్దండీ," అడిగింది

"మరి అవుట్ హౌస్ అక్కర్లేదా డాబామీద గది అక్కర్లేదా," అన్నాడు హాస్యంగా.

"సరే, మీ యిష్టం యింతకీ యింటి ముందు జాగాలో యేం వేద్దామంటారు"

"సంపెంగ మొక్కలు నాటవాం," అన్నాడు వుత్సాహంగా. సంపెంగలు అంటే యెంతో యిష్టం

"అమ్మ బాబోయ్ వద్దండీ సంపెంగ నాగులు వస్తాయంటారు మరి మనం శుభ్రంగా మల్లె మొక్కలు, సన్నజాజి తీగలు నాటుకుందాం," అని సలహా యిచ్చింది

"సర్లే నీ యిష్టం" గిరికి తెలుసు. భార్యకి మల్లెలూ, సన్నజాజులూ అంటే చాలా యిష్టమని

"మీకో శుభవార్త చెప్పనా"

"యేమిటది?"

"ఈ నెల మనం ఆదా చేసినది సుమారు తొంభైరూపాయలు అయింది," అంది వుత్సాహంగా.

"అంటే సంవత్సరానికి సుమారు వెయ్యి అన్నమాట. ఈ లెఖ్కన మనం యిల్లు కట్టాలంటే పది సంవత్సరాలు ఆగాల్సి వస్తుంది," అన్నాడు నీరసంగా.

"యేమిటి పదివేలా!" అడిగింది.

"అవును. జాగా ఖరీదు కాక తాటి

కమ్మల కప్పు వేయిస్తే అవుతుంది అదీ యివాళ్టి రేటును బట్టి," అన్నాడు

"ఈ పది సంవత్సరాలలోనూ ప్రమోషను రాదా ?"

"యెందుకు రాదూ! ప్రమోషను వస్తుంది. పిల్లల చదువులూ పెరుగు తాయి," అన్నాడు

"మీకన్నా ఆలస్యంగా జాయినయిన వాళ్లు యెలా కట్టగలుగుతున్నారండీ" అంది ఆశ్చర్యంగా వారం రోజుల క్రితమే భర్త ఆఫీసులో పనిచేసే గుమాస్తా గృహప్రవేశ మహోత్సవానికి ఆమె గూడా వెళ్లింది ఆ పేరంటంలో ఆ భార్యాభర్తలిద్దరూ సిల్వరుచెంబు, తపేలాతో ఆ వూరు వచ్చి గడించారని అమ్మలక్కలు చెవులు కొరుక్కోగా వింది

"అక్రమ అర్జనతో వొక్కళ్లను పీడించి వాళ్ల వుసురుపోసుకుని సంపాదించిన డబ్బుతో తాత్కాలికంగా మనం యేదో తృప్తి సంపాదించుకున్నా, అది నాగై మన పిల్లల భవిష్యత్తుమీద యేదో విధంగా దెబ్బతీయక తప్పదు. నీకు తెలుసు నేను లంచం పుచ్చుకోనని, నా రెక్కల కష్టంమీదనే, మనం పిచ్చుక గూడు నిర్మించుకుందాం," అన్నాడు భార్యతో అనునయంగా

మరో నెలరోజులు గడిచేసరికి, రాజ్యం సుమారు నూటపాతిక రూపాయలకు పైగా ఆదా చేయగలిగింది. అర్ధరాత్రపుడు రాజ్యంకు వొక్కొక్కప్పుడు తెలివి వచ్చి చూస్తే గిరి యింటికి తీసుకు వచ్చి రాస్తున్న రెండుమూడు దుకాణాల పద్దులు కన్పించేవి. కాస్త వేడి టీ గూడా కాచి యిచ్చేది. భర్తకి తోడుగా తనూ కాస్సేపు ఆ ప్లానును ముందేసుకొని కట్టబోయే యింటిని ఉత్సాహంగా చూసేది ఒక్కొక్కసారి భార్యాభర్తలిద్దరూ ముందు నెలలో మరికొంత యెక్కువ ఆదా చెయ్యడానికి మార్గాలు ఆలోచించేవారు, అర్ధరాత్రి యెంతో శ్రద్ధగా.

* * *

మధ్యాహ్నం వొంటిగంట దాటింది. ఆ రోజు ఎండ నిప్పులు చెరుగుతోంది. గదిలో రాజ్యం నిద్రపట్టక పిచ్చుకగూటి వేపు చూసింది అది బాగా తయారయింది చూడముచ్చటగా వుంది. అంత చక్కగా శ్రమించి తామూ యిల్లు కట్టుకోవాలి. ఆ యింట్లో యీ పిచ్చుకగూడు పిచ్చుకల్ని ఫోటో తీయించి పెట్టుకోవాలి. వీలయితే వాటిని అక్కడికే తరలించాలి యిలా ఆలోచనలు ఆమె మనస్సు చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

యింతలో వీధిలో యేదో కలకలం వినిపించింది కిటికీలోనుండి చూస్తే, యింటిముందు అంబులెన్సు ఆగింది. వొక మనిషిని మోసుకుని వీధిగుమ్మంలో వుంచారు. అతనిమీద తెల్లగుడ్డ కప్పి వుంది రాజ్యం గాభరాగా తలుపులు తెరిచింది. అంబులెన్సు వెనుక గిరి ఆఫీసు స్టాఫంతావున్నారు. భయంతోనే తెల్లగుడ్డ

త'లగించింది అంతే। కెవ్వునకేకవేసింది గిరి నల్లగా మాడిపోయివున్నాడు

"లంచవర్లో కాఫీకి వెడుతుండగా రిక్షావాళ్ళ గుడిసెలు అంటుకోవటం చూసి, వాటిని ఆర్పి వొక గుడిసెలో, పిల్లల్ని, రోగంతో మూలుగుతున్న రిక్షావాడ్ని బయటకు తీసి రక్షించాడు కాసీ తను బ్రతకలేకపోయాడు. అప్పటికే వొళ్లు కాలిపోయింది," అన్నాడు, ఆఫీసు స్టాపులో ఒక గుమస్తా

"ఆ బాబు ఋణం తీరుసుకోలేం తల్లీ నా గూట్లో దీపం ఆరిపోకుండా యెలిగించాడు,"అంది యేడుస్తూ వొక స్త్రీ

యెవ్వరి మాటలు విన్పించలేదు రాజ్యానికి

జరగవలసిన కార్యక్రమం జరిగి పోయింది

కాలం యెవరికోసం ఆగుతుంది నెల రోజులు గడిచాయి యెక్కడికి వెళ్ళడానికి యెవ్వరూ లేరు, రాజ్యానికి. ఆదరించడానికి ఆత్మబంధువులు లేరు, గిరి ఆఫీసులో స్నేహితులు తప్ప

వొకనాటిసాయంకాలం, ఆఫీసుస్టాఫ్, ఆఫీసరుగారు యింటికి వచ్చారు

"అమ్మా, నీ భర్తకు రావలసిన గ్రాట్యుటీ పదివేలు, యిదికాక నెలకు సుమారు నూటయాభై కి పైగా పెన్షన్ రావచ్చు " అంటూ డబ్బు మంచం మీద పెట్టాడు.

"చాలా మంచివాడమ్మా గిరి. అతన్ని పోగొట్టుకుని మేమెంత బాధ పడుతున్నామో తల్లీ ఈ డబ్బుతో చిన్న యిల్లు కట్టుకుని వచ్చిన పెన్షను డబ్బుతో పిల్లల్ని చదివించి పెంచి పెద్ద చేయి నువ్వు కూడా ఆపేసిన చదువు పూర్తిచేయి అప్పుడు నీకు డిపార్టుమెంటు వుద్యోగం యిస్తుంది," అన్నాడు ముసలి మేనేజర్ ఆమెను వోదారుస్తూ

సూర్యుడు అస్తమించాడు అయినా వెలుగింకా మాయలేదు దుఃఖంతో కుములుతున్న రాజ్యం తెప్పరిల్లుకుని వర్తమానంలోకివచ్చింది పైకిచూచింది.

పిచ్చుకలు రెండూ నిశ్శబ్దంగా కూర్చుని, ఆమెలో చెలరేగిన అశాంతికి సానుభూతి నందజేస్తున్నట్లుగా వున్నాయి

మంచంమీద నోట్లకట్టల్ని చూసింది రాజ్యం యే పదివేల రూపాయలు కూడబెట్టి గూడు కట్టుకుందామనుకొని, తన భర్త అహోరాత్రాలూ శ్రమించాడో, ఆ డబ్బు అతను మరణించాక లభించింది జీవితానికీ, బ్రతుక్కి, ఆశలకీ, ఆశయాలకీ, ఆత్మీయతలకు, అనుబంధాలకీ, ప్రేమకూ వుండే ఆశ్రయాలు పిచ్చిక గూళ్ళ లాంటివి

కిటికీలో నుండి చూస్తే పిల్లలిద్దరూ నిర్విచారంగా యిసుకలో పిచ్చుకగూళ్లు కట్టుకుని ఆడుకుంటున్నారు స్థిర నిర్ణయంతో నే డబ్బు చేతిలోకి తీసుకుని అప్రయత్నంగా పిచ్చుకగూటి వేపు చూసింది రాజ్యం

---

# శిలలో మెడోనా

(Madonna of the rocks' చిత్రం చూశాక)

— బైరాగి

నీలినింగి, నీలిరాళ్ళు, నీలినీరు –
జనన నిధన గహ్వరాల నుంచి ఉబికే ఒకే ఉనికి వెలవేరు!
ఇచట చరమ శతదళపు పరమ సుషమ
        శాశ్వతంగా వికసిలి విలసిలిన చోట,
పుష్పిత శిరీషమృదుల, పుష్యరాగప్రభాపటలి
        హీరక నీర తరళ కాంతి!
        ఒకే భవ్య, దివ్య శాంతి!

నందన మసృణ పరిమళాల చిరు విసరుల చల్లని తోట!
సూర్య చంద్రుల, లక్షల నక్షత్రాల, స్వర్ణిమ జ్యోతి ష్పృధాన
కాలానల కీలల, బహుళ ప్రజ్వల దుల్కాల రుధిరావ భృధాన
ఆద్యంత విరహిత గతిని భ్రమిస్తోంది విశ్వచక్రం –
రుజా జరా మరణాల భీకరశోక నరకభూతి మసిలా చిమ్మిలేస్తూ,
                                        నెత్తుటి ఉమ్మివేస్తూ!

ఎంత శోకం లోకంలో!
ఎంత చీకటి లోకపు ఆలోకంలో?
కాని తల్లీ! నీ నల్లని కురులఛాయ ముసిరిన చోట,
నీ చల్లని యూర్పుల తావి విసరిన చోట,
నీ చూపుల తెలికలువలు దయతో విరిసిన చోటు,
                        ఇంచుక మచ్చిక నీడ!
        పరులెరుగని పరిమళాల విరళపు జాడ!

లోకమంతా ఒకే మాత ।
లోకమంతా ఒకే శిశువు ।
కోటి కోటి రోజాల, చెంగలువల, కెందామరల విరితావుల
        వింజా మరల విసురుల ఉసురులోన ఒకే అశువు ।
        ఇచట ఈ లోకంలో, శోకంలో అంతా చలిస్తుంది ।
        వగలై దగలై, పెగలై జ్వలిస్తుంది ।
        చిటికెడు మసి చీకటిలో కలుస్తుంది ।
రకరకాల వాహనాలు, రైళ్ళు, ఓడలు, విమానాలు,
అంతా ఎక్కడికో, పిల్లల్లా మారాములు, గారాములు, ఆరాటాలు ।
జీవితపు అంతులేని ఆవేదన, ఆందోళన, ఆర్భాటాలు, పోరాటాలు ।
ఎక్కడికో పరుగులతో, నురుగులతో, తిముల, సొరల నోళ్ళలోకి ।
        ఉరుల, చెరల జైళ్ళలోకి ।
తిరిగి రాని బాటలలో, చీటులలో ।
సమాధుల, స్మశానాల, కూలిన రాచరికాల కోటలలో ।
రేబవళ్ళ నెత్తుటి మసిచక్రక్కి--చక్కి--విశ్వచక్రం భ్రమిస్తోంది.
        పూర్వ నిశ్చిత ప్రళయ పథాన క్రమిస్తోంది ।
ఎవ్వరూ మరలిరారు । అలా అలా పోతారు.
        అలసి సొలసి నిశిలో నిదురపోతారు ।
        సంజ మసకలో తల్లి ఒక్కతే వేచిఉంటుంది
చిరుఅడుగుల సడి, నవ్వుల సందడి కలలు కంటుంది ।
ఆ మొగాన, ఆ కరుణ నయనయుగాన
జీవితపు అనంత సకలైశ్వర్యం, సౌందర్యం, సౌశీల్యం, వాత్సల్యం,
        ఈ లోకంలో అలౌకికమైనదంతా
        ఈ అనృతంలో అమృతమైనదంతా
శత శత గత శతాబ్దాల ధూళి ధూసర దుర్గతిలో
సకలోద్భూత భూతకోటి, దుస్థితిలో, దుర్కృతిలో
        స్థితమైనది, ఋతమైనది, అమృత తులిత మైనదంతా
ఆ మొగాన,
ఆ కరుణ నయన యుగాన ,
        లోకమంతా ఒకే మాత
        లోకమంతా ఒకే శిశువు ।

(కీ॥ శే॥ 'బైరాగి' అముద్రిత కవిత)

# ఆఖరి వీడ్కోలు

"స్వప్నా! దేవీబాగ్‌లో అయిదున్నరకు ఉంటాను"

ఈ మాట గాలిలో వదిలి జవాబు కోసం చూడకుండా స్కూటర్ మీద దూసుకుపోయాడతడు.

స్కూటర్ చప్పుడుతో వినిపించిన ఆమాట స్వప్నను విభ్రాంతిలో ముంచింది ఎవరైనా విన్నారేమోనని చుట్టూ కలియ జూసింది, బెదురు చూపులతో

స్టూడెంట్స్ గుంపులు గుంపులుగా ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు టీచర్సు జంటలుగా మాట్లాడుకొంటూ నడుస్తున్నారు

రోజూ తనతో వచ్చే మధుర టీచర్ ఈ రోజు సెలవుపెట్టడంవల్ల తను బ్రతికిపోయింది గాని

అయినా ఇతడికి తన పేరు ఎలా తెలుసు?

తెలిసినా తనను దేవీబాగ్‌లో కలుసుకొమ్మనేంత ధైర్యం ఎలా కలిగింది?

స్వప్నకి కలిగిన విస్మయం అంతా ఇంతా కాదు

స్వప్నదీ అతడిదీ నెలరోజుల పరిచయం మాత్రమే అదీ చూపుల పరిచయం!

అవివాహిత అయిన పాతికేళ్ళ అందమైన యువతి స్వప్న హైస్కూల్ టీచరు రోజూ బడికి వచ్చేప్పుడు వెళ్ళేప్పుడు అతడు స్కూటర్‌మీద కనిపిస్తాడు ఎక్కడ ఉంటాడో ఏంజాబ్ చేస్తుంటాడో స్వప్నకు తెలియదు. తరచు తెల్లటి డ్రెస్ వేస్తాడు ఒక విధమైన ప్రత్యేకతతో కనిపిస్తాడు.

చాలామంది, ముఖ్యంగా స్వప్నలాంటి ఆడపిల్లలు అతడిని చూస్తే అతడు స్వప్నని మాత్రమే చూస్తాడు.

మొన్న అతడు స్వప్నని చూసి నవ్వాడు పలుకరింపుగా

తనూ నవ్వింది స్వప్న, జవాబుగా.

ఆ నవ్వు దేవీబాగ్‌కు ఆహ్వానించేంత చనువు ఇచ్చిందా?

ఛ ఛ! తను చాలా తప్పు చేసింది. రేపటినుండి అతడికేసి చూడకూడదు. తన చూపుల కథ ఇక్కడితో ఆపేయాలి

ఇల్లు చేరింది స్వప్న

ముఖం కడుక్కుని తల్లి ఇచ్చిన టీ తాగి తన గదిలో కుర్చీలో కూర్చొంది. టేబిల్‌మీద గడియారంలో ముళ్ళు కదులుతున్నాయి, కాలాన్ని మింగేస్తూ.

పోల్కంపల్లి శాంతాదేవి

స్వప్న చూపులు గడియారం మీదే ఉన్నాయి।

అయిదూ ముప్పై నిమిషాలు।

అతడు తన కోసం దేవీబాగ్‌లో ఎదురుచూస్తుంటాడా?

ఆ ఊహ స్వప్న మనసును తీయటి అనుభూతితో వణికించింది

ఊహుం. అతడెవరో? ఎక్కడివాడో?

అతడితో తన కథ సాగకూడదనిది। ఈ కథకి ఇంకా రూపమంటూ ఏర్పడని ఈకథకి ఫుల్‌స్టాప్ పెట్టెయ్యాలి। రేపు అతడు కనిపించినప్పుడు 'రాలేదేం' అని తనని నిలదీసి అడుగుతాడేమో? ఇంకెప్పుడూ ఇలాంటి పిచ్చివేషాలు వేయొద్దని ఖచ్చితంగా చెప్పెయ్యాలి।

ఆలోచనల మధ్య స్వప్న గుండెలో సన్నని వేదన సుళ్ళు తిరిగసాగింది.

తొలి చూపులోనే తన గుండెలో ముద్రపడిన అతడి రూపాన్ని చెరిపి వేసుకోగలదా? ఆ చెరపడంలో తన గుండెలో ఎంత లోతైనగాయం ఏర్పడు తూంది। తన ఊహలలోకి, కలలలోకి కమ్మని పరిమళంలా చొచ్చుకువచ్చే అతని తలపును అటకాయించగలదా?

అటకాయించాలి।

లేకపోతే ఉపద్రవం జరిగిపోతుంది. తను చాలా సమస్యల్ని ఎదుర్కోవలసి వస్తుంది।

మరునాడు ఉదయం బడికి వెడుతూ తలవంచుకొని నడవసాపింది స్వప్న బడి ఇంకొక పదిగజాల దూరంలో ఉంది

నెలరోజులుగా పరిచితమైన స్కూటర్ శబ్దం వినిపించి స్వప్నగుండె దడదడలాడించింది కాని తలెత్తలేదు. ఇంకా వడివడిగా నడవసాగింది

స్కూటర్ స్వప్నకి దాష్ ఇచ్చేంత దగ్గరగా వచ్చి ఆగింది

"ఏయ్, మొద్దూ!" ప్రేమ ఉట్టిపడే గొంతుతో పిలిచాడతడు అతడి గొంతులో ప్రవహిస్తున్న చనువు ఈరోజే పలకరిస్తున్నట్టుగా లేదు ఎన్నో రోజుల పరిచయమున్నట్టుగా ఊహుం। ఎన్నో జన్మల పరిచయమున్నట్టుగా

అతిసమీపంగా ఉన్న అతడి ముఖం లోకి చూడకుండా ఉండలేకపోయింది స్వప్న

దూరానికి అందంగా కనిపించే ముఖాలెన్నో దగ్గరైతే ఉన్న వికృతాలు బయటపడుతుంటాయి చాలామంది విషయంలో. ఇతడిని దగ్గరినుండి చూస్తే దూరానికి కనిపించని అందాలు కనిపిస్తు న్నాయి। అందమైనవాడు, మగసిరి కలవాడు అని చెప్పడానికి ఏమేం ఉండాలో అన్నీ ఉన్నవాడు అనిపించింది స్వప్నకు

"దేవీబాగ్‌కు వస్తావేమో, ఎన్నో ఎన్నెన్నో మాట్లాడాలనుకొన్నాను. ప్చ్! నీ పిరికితనం మంచి ఛాన్స్ పోగొట్టింది। కనీసం ఈ లేఖయినా చదువుతావుకదూ?"

అతడి మాటల్లోని మృదుత్వం, అభ్యర్థన స్వప్న చెయ్యి ముందుకు వెళ్ళేలా, అతడి చేతినుండి కవరు అందు కొనేలా చేసింది! అది పర్సులో పెట్టుకొని బడికైంం అయిపోతుందన్నట్టుగా గబ గబా నడవసాగింది.

ప్రార్థనలో నిలబడిందేగాని మనస్సు అంతా కవరుమీదే ఉంది. ఇంటర్వెల్ వరకు మనసు ఎలాగో బిగబట్టుకొని తరువాత కవరు చించింది. గులాబీరంగు కాగితం మీద వెల్వెట్ ఇంకుతో వ్రాసిన అక్షరాలు ముద్దొస్తూ, కునేగా సెంటు వాసన హాయిగా చుట్టుముట్టి మరో లోకం లోకి తీసికెళ్ళింది! ఆత్రుతగా కాగితం మీద పరుగులు తీసాయి చూపులు.

"డియర్ స్వప్నా!

నిన్న దేవీబాగ్‌లో నీకోసం చీకటి పడేదాకా ఎదురుచూశాను. రాలేదెందుకు? నేనంటే ఇష్టం లేదా? ఆ మాట ఆత్మ వంచన కదూ? ఇష్టంలేనిదే నా కళ్ళలో కళ్ళు కలిపేదానివి కాదు!

మరెందుకు రాలేదు?

నన్ను కలుసుకోవాలనీ, నాతో మాట్లాడాలనీ, నన్ను గురించి తెలుసు కోవాలనీ లేదా? ఉన్నా 'ఆడపిల్ల' వన్న జంకుతో వెనుకంజా? అంత జంకున్నదానివైతే నన్ను నీ చూపులతో ఎందుకు ప్రోత్సాహపరిచావు?

నీ గురించి నాకు తెలుసు. (ఎలా తెలుసునని ఆశ్చర్యపడబోకు. బడిలో పనిచేసె పంతులమ్మ వివరాలు సెకరించా లంటే పెద్ద కష్టమైన పని కాదు!)

నా గురించి నీకు చెబుతాను.

బి.ఇ. పూర్తిచేసి రెండు సంవత్సరా లైంది. ఈ పంవత్సరం ఇంటర్వ్యూలో సెలెక్ట్‌అయి ఈ ఊరికి జూనియర్ ఇంజనీరుగా వచ్చాను, నెలరోజుల క్రిందటే. వచ్చిన మరు రోజే నువ్వు కనిపించావు. (ఈ ఊళ్ళో ఇంతమంది ఉండగా నే నొక్కదాన్నే కనిపించానా అని నవ్వకు! ప్రేమ ఉదయించినచోట తప్ప మిగతాదంతా శూన్యమైపోతుం దనుకుంటాను మనిషికి!)

.... అంతా ఇందులోనే చెప్పేస్తే మనం దేవీబాగ్‌లో కలుసుకొంటే మాట్లాడుకోవడానికి మిగలొద్దా?

ఈరోజు అయిదున్నరకు దేవీబాగ్‌కు తప్పక వస్తావు కదూ?

రాకపోయావో నీకూ నాకూ చెల్లు!

ఇప్పటికి ఉంటా మరి. నీవాడి నని పించుకోవాలని ఆశతో నిరీక్షించే —

స్వరూప్.'

"స్వరూప్!" లేఖని ముద్దుపెట్టు కొంది స్వప్న. అందమైన పేరు! అంద మైనవాడు! జూనియర్ ఇంజనీరుగా జాబ్ చేస్తున్నవాడు! స్కూటర్ మీద తిరుగుతాడు. ఒక అంతస్తు కలవాడే అయివుంటాడు. అతడు తమ కులస్తుడే అయితే అమ్మానాన్న సమస్య న సులువుగా తీర్చింది అవుతుంది!

నీకూ, నాకూ కుదరదని చెప్పేస్తుంది.

ప్రేమకంటే ముందు పెళ్ళి గురించి ఆలోచించసాగింది స్వప్న. పెళ్ళివరకూ దారితీయని ప్రేమ ఎంత నరకంగా తయారవుతుందో, అది ఎన్ని సమస్య లను సృష్టిస్తుందో ఊహించలేని పసిపిల్ల కాదు తను. పాతికేళ్ళ పడుచు. వయసు పొంగు తగ్గి ప్రశాంతంగా ఆలోచించుకో గల వయసు వచ్చేసింది!

"ఏమిటే, స్వప్నా అంత పరధ్యానం? ఎక్కడినుండి ఉత్తరం?"

మధుర టీచర్ భుజం తట్టేసరికి గతుక్కుమని కాగితం కంగారుగా మడతపెట్టి హేండ్‌బాగ్‌లో ఉంచేసింది. "నిన్న సెలవుపెట్టా వెందుకు?"

"అమ్మకి జ్వరం వచ్చింది. హాస్పిటల్‌కి తీసికెళ్ళాను!"

అడిగిందేగాని జవాబు వినలేదు స్వప్న.

"ఏమిటే, ఈరోజు కొత్తగా కనిపిస్తు న్నావు!" మధుర ఆశ్చర్యంగా అడిగింది.

"సాయంత్రం నాతో దేవీ బాగ్ వస్తావా?"

"ఎందుకు?"

"తరువాత చెబుతాను. ముందు చెప్పు, వస్తావా? రావా?"

"అమ్మ ఇంకా లేచి తిరగడంలేదు. పని ఉంటుంది."

"ఈ ఒక్కం జాబు ఎలాగ తిరక చేసుకు రాలేవూ?"

ఊరవతల ఉన్న దేవీబాగ్ ఆ ఊరి రాజాగారిది. దేశం నలుమూలల నుండి తెప్పించి నాటిన రకరకాల మొక్కలతో అందంగా పెంచబడిన తోట అది. చాలా మంది షికారుగా వెడతారట. ఇంట్లో బోరె త్తినప్పుడు తనూ, స్వప్న దేవీ బాగ్‌కు వెళ్ళడం అలవాటే అయినా ఈ రోజు స్వప్న ఆహ్వానంలో ఒక ప్రత్యే కత కనిపించసాగింది మధురకు. స్వప్న కళ్ళలోకి చూస్తూ అడిగింది, "అక్కడ ఎవరిని కలుసుకోవాలి?"

"వస్తే చూపెడతాను." స్వప్న కళ్ళు క్రిందికి వాలిపోయాయి.

"చెప్పకూడదా? ఈ ఊరేనా?"

"ఉహుం. ఈ ఊరు కాదు."

"మరి?"

"నాకు తెలియదు."

"ఎన్నాళ్ళబట్టి నడుస్తోంది కథ?"

"అబ్బ! ప్రశ్నలతో చంపుతున్నావు! ఇదిగో, నీ సందేహాలన్నింటికీ జవాబు!" బాగ్‌లోంచి స్వరూప్ వ్రాసిన జాబు తీసిచ్చింది స్వప్న.

మధుర చదివి దీర్ఘం తీసింది. "ఓహో! ఈ స్కూటర్‌వాలానా?"

"ఆడవాళ్ళని చూసేపని తప్ప మరో పని లేనట్టుంది అని తిట్టేదానివే.... అయనే!"

"నువ్వా చూస్తున్నావని తెలిస్తే తిట్టకపోయేదాన్ని!" మధుర నవ్వింది.

సాయంత్రం అయిదున్నరకి దేవీ బాగ్‌లో అడుగుపెడుతున్న స్వప్నకి గుండె దడదడ కొట్టుకుంది. కాళ్ళలో వణుకు పుట్టడం, అరచేతుల్లో చెమట పట్టడంలాంటి అవస్థలన్నీ అనుభవంలోకి రాసాగాయి. ఒక పక్కగా ఆపిన స్కూటర్ కంటబడ్డాక ఆమెలో వణుకు మరింత అధికమైంది. తనని తాను స్వాధీనంలోకి తెచ్చుకుంటూ స్వరూప్ కోసం ముందుకు నడవసాగింది.

"అదుగో, నీ కథానాయకుడు! వెళ్ళు. నేనిక్కడ కూర్చొని పుస్తకం చదువుకొంటాను." మధుర ఆగిపోయింది.

పచ్చికలో ఒరిగి ట్రాన్సిస్టరులో సంగీతం వింటున్నాడు స్వరూప్.

తడబడే అడుగులతో సమీపించింది స్వప్న. గొంతులో తీవ్రత తెచ్చుకొని అంది: "ఈ ఊరు ఆడపిల్లల కోసం వచ్చారా? జాబ్ కోసం వచ్చారా?"

స్వరూప్ లేచి సర్దుకుని కూర్చున్నాడు. "వచ్చింది జాబ్ కోసమే. కాని ఆడపిల్ల దొరికింది." చిరునవ్వుతో అన్నాడు. "కూర్చో స్వప్నా!"

"ఈ తోట మీదే అయినట్టుగా మర్యాద చేస్తున్నారే!" దబాయించింది.

"తోట నాదికాకపోయినా వచ్చింది మాత్రం నా కోసమే కదా?" తొణక్కుండా అన్నాడు.

"మీ సంగతేమిటో తెల్చుకోవాలనె వచ్చాను."

"తేల్చుకోవడమంటే యుద్ధమన్న మాట! ఓ. ఎస్. ఇష్టమైన ఆడపిల్లతో యుద్ధంచేయడమంటే నాకు చాలా సరదాగా ఉంటుంది!" ఉత్సాహంతో అన్నాడు.

"చూస్తే చూశాడులే అనుకొన్నాను. ఈ అలుసుతో ప్రేమలేఖలు వ్రాసే వరకు, తోటలకు ఆహ్వానించడం వరకు వచ్చారు!"

"తప్పు చేసినట్టయితే శిక్షకు సంసిద్ధుడిని! ఇదిగో, ఈ పూలకొమ్మతో కొట్టు!" తనెంత కోపం తెచ్చుకొని మాట్లాడినా కోపగించుకోకుండా తమాషాగా మాట్లాడుతున్న అతడికేసి రాగభరితమైన చూపులతో చూసింది స్వప్న.

"కూర్చో, స్వప్నా!"

స్వప్న కూర్చుంది. "చెప్పండి. నన్నెందుకు పిలిచారు?"

"నెల రోజులు మన కళ్ళు మాట్లాడుకోవాలనీ, ఇలా ఒకరి కళ్ళలోకి ఒకరం చూచుకొంటూ ఈ చెట్ల చాటున ఏకాంతంగా గడపాలనీ...."

"గడిపితే ఏమొస్తుంది?"

"గడిపాక ఏమొస్తుందో నువ్వే చూస్తావు. నేను చెప్పడమెందుకు? తెలిసి అడుగు పెడితే ఏముంటుంది? తెలియకుండా అడుగుపెడితే ఆ లోకం చాలా అద్భుతంగా ఉంటుంది.

"ఏ లోకం?"

"ప్రణయలోకం."

"అంత తెలియకుండా అడుగుపెట్టి అద్భుతాలు చూడాలనే కుతూహలం నాకేం లేదు. జీవితాన్ని అంత తెలివి తక్కువగా నడిపే పదాహారేళ్ళ వయసు కాదు నాది!"

"వయసు ఆలోచనా విధానాన్ని మార్చవచ్చు! ఆలోచనా శక్తిని పెంచవచ్చు. అంత వరకు ఒప్పుకొంటాను. కాని, ప్రేమ మనిషినే కాదు వయసుని కూడా తలక్రిందులు చేసివేస్తుంది. అలా తలక్రిందులు కానిదే నువ్వు నా కళ్ళలో కళ్ళు కలిపేదానివనుకోను. ఆడదాని ఆహ్వానం లేనిదే ఏ మగవాడూ ముందడుగు వేస్తాడనుకోకు, స్వప్నా! అంటే నాలాంటి సభ్యతకలవాడు!"

స్వప్న ముఖం ఎర్రబడింది, సూటిగా కొట్టిన ఈ దెబ్బకు! తను ఇతడితో చిలిపి కయ్యాలాడడానికి వచ్చిందా? అన్ని సంగతులూ అడిగి అనుకూలంగా ఉంటే పెళ్ళి సంగతి ఎత్తాలనీ....

అయినా అంత చటుక్కున నన్ను పెళ్ళాడతారా అని ఎలా అడుగుతుంది?

"ఆలోచనలో పడిపోయావేం, స్వప్నా?" సిగరెట్ కేస్ సైజులో ఉన్న ట్రాన్సిస్టరు చేతిలోకి తీసుకొని స్టేషన్ మారుస్తూ అడిగాడు.

"ఏం లేదు. మీ సంగతులు చెప్పండి వింటాను!"

"హైదరాబాద్ మా నేటివ్ మా నాన్నగారు ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, ప్రస్తుతం సాగర్‌లో. అన్నయ్య ఫారిన్‌లో ఉన్నాడు, మెడిసిన్‌లో స్పెషలైజ్ చేస్తూ. చెల్లెలు ఐ.ఎ.ఎస్.కు ట్రైని చేస్తోంది. ఇవీ నా వివరాలు. చాలా?"

కులం గురించి అడగాలని పెదవుల వరకూ వచ్చింది. కాని, సభ్యత అడ్డు పడింది. కులం గురించి అడగడం ఈ కాలంలో నాగరికత కాదు! అయినా ముఖం పట్టుకొని నీ కులమేమిటి అని ఎలా అడుగుతుంది?

"అందమైనవాళ్ళను చాలామందినే చూశాను. కాని, విసనకర్రల్లా ఇంత పొడుగాటి రెప్పలతో ఇంత పెద్దగా ఉన్న కళ్ళని ఈ ముఖంలోనే చూశాను. చూసిన మొదటి క్షణంలోనే అనిపించింది ఈ కళ్ళని నా స్వంతం చేసుకోవాలనీ.... ఈ కళ్ళలో కాపురముండాలనీ...."

"అందమైనవి కనిపించినప్పుడల్లా స్వంతం చేసుకోవాలనుకొంటూ పోతే..."

"జారుడు అవుతాడు. స్వప్నా, నేనలా కనిపిస్తున్నానా? నువ్వు నన్ను అలా అంచనా వేసుకొంటున్నావా?" దెబ్బ తిన్నట్టుగా అడిగాడు.

"పైకి సరదాగా కనిపించినా ఇతడు చాలా సెన్సిటివ్‌గా ఉన్నట్టున్నాడు," అనుకొన్నస్వప్న ఇక అతడిని నొప్పించే మాటలేవీ అనకూడ దనుకొంది.

"స్వప్నా చీకటిపడుతోంది బయల్దే

రుదాం" అంటూ మధుర కేక పెట్టే వరకు ఇద్దరిమధ్య చాలా సంగతులు దొర్లాయి.

రెండోసారి స్వరూప్ ఆహ్వానాన్ని తేలిగ్గానే అంగీకరించింది స్వప్న. ఆ తరువాత దారిలో కలుసుకొన్నప్పుడు కళ్ళ సంకేతాలిచ్చుకోవడం, దేవీబాగ్‌లో కలుసుకోవడం జరిగింది.

ఒకరోజు మధుర అడిగింది, "అతడి కులం తెలుసుకొన్నావా?"

"సన్నిహితంగా మాట్లాడుకొంటు న్నాం. కులం గురించి అడిగే సందర్భం మటుకు రావడంలేదు; కాని, అతడి మాట తీరు, అలవాట్లు తక్కువ కుల మని అనుకోడానికి వీ ల్లే కుం డా ఉన్నాయి!" అని చెప్పింది స్వప్న.

"అలా అని ఊరుకోకు. అడిగెయ్యి, ప్రేమ ముదిరి పాకాన పడకముందే! మీ వాళ్ళు నిప్పులు కడిగే ఆచార వంతులు! అతడు బ్రాహ్మడు కాకపోతే నీ పెళ్ళి అసాధ్యమైపోతుంది. మీ వాళ్ళు ఈ పెళ్ళికి అంగీకరించరు!"

సాగర్ వెళ్ళి నాలుగు రోజుల తరువాత ఆ రోజే వచ్చాడు స్వరూప్.

"స్వప్నా, నీ ఫోటో కావాలి. అమ్మ, చెల్లి పంపించమన్నారు," అని చెప్పాడు, దేవీబాగ్‌లో ఆ సాయంత్రం స్వప్నని కలుసుకొన్నప్పుడు.

"ఫోటో ఎందుకు?"

"స్వరూప్ వలచిన అమ్మాయి ఎంత అందంగా ఉంటుందోనని! మన గురించి అంతా చెప్పేశాను, స్వప్నా! నాన్నకి కొంచెం కష్టం ఆశ ఉండబట్టి నస పెడుతున్నాడుగాని చివరికి ఒప్పుకోక చేసేది లేదు! అమ్మా చెల్లీ చాలా సంతోషించారు."

"మన పెళ్ళికి మీ వాళ్ళు అంగీకరిస్తే చాలా?"

"మీ వాళ్ళ అంగీకారం కూడా తీసు కొందాం. నన్ను మీ ఇంటికి ఎప్పుడు రమ్మంటావు?"

"సందర్భం చూసి నేనే చెబుతాను. కాని.... కాని?...."

"నేనెప్పుడూ మిమ్మల్ని అడగలేదు. మావాళ్ళతో ఈ సంగతి చెప్పినప్పుడైనా ...." సంకోచంతో ఆగింది.

"అడుగు స్వప్నా!"

"మీరు బ్రాహ్మలేనా?"

"మిస్ స్వప్నా! బి. ఏ., బి.ఇడి. కి కులం పట్టింపు ఉంటుందని తెలియదు!" దెబ్బతిన్నట్టుగా అన్నాడు.

"మా అమ్మా నాన్నా బి. ఏ. చదువు కోలేదు. మావాళ్ళ కిలాంటి వాటిలో చాలా పట్టింపులున్నాయి."

"చదువుకొన్నదానివి. సంపాదించు కొంటున్నదానివి. పెద్దవాళ్ళమూర్ఖత్వాన్ని ఎదిరించలేవా?"

స్వప్న ముఖం కళావిహీనమైంది. "అయితే మీరు...."

స్వరూప్ స్వప్న చెయి అందుకొని

ఆమె వేళ్ళతో తన వేళ్ళు పెనవేసి ఆమె కళ్ళలోకి వి చ లి త ం గా చూశాడు. "మొదటే చెప్పకపోవడం పొరపాటే. చదువుకొన్నదానివి! దానికింత ప్రాముఖ్యత నిస్తావనుకోలేదు. ఆదిలో మనుషులకు కులాలు లేవు. మనుషులంతా ఒకటే. మనిషిలో స్వార్థం వెర్రితలలు వేసి కుల విభజన జరిగింది. ఈనాడు మనం అణుయుగంలో ఉండి ఈ కుల తత్వాన్ని ఎదిరించలేకపోతే మన చదువులెందుకు? విజ్ఞానమెందుకు?"

"ఈ చరిత్ర తిరగదోడడంవల్ల, ఉపన్యసించడంవల్ల వాళ్ళు మారరు. మన పెళ్ళికి మా వాళ్ళు అంగీకరించడం అసంభవం, స్వరూప్!"

"మన కులాలు కలవనంతమాత్రాన నువ్వు నాకు దూరమైపోతానా, స్వప్నా? వాళ్ళని కాదని నా దగ్గరికి వచ్చెయ్యలేవా?"

స్వరూప్ ఆర్ద్రస్వరానికి విచలితంగా చూసింది స్వప్న. "వచ్చేస్తాను స్వరూప్! వచ్చేయక చేసేదిలేదు! వెనుదిరిగి వెళ్ళలేనంత దూరం వచ్చేశాను నీతో!"

## 2

"పిల్ల ఎద్దులా ఎదిగిపోయిందని నా బాధ నాకుండగా పులిమీద పుట్రలా ఇరుగు పొరుగు సాధింపు లొకటి! పిల్ల సంపాదనకు మరిగి పెళ్ళిపెటాకులేమీ అనుకోవడం లేనట్టుందేమిటమ్మా అని! ఏం మనుషులో? ఏ తల్లిదండ్రులైనా పిల్ల అత్తారిల్లు మెట్టి పిల్లా పాపలతో కల కలలాడుతోంటే చూడాలనుకొంటారు గాని సంపాదించిపెడితే చాలనుకొంటారా? ఆ వెంకమ్మ పొద్దున ఆ మాట అన్నప్పటి నుండి నా మనసు మరిగిపోతూంది. మీకు చీమ కుట్టినట్టయినా లేదు కదా?"

స్వప్న తల్లి కమలమ్మ భర్తను సాధించసాగింది ముక్కు చీదుతూ.

"ఆ గడియ రాకముందు మనం ఎన్ని ప్రయత్నాలు చేస్తే ఏం లాభమే?" విశ్వేశ్వరయ్య అన్నాడు వేదాంతిలా.

"మనం చేసే ప్రయత్నాలు చేస్తే దైవం అనుకూలపడతాడండీ!"

"అమ్మాయి పెళ్ళికని నేనేం కట్నం మూటగట్టి పెట్టలేదు. నాకొచ్చే బడి పంతులు జీతం పిల్లలకి బట్టాపొట్టా గడిపి చదువులు చెప్పించింది. వేలకు వేలు కట్నం గుమ్మరించి ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయాలంటే నావల్లకాదు. పిల్లఉద్యోగం చేస్తుందికదాని ఎవడైనా కట్నం లేకుండా చేసుకొంటాడా అంటే అదీ లేదు. అవ్వా కావాలి, బువ్వా కావాలి అన్నట్టుంటారు మగపిల్లాడివాళ్ళు!"

"మొన్న సుభద్రమ్మ వాళ్ళు వాళ్ళక్క కూతుర్ని మన పురుషోత్తానికి అడిగారు. పదివేల కట్నమిచ్చి లాంఛనాలవీ మరో పదివేలదాకా ముట్టజెప్పగల మన్నారు. పురుషోత్తంతో చెబితే వాడు ఊఁ అనడు. మీరోమాటు కదిపిచూడండి!" భర్తకి

సలహా ఇచ్చింది "పురుషోత్తానికి కుదిరితే ఆ కట్నంతీసి స్వప్న కివ్వొచ్చు!"

వీలుచూచుకొని కొడుకుని కదిపాడు విశ్వేశ్వరయ్య

"నేను సుజాతను చేసుకోవాలను కొంటున్నాను,నాన్నా! నా ఒక్కడి జీతం ఏ మూలకవుతుంది? ఇద్దరు సంపాదించే సంసారాలే కుంటినడక నడుస్తున్నాయి!" పురుషోత్తం తన మనసులో మాట బయటపెట్టాడు సుజాత ఈ ఊరు పిల్లే పైగా బంధుత్వం కూడా ఉంది!

"సుజాతను చేసుకొంటావా? వాళ్ళ దగ్గరేముందిరా ఇవ్వడానికి బొచ్చెతప్ప? ఎగిరాడు విశ్వేశ్వరయ్య

కట్నం తీసుకు రాలేకపోవచ్చు సుజాత కాని, బి ఏ చదివింది టైప్, షార్ట్‌హాండ్ నేరుస్తోంది అది పాసైతే స్టెనోగా ఉద్యోగం ఖాయం! ఉద్యోగం చేసేపిల్లయితే వేణ్ణీళ్ళకు చన్నీళ్ళనట్టుగా ఉంటుంది! మరోపిల్ల పదివేలో,పన్నెండు వేలో కట్నం తెస్తే మీకు మిగిలేదెంత? కట్నానికి తగ్గట్టు నగలూ, బట్టలూ పెట్టాలి పిల్లకు బంధువులకు పొట్టనిండా మేపి చీరసారెలు సమర్పించాలి! మనగుడుపు అయ్యేసరికి చేతిలో మిగిలేది పూజ్యం!"

"ఓహో! పెద్ద ప్లానేవేశావే! ఎంత స్వార్థపరుడివిరా' ఉద్యోగం చేసే పిల్లయితే కట్నం లేకుండా పెళ్ళి చేసుకొంటావు! కట్నంలేకుండా పెళ్ళాడిన అదర్శ యువకుడివన్న పేరుకొట్టేస్తావు పెళ్ళయిన మరురోజు మరో ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించుకొని మీ కాపురం మీరు చూచుకొంటారు ఇద్దరు సంపాదించుకొంటున్నారు కదాని అవసరంపడి పదో పాతికో అడిగామనుకో 'మా ఖర్చులు మాకున్నాయి, నాన్నా!' అని జవాబిస్తావు! అంతేగా? పక్షి పిల్లల్లా రెక్కలొచ్చి ఎగిరిపోతే,రెక్కలుడిగాక అసరా అని కనిపెంచిన మా గతేం కావాలిరా?" అరవసాగాడు విశ్వేశ్వరయ్య

"కట్నం తెచ్చే పిల్లను చేసుకొన్నా మనకు మిగిలేదేముంటుంది, నాన్నా?" విసుగు వ్యక్తంచేశాడు పురుషోత్తం

"బట్టలూ నగలూ వాళ్ళనే తెచ్చుకొమ్మనాలి కట్నం కాష్‌గా మనచేతికొస్తే అది స్వప్నకివ్వొచ్చు! ఇద్దరి పెళ్ళి ఏ కొండమీదో చేస్తే నాలుగైదు వేలతో పోతుంది!"

"చెల్లెలికి కట్నం సంపాదించిపెట్టడానికే నన్ను కన్నావేమిటి?" చిటపటలాడాడు "కట్నంతెచ్చే కొడుకులేకపోతే నీ కూతురికి పెళ్ళేచేయవా?"

"వెధవా! కూతలు నేర్చావురా! నువ్వు కట్నంలేకుండా ఆ సుజాతను చేసుకోవడమే జరిగితే నీ ముఖం మాకు చూపించకు! నువ్వసలు పుట్టలేదను కొంటాం లేదా చచ్చాడనుకొంటాం!

పురుషోత్తం చిటపటలమధ్య,

విశ్వేశ్వరయ్య చిందులమధ్య స్వప్న ప్రవేశించింది

"అన్నయ్యా! నువ్వు నా కోసం త్యాగం చేయాల్సిన అవసరంలేదు నువ్వు నా కోసం నీ మనసుకు నచ్చిన అమ్మాయికి, మనసు చెప్పిన దానికీ దూరం కానక్కరలేదు।

"నాన్నగారూ! నా పెళ్ళికోసం మీరు తలలు బద్దలుకొట్టుకో నక్కరలేదు వేలకు వేలు డబ్బు దోసిట్లో ఉంచుకొని వరుణ్ణి అన్వేషించడానికి నేనేం అంత వ్యక్తిత్వంలేని ఆడపిల్లని కాదు. నాకూ ఆదర్శాలున్నాయి. ఆలోచనలున్నాయి. ఇంత చదువుకొని, సంపాదిస్తూ కూడా

# సెప్టెంబర్ నెల క్విజ్

## సమాధానాలు

1 — ఎ 2 — ఎ 3 — డి

4 — సి 5 — డి

6. రాంటెజన్ 7. గురుముఖి 8. బాబర్ 9. ట్రిగ్వేలీ 10. అస్సాం

1. జి. మేరి, **విశాఖపట్నం** 2. ఎన్. వెంకటేశ్వర్లు, కొల్హాపూర్ **3. కాసిన** జగన్మోహన **రావు**, కాకినాడ 4. కె. శివకుమార్, **తిరుపతి** 5. ఎ. బి. శాస్త్రి, మచిలీపట్నం 6. **బోయ పాటి రమేష్ బాబు**, పెదకాకాని 7. నడింపల్లి వెంకట **హనుమంతరావు**, నర్సారావుపేట 8 **తోలేటి లలిత**, తెనాలి 9. **తోలేటి** రాంబాబు, తెనాలి 10. **తోలేటి** పతంజలి, తెనాలి 11. **వంకమామిడి** సరస్వతి, తెనాలి 12. **పి**. లలితా కుమారి, గుంటూరు 13. కె యస్. ఆర్. మూర్తి, హైదరాబాద్ 14. రవిశంకర్ కాజా, హైదరాబాద్ 15. పి యస్. నారాయణ, గుంటూరు 16. ఎల్. అశోక్ కుమార్, హైదరాబాద్ 17. ఎ.ఎన్.యస్. నాథ్, విశాఖపట్నం 18. టి. తాతారావు, హైదరాబాద్ 19. ఆర్. శ్రీరామ్, హైదరాబాద్ 20. కె. రామక్రిష్ణ, రాజమండ్రి 21. మాజేటి ప్రసాద్, గుంటూరు 22. ఐ. నాగ భూషనరావు, **పూనా** 23. ఎ. వి. సుబ్రమణ్యం, గార 24. ఎమ్. తిరుమలరావు, హైదరాబాద్ 25. ఎమ్. సుందరీబాయి, హైదరాబాద్ 26. ఐ వి. ఆర్. శర్మ, పూనా 27. పి. శ్యామలాదేవి, హైదరాబాద్.

పై 27 గురు ఆల్ కరెక్టు ఎంట్రీలు **పంపారు**. ఒక్కొక్కరికి రూ. 4-50 పై. చొప్పున పంచడమైనది.

నా తలిదండ్రుల్ని పీడించి కట్నంతీసుకు వెళ్ళాల్సిన దుస్థితిలోలేను," అంది కాస్త ఆవేశంగా

"కట్నం లేకుండా పెళ్ళాడడానికి నీ కొసం అంత విశాల హృదయుడెవడు కాచుకుకూర్చున్నాడే?" తల్లి వెటకారం చేసింది, నోరు విప్పి ఎప్పుడూ ఇంతింత పెద్ద మాటలనని కూతుర్ని వింతగా చూస్తూ

లోపల బెరుగ్గానే ఉన్నా స్వరూప్ మీది ప్రేమ ఇస్తున్న ధైర్యంతో అంది స్వప్న "నిజానికి కాచుకొనే ఉన్నాడమ్మా. అతడు ఈ ఊళ్ళోనే జూనియర్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. తండ్రి నాగార్జునసాగర్‌లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు హోదా, ఐశ్వర్యం ఉన్నవాళ్ళు. మేం ప్రేమించుకొని పెళ్ళి చేసుకోడానికి నిశ్చయించుకొన్నాం. మీరు ఆశీర్వదిస్తే మీకు నా సమస్య తీరడమేకాదు, మీకు సహృదయుడైన అల్లుడు లభిస్తాడమ్మా!"

"మన వాళ్ళేనా?"

తల్లీ, తండ్రీ, అన్నా ఒకేసారి అడిగారు వాళ్ళ గొంతులో ఉత్కంఠ, భయం ముప్పిరిగొని వినిపించాయి.

"కాదు!" ఈ రెండక్షరాలు పలుకడానికి స్వప్న చాలా శక్తి కూడ దీసుకోవాల్సి వచ్చింది.

అంతే!

ప్రళయపు కెరటం విరుచుకుపడ్డట్టుగా అయింది భీభత్సమైన అరుపులు ప్రారంభమయ్యాయి.

కమలమ్మ శోకం తీసింది.

విశ్వేశ్వరయ్య నిప్పులు కక్కాడు

అపర్మాలు పలికే అన్నగారు ముఖం చిట్లించాడు.

మిగతా పిల్లలు స్వప్నని వింత మృగంలా చూశారు.

"మే మిచ్చేది ఆశీర్వాదం కాదే! సర్వనాశనం కమ్మని శపిస్తాం. నాలుగు డబ్బులు కళ్ళజూడగానే కులమతాన్ని మరిచిపోయేదానివ పయ్యావా? ఏదో కాస్త గొడవపెట్టి తరువాత వాళ్ళే చల్ల బడతారులే అని నువ్వనుకొంటున్నావేమో! అలాంటిది కలల్లో కూడా తలవకు. ప్రేమా గీమా అని మళ్ళీ అన్నావో నా శవం ఈ ఇంటిదూలానికి వేళాడడం చూస్తావు!" అన్నాడు విశ్వేశ్వరయ్య.

ఇంచుమించు ఇలాంటి మాటలే తిట్టి పోసింది కమలమ్మ. స్వప్న తన నిర్ణయం మార్చుకోకపోయేట్టయితే తన శవం పెరటి నూతిలో తేలుతుందని ఖచ్చితంగా చెప్పేసింది.

స్వరూప్‌ను పొందడం అంత సులభం కాదన్న సత్యం స్వప్నని కృంగదీయ సాగింది. మరునాడు బడికి సెలవు చీటీ పంపి ఇంట్లో ఉండిపోయింది.

చెల్లెలిపరిస్థితి జాలిగొలిపేదిగా ఉన్నా ఆమె అలాంటి ప్రేమ వ్యవహారంలో చిక్కుపడడం హర్షించలేకపోయాడు పురుషోత్తం. హితవుచెప్పాడు."జీవితం

ఎవరితోనా ఒకరితో ముడవసుకోవడం తప్పనిసరయినా, ఆ ముడి పెద్దల నిర్ణయంమీద ఆధారపడితేనే బాగుంటుంది, స్వప్నా!"

"సుజాతను నువ్వెలా చేసుకోవాలనుకొన్నావు, అన్నయ్యా?" విస్మయంగా అడిగింది స్వప్న.

"సుజాత మన కులం పిల్లే. బంధుత్వం ఉంది. అమ్మనీ, నాన్ననీ ఒప్పించడం పెద్ద కష్టమైన పనికాదు! ఈ సంబంధం చేసుకోవడంవల్ల వాళ్ళకు తలవంపులయ్యేదేమీ ఉండదు!"

"చదువుకున్న మనం కూడా కులం పట్టింపు పెట్టుకోవాలా? ఈ కాలంలో వర్ణ, మతాంతర వివాహాలు ఎన్ని జరగడంలేదు."

"ఎన్ని జరిగినా అవి కొద్దివే! సంప్రదాయ పద్ధతిగా పెద్దలు జరిపే పెళ్ళిళ్ళు ముందు, ఫలానా అమ్మాయి, అబ్బాయి ప్రేమించుకొని కులాంతర వివాహం చేసుకొన్నారని వింటాంగాని, ఆ తరువాత వాళ్ళు ఆ వివాహంవల్ల పడే కష్టాలు, మనస్పర్థలు, సమాజం బహూకరించే ఛీత్కారాలు, చిత్ర

పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు. దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే దంతక్షయం మరింతగా జరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి.




నోటిలో ఊరే ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్‌పేస్టులు ఆపలేవు.




సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది. ఇది నోటిలోని ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది.

## పిప్పి పళ్ళను నిరోధించే టూత్‌పేస్ట్

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2—దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్‌పేస్ట్. దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్ళతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్ళకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తి నిస్తుంది—పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది. దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్‌పేస్ట్ లేదు. మేం చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు. మీ దంత వైద్యుని కూడా అడగండి.




**ఫ్లోరైడ్‌తో**

# సిగ్నల్ 2

కుటుంబంలో వారికి పిప్పి పళ్ళు రాకుండా నిరోధిస్తుంది.



లింటాస్_SG2. 18-1710 TL

హింసలు మనవాకా రావు। ఎవ్వరో వర్ణాంతర, మతాంతర వివాహం చేసుకొన్నారని వాళ్ళని ఆదర్శం చేసుకోవడం అభ్యుదయ మంటావా?" ఈ సమాజంలో రంకులూ బొంకులూ, దోపిడీలు, అవినీతి పనులు జరగడం సహజం, సర్వసాధారణమే అయినా మనం వాటిని ఆదర్శం చేసుకోగలమా? చెడ్డకి ఎంత మెజారిటీ, బలం ఉన్నా మనిషి దానికి దూరంగా ఉండాలనే కోరుకొంటాడు కదా?

"కులమతాలు పాటించడం సంకుచితం, సంఘ విద్రోహ చర్య అంటావా, కలిసిపోవడంలోనే సమాజ శ్రేయస్సు ఉంటుందాని నే నడుగుతాను। మనుషులంతా ఒకటి కావడమనేది చాలా అసంభవం, స్వప్నా! కులవిభజన నువ్వు రూపుమాపదల్చుకొన్నా ఆర్థికంగా అంతస్తుపరంగా మనుషులమధ్య విభజన ఎప్పుడూ ఉండనే ఉంటుంది। ఎన్ని ఉపన్యాసాలు దంచినా, ఎన్ని ఉద్యమాలు లేవదీసినా ఈ హెచ్చుతగ్గులు ఎవరూ రూపుమాపలేరు।

"స్వరూప్‌ని చేసుకొని నీపాటికి నువ్వు సుఖంగా ఉండగలిగినా ఇక్కడ మా పరిస్థితి నువ్వు కొంచెంఆలోచించాలి। కుటుంబంలో ఒక్కరు తప్పుచేస్తే దాని శిక్ష కుటుంబమంతా అనుభవించాలి। నీ తరువాత ముగ్గురు ఆడపిల్లలున్నారు. వాళ్ళ అక్క కులంతక్కువవాణ్ణి కట్టుకొంటే వాళ్ళకు సంబంధాలు అంత తేలిగ్గా రావు। ప్రతిచోటా మమ్మల్ని వేలెత్తి చూపినట్టుగానే ఉంటుంది।

"మేం కట్నమిచ్చి పెళ్ళిచేయలేమన్న నిరాశతో నువ్వు స్వరూప్‌కి దగ్గరయి ఉంటే నేను నీకోసం కట్నం తీసుకొని నీకు పెళ్ళి జరిపిస్తాను స్వప్నా।"

అన్నగారి మాటలు పట్టుతాళ్ళతో కట్టివేయడంలా కనిపించింది స్వప్నకి. ఇవి పట్టుతాళ్ళయినా, ఇనుప సంకెళ్ళయినా వీటిని తెంచుకోలేదు. స్వరూప్‌ని చేరలేదు. వయసొచ్చాక ప్రతి ఆడపిల్లా పెళ్ళంటూ చేసుకొని పుట్టింటికి దూరం కావడం సహజమే అయినా ఆ దూరం తలిదండ్రుల గుండెలమీది బరువుదించేది కావాలిగాని గుండెలో నిప్పు పెట్టేది కాకూడదు।

## 3

సాయంత్రం బడి వదిలాక ఇంటికి వస్తున్నది స్వప్న, మధురతో. స్కూటర్ శబ్దం చెవినిబడుతూనే గుండెలు టకటక కొట్టుకోసాగాయి. మధుర చెయ్యి బిగించిపట్టుకొని వేగంగా నడవసాగింది స్వప్న.

స్కూటర్ దారికి అడ్డంగా నిలిపి నేలమీద ఓ కాలు అన్చి, అడిగాడు స్వరూప్, "మూడు రోజులనుండి బడికి రాలేదేం?"

జవాబివ్వకుండా స్కూటర్ని



# హై పవర్ సర్ఫ్

## అమిత తెల్లగా ఉతుకుతుంది...

### అమ్మ శ్రద్ధ ఎలాంటిదో చూపిస్తుంది

మీ బాబు బట్టలు మురికి చేసుకోవడంలో ఘటికుడా ? ఆ మురికి వదలగొట్టడానికి మీకూ ఘనమైనదే కావాలి మరి. అదే హై పవర్ సర్ఫ్.

హై పవర్ సర్ఫ్‌లో ఉంది అతి శక్తివంతమైన ఫార్ములా. దానిలోని హెచ్చు ఉతికే శక్తి మురికినీ, జిడ్డుమరకల్నీ మటుమాయం చేస్తుంది. బాగా మాసిపోయిన దుస్తుల్ని కూడా తెల్లగా మిలమిల మెరిసేలా చేస్తుంది సర్ఫ్.

సర్ఫ్ రంగు బట్టలకు కూడా మంచిది. వాటిని పరిశుభ్రంగా, కాంతివంతంగా ఉంచుతుంది. ఇంటిల్లిపాది బట్టలకూ ఉతుకులో అదనపు తెల్లదనం, కాంతి ఇస్తుంది సర్ఫ్. సర్ఫ్‌తో మీ బట్టలు ఉతికినప్పుడు దాని మహత్యం ఏమిటో మీకే తెలుస్తుంది, కళ్లను ఆకట్టుకొంటుంది.

అందుకే ఎక్కువమంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు.






**ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్-[illegible]

తప్పించుకొని ముందుకు వెళ్ళసాగింది స్వప్న.

ఆమెను నాలుగడుగులు పోనిచ్చి మళ్ళీ స్కూటర్ ఆమెకు అడ్డంగా తీసికెళ్ళి ఆపాడు. "ఆరోగ్యం బాగా లేదా, స్వప్నా? ముఖం అలా వాడిపోయిందేమిటి?" ఆదుర్దాగా అడిగాడు.

"...." స్వప్న మధురచెయ్యి వదలకుండా ముందుకు వెళ్ళసాగింది.

ఆమెను పది అడుగులు ముందుకు పోనిచ్చి స్కూటర్ని ఆమె చుట్టూ ప్రదక్షిణం చేయించి దారికి అడ్డంగా ఆపాడు.

"రోడ్డుమీద ఇలా అల్లరిపెట్టడం ఏమిటి, మిస్టర్?" మధుర కోపంగా అడిగింది. "పోలీసుల్ని పిలువనా?"

మధుర స్వప్నకి ప్రాణంలాంటి స్నేహితురాలని తెలుసు స్వరూప్‌కి. మధుర మాటలకి కాస్త నొచ్చుకొని స్వప్న ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు స్వరూప్. "అసలేం జరిగింది స్వప్నా? హఠాత్తుగా ఎందుకీ మార్పు? చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది?" కలవరంగా అడిగాడు.

కదిలిస్తే చాలు జలజలరాలే వానకు తడిసిన చెట్టులా ఉంది స్వప్న పరిస్థితి. దుఃఖం గొంతును బిగబట్టేసింది.

మధుర చేతులు జోడించి ప్రార్థిస్తున్నట్టుగా అంది, "మీరు స్వప్నను మరిచిపోవాలి! మీరు వత్తిడిచేస్తే తను ఆత్మహత్య చేసుకు చచ్చిపోతుంది."

నెత్తిన పిడుగుపడినా అంతనిశ్చేష్టుడు అయ్యేవాడు కాదేమో! వెలవెలబారిన ముఖంతో "ఎం దు క ని?" అడిగాడు, హఠాత్తుగా తననెవరో పట్టుకొని 'నీకు ఉరిశిక్ష పడింది' అని అంటే ఎందుకని అడిగినట్టుగా.

"స్వప్న తలిదండ్రులు ఉత్త ఛాందసులు! మీ పెళ్ళి జరగడం చాలా అసంభవం! స్వప్న మిమ్మల్ని మరిచిపోకపోతే ఆమె తలిదండ్రుల శవాలు ఆ ఇంట్లోంచి లేస్తాయని వాళ్ళు స్పష్టంగా చెప్పేశారు. దయచేసి మీ ఇద్దరి మధ్య స్వప్నని నలుపకండి! స్వప్నని మరిచిపోండి!"

"నేనొకసారి వచ్చి వాళ్ళతో మాట్లాడనా?"

"వద్దు" జవాబు ఖచ్చితంగా స్వప్న నుండి వచ్చింది. "అలాంటి పిచ్చిపని ఎప్పుడూ చేయకండి. మా ఇంట్లో మీకు జరిగే అవమానానికి నేను ఆత్మహత్య చేసుకు చచ్చిపోతాను!"

ఈ మాట అనేసి తనకేసి కన్నెత్తి అయినా చూడకుండా మధుర చేయిపట్టుకొని చరచరా వెళ్ళిపోతున్న స్వప్నని ఖిన్నుడై చూడసాగాడు స్వరూప్.

స్వప్నది పిరికితనమా? నిర్లక్ష్యమా? ప్రేమించి, ప్రేమింపబడి ఇద్దరు కలిసి కట్టుకొన్న ప్రేమసౌధాన్ని కూల్చడానికి ఎలా సంకల్పించింది? ; చదువుకొని

సంపాదిస్తూ కూడా ఒక వ్యక్తిత్వం ఏర్పరుచుకోలేదా ఈ దేశంలో ఆడపిల్ల?

మరునాడు స్వప్న బడిలో క్లాసు తీసుకొంటున్న సమయంలో ప్యూన్ ఒక కవరు తెచ్చి ఇచ్చింది. "స్కూటర్ మీద ఒకాయన వచ్చి ఇది మీకిమ్మని చెప్పాడమ్మా!"

స్వప్నకి ఆ కవరు చించాలనీ, చదవాలనీ లేదు. స్వరూప్ అందులో ఏం రాసి ఉంటాడో తనకు తెలుసు! 'స్వప్నా! ఎందుకిలా మారిపోయావ్?' అని గోలపెట్టి ఉంటాడు. 'మనం దూరం కావడానికి వీల్లేదు' అని అరిచి ఉంటాడు?

స్వప్న కవరు చించింది.

"స్వప్నా!

సాయంత్రం దేవీబాగ్‌కి రా! లేకపోతే నేనే మీ ఇంటికి వచ్చేస్తాను! నేను మీ ఇంటికి వస్తే నువ్వు ఆత్మహత్య చేసుకు చచ్చిపోతా నన్నావు! మన ప్రేమ విఫలం కావడమే జరిగితే ముందు నా చావే నువు చూస్తావు!

—స్వరూప్."

చివరి వాక్యం టైంబాంబులా భయపెట్టకపోతే దేవీబాగ్‌కి ఎంతమాత్రం వెళ్ళేదికాదు స్వప్న. దేవీబాగ్‌లో స్వరూప్‌ని కలుసుకోవడమే జరిగితే తనేమైపోతుందో తనకే తెలియదు!

సాయంత్రం ఇంటికి వచ్చి ముఖం కడుక్కొని టీ తాగి మధురని తోడు తీసుకోకుండానే దేవీబాగ్‌కి బయల్దేరింది స్వప్న.

గుండెల్లో గుబులు పుట్టించే ఎరుపును పులుముకొంటున్న ఆకాశంకేసి చూస్తూ స్వప్నకోసం ఆదుర్దాగా నిరీక్షిస్తున్నాడు స్వరూప్ దేవీబాగ్‌లో.

స్వప్న వస్తుందో లేదో?

స్వప్నతో తన ప్రేమ వ్యవహారం జీవన్మరణ సమస్యలా ఉంది! ఈ కులం ఎక్కువ పిల్లను ప్రేమించి తన మనసు నెంత చిత్రవధ పెట్టుకోవాల్సి వచ్చింది!

అతడి గుండె సుడిగుండంలో చిక్కుబడినట్టుగా, అగ్నిగుండంలో వేగుతున్నట్టుగా ఉంది! దాన్ని బయటికి లాగాలంటే స్వప్నకి తప్ప ఆ శక్తి లేదు ఎవరికీ.

అదిగో స్వప్న!

తనని ఆ సుడిగుండంలోకి మరింత లోతుగా తోసేసిపోతుందో?

అడుగులో అడుగు వేస్తూ నడిచివచ్చి తలవంచుకు నిలబడింది స్వప్న.

"స్వప్నా! మధుర టీచర్ చెప్పేదంతా నిజమేనా?"

స్వప్న కళ్ళనుండి జలజల రాలిన కన్నీళ్ళు, అదిరే పెదవులు, వణికే శరీరం స్వరూప్ ప్రశ్నకు జవాబిచ్చాయి!

"స్వప్నా!" పాతాళం అడుక్కి తలక్రిందులుగా జారిపోతున్నట్టుగా పిలిచాడు!

"నేను చివరి వీడ్కోలు తీసుకో డానికి వచ్చాను!" ఎలాగో గొంతు పెగల్చుకొని అంది.

"నువ్వింత పిరికిదానివా ?"

"పిరికిదాన్ని కాదు. బానిసని, ఖైదీని."

"ఎవరికి?"

"కన్యగా తలిదండ్రులకి. పెళ్ళయ్యాక భర్తకి. వయసు మళ్ళాక పిల్లలకి. తర తరాలుగా మా స్త్రీ జాతి ఇంతే. చదువు కొన్నా, సంపాదించుకోగలిగినా మాకు స్వంతంగా ఒక నిర్ణయం చేసుకోగల హక్కు లేదు. ఏ చట్టాలూ మా శృంఖ లాలు తెంచలేవు. ఏ ఉపన్యాసాలూ మమ్మల్ని మనుషులుగా నిలబెట్టలేవు."

"ఎందుకింత నిరాశ ? మీ అమ్మా నాన్నా చచ్చిపోతాం అని బెదిరించడం వల్లేనా ? అవి బెదిరింపులే! ఇలా బెదిరించినవాళ్ళు చచ్చిపోరు, స్వప్నా!"

"కాకపోయినా మా కుటుంబం నవ్వులపాలు అవుతుంది!"

"రెండు రోజులు ఒక విశేషంగా చెప్పుకొంటారు. తరువాత మామూలుగా కలిసిపోతారు! మీవాళ్ళు మొదట ఎంత తిట్టినా రక్తసంబంధాన్ని, మమతని అంత తేలిగ్గా తెంచివేసుకోలేరు!"

"నన్ను భ్రమలోకి, స్వార్థంలోకి లాగవద్దు, స్వరూప్! నిజంగా మీకంటే ఎక్కువ నరకం అనుభవిస్తున్నది నేను. అయినా మీనుండి దూరం కావడానికే నిశ్చయించుకొన్నాను. ఎందుకో తెలుసా ? కన్నవాళ్ళగుండెల్లో నిప్పులు గుమ్మరించి నేను మీ దగ్గర సుఖశాంతు లనుభవించలేను. మీ ప్రేమకు న్యాయం చేయలేను.

"కాలక్రమంలో నా తలిదండ్రులు నా తప్పును మరిచిపోయి నన్ను దగ్గరికి తీస్తారంటున్నారు కదూ? ఇదే కాలం నన్ను మీరు మరిచిపోయే శక్తిని ఇస్తుంది! ఇక నాకు సెలవు ఇస్తే వెళ్ళి పోతాను....''

చేతులు జోడించి నిలబడిన స్వప్న ముఖంలో కనిపించినవి కళ్ళు కావు! రెండు నిండు కోనేరులు!

జోడించిన ఆ రెండు చేతుల్ని తన చేతుల్లోకి ఆప్యాయంగా తీసుకొన్నాడు స్వరూప్. "స్వప్నా, నా కోసం నీ వాళ్ళని త్యాగం చెయ్యలేవా ?'' రుద్ధంగా అడిగాడు.

"ప్రాణమైనా త్యాగం చేస్తాను మీ కోసం! కాని, ప్రాణంకంటే గొప్పది ధర్మమనేది. అది త్యాగం చేయలేనిది. చేశాక మనిషి బ్రతుకే విలువలేనిది.

"స్వరూప్! నన్ను మీ మాటలతో బలహీనురాలిని చేయవద్దు. మీ ప్రేమతో నన్ను వివశురాలిని చేయవద్దు! కరుణ చిప్పిల్లే ఈ కళ్ళతో నన్ను బంధించవద్దు. స్వరూప్, నన్ను వదిలి వే.. యం....డి!'' స్వరూప్ చేతుల్లో ముఖం దాచుకొని ఏడవసాగింది.





# నోటి దుర్వాసనను ఆపండి...
# కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
# దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారీ భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు. పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన. దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు !




**ఒక్క దంతవైద్యులు మాత్రమే**
**దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు**

DC G 64 TL

మన ప్రేమకు గుర్తుగా నీనుంచి ఒకటి తీసుకోవాలనుకుంటున్నాను."

"ఏమిటి?"

స్వరూప్ స్వప్న నుదురు చుంబించి "ఇది మాత్రమే. వెళ్ళు, స్వప్నా! ఇంకెప్పుడూ నేను నీ కళ్ళబడనని నీకు హామీ యిస్తున్నాను," అన్నాడు. అని అక్కడ నిలువలేదు. గబగబా వెళ్ళి తన స్కూటర్ స్టార్ట్‌చేసి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

గడ్డిలో కుప్పగా కూలిపోయి దయనీయంగా రోదించసాగింది స్వప్న.

అయిపోయింది.

ఇక్కడ పెంచుకున్న ప్రేమలతను తన చేతులతో ఇక్కడే ఛిన్నాభిన్నం చేసింది! ఈ చోటికి స్వరూప్‌ని వెతుక్కుంటూ తనెప్పుడూ రాదు! స్వరూప్ కూడా రాడు!

స్వరూప్ ఎప్పుడూ కూర్చునే ఆ చోటుని ఆప్యాయంగా తడిమింది స్వప్న.

## 4

ఆ గడియ వస్తే కళ్యాణం అదే అయిపోతుందన్న ఉదాశీనత్వం వదిలిపోయింది విశ్వేశ్వరయ్యకు. కూతురికి వెంటనే పెళ్ళిచేసి పంపేయాలని సంబంధాలకోసం కాళ్ళకు బలపాలు కట్టుకొన్నట్టుగా తిరగడం మొదలుపెట్టాడు. ఇదివరలో 'నా బిడ్డ బి.ఎ. చదివిందికదా? ఎమ్.ఎ.నో అంతకంటే ఎక్కువ చదివిన వాడు కావాల అనేవాడు. ఇప్పుడు అలాంటిదేం పెట్టుకోలేదు. సంప్రదాయస్తులై మాటికి గుడ్డకి లోపం లేకపోతే చాలన్నట్టుగా ఉన్నాడు.

ఏ సంబంధం తెచ్చినా వ్యతిరేకించే స్థితిలో లేదు స్వప్న. తల నరకడానికి ఏ కత్తి అయితేనేం అన్నట్టు జడత్వం దాల్చిందామె.

"నీ కూతురికి కట్నం డబ్బులు సంపాదించి పెట్టడానికే నన్ను కన్నావా" అని అడిగే పురుషోత్తం ఇప్పుడు ఏ సంబంధానికైనా, వాళ్ళనుండి ఎంత కట్నం పిండడానికైనా సిద్ధంగా ఉన్నాడు.

ఈ సంగతి తెలిసి సుజాతకి కంపరమెత్తింది. ఆమె పురుషోత్తంమీద అనురాగం పెంచుకొన్న మనిషి. అతడితో జీవితం పెనవేసుకోవాలని తాపత్రయపడుతున్న మనిషి.

ఒకరోజు దిగులుగా తండ్రికి చెప్పిందీ విషయం. "నాన్నా! పురుషోత్తానికి సంబంధాలు వస్తున్నాయట!"

"నిన్ను చేసుకొంటానని మాటిచ్చాడు కదమ్మా?"

"ఏమో? నిన్న కలుసుకొని మాట్లాడాలని చూస్తే ముఖం తప్పించాడు."

"నేను కనుక్కుంటాలే అమ్మా!"

ఆరోజే వెళ్ళి విశ్వేశ్వరయ్యను కదిలించాడు శీనయ్య.

(సశేషం)

Printed and Published by A. Chandrasekar Rao at 5-9-88 Public Garden Road Hyderabad-500001, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001 Editor: A. SUDHAKARA RAO

# క్విజ్

## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాం. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "నవంబర్ క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి స్వయంగా వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.
2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్‌కరెక్ట్ సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్ము పంపకం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతి అనులుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన 'కీ' సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను నవంబర్ సంచికలో ప్రకటిస్తాము. ఈ విషయమై ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు
5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ సెప్టెంబర్ 21. ఆపై వచ్చినవాటిని పరిశీలించడం జరగదు.

## నవంబర్ నెల క్విజ్

1. భారతదేశంలో హిందీ తర్వాత ఎక్కువగా మాట్లాడే భాష
   ఎ. మరాఠీ బి. గుజరాతీ సి. తమిళం డి. తెలుగు
2. ప్రపంచంలో అతి పెద్దదయిన టెలిస్కోప్ బరువు
   ఎ. 750 టన్నులు బి. 900 టన్నులు సి. 850 టన్నులు డి. 800 టన్నులు

3 భారతదేశంలో పొడవయిన నది

ఎ గంగా బి గోదావరి సి కావేరి డి బ్రహ్మపుత్ర

4 ప్రపంచంలోకెల్లా ఎత్తయిన టెలివిజన్ టవర్

ఎ 1565 అడుగులు బి 2000 అడుగులు సి 3000 అడుగులు

డి 2063 అడుగులు

5 మొట్టమొదటి టెస్ట్‌ట్యూబ్ బేబీ పేరు

ఎ లెస్లీ బ్రౌన్ బి గిల్‌బర్ట్ బ్రౌన్ సి లూయిస్ జాయ్ బ్రౌన్

డి పాట్రిక్‌స్టెప్‌టో

6 ప్రపంచ చరిత్రలో 1492 సంవత్సరపు ప్రాముఖ్యత———

7 సూర్యుణ్ణి చుట్టి రావటానికి మార్స్‌కు పట్టేకాలం———

8 ప్రపంచంలో ఎండాకాలంలో పగలు ఈ ప్రాంతంలో ఎక్కువసేపు వుంటుంది———

9 పారిస్‌లోని ఎఫిల్‌టవర్ డిజైన్ చేసిన వ్యక్తి———

10 మైక్రోవేవ్‌తో వంట చేయటం కనిపెట్టినవారు———

యువ

క్విజ్ కూపన్ - నవంబర్ 79

సమాధానాలు

1 ☐ 2 ☐ 3 ☐ 4 ☐ 5 ☐

6 ———— 7 ———— 8 ————

9 ———— 10 ————

పేరు ————————

అడ్రస్ ————————

————————

————————

